# ప్రభాతకథావళి

( కర్త కర్త లు )

# దాసవవర్థ

## ( నాటకము )



ఇది

బ్రహ్మర్షి ఉమర్ అలీషా కవిగారిచే

రచింపఁబడినది.





విజ్ఞాన విద్యా పీఠము

పిఠాపురము

తూ॥ గో॥ జిల్లా.

1988

# ప్రభాతకథావళి

(కథలు)





ఇది

"బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా కవిగారిచే

రచింపఁబడినది.

శ్రీ విజ్ఞాన విద్యా పీఠము

పిఠాపురము

తూ॥ గో॥ జిల్లా.

**1988**

# శ్రీ ఉమర్ ఆలీషా కవిగారి
# జీవితసంగ్రహము

ఉమర్ ఆలీషా మహాకవిగారు పీఠకాపురమున క్రీ. శ. 1885 వ సం।రంలో జన్మించిరి వీరితండ్రిగారు మహర్షి మొహియద్దీన్ బాషా గురువర్యులు, వీరి జనని చాన్బియాంబ.

వీరి తండ్రిగారు అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్ర పండితులు, ఆధ్యాత్మిక విద్యాపీఠాచార్యులు, ఆత్మవిద్యాసారంగదులు. వీరి కుటుంబము పూర్వమునుండియు భాషాపాండిత్యమునకు, ఆధ్యాత్మిక విద్యా సంపత్తికిని ప్రఖ్యాతిగాంచినది. శ్రీకవిగారు చిన్ననాడే సంస్కృతాంధ్రములు విశేషముగా నభ్యసించిరి తదుపరి అరబ్బీ పారశీకాంగ్ల భాషలు నేర్చిరి. వీరుఆంగ్లమున వ్రాయుట, మాట్లాడుట యెఱుంగుదురు; కాని ఆంగ్లపద్య కావ్యములందు ఎంతమాత్రము వీరికి ప్రవేశములేదు వీరు సహజకవులు. వీరి 14వ వర్షమున తెనుగున ధారాళముగా కవిత్వముఁ జెప్పిరివీరి18వ యేట"మణిమాల"యను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. అది షేక్స్పియర్ మహాకవి నాటకమువలెనున్నదని అప్పటి పత్రికలు కొనియాడినవి. వీరి కనేకచోట్ల ఉద్యోగములిచ్చెదమని ఆహ్వానించినను వాని కంగీకరింపక భాషాసేవ దేశసేవఁజేయుచు తమ జీవితమును గడిపిరి. వీరు 1934వ సంవత్సరము డిశంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులైరి. అపదవి వీరి మరణము వరకు నుండెను.

వీరికి **International Academi of America** వారు 1936 సం॥న **Doctor of Literature** బిరుదు మొఁసగిరి శ్రీకవిగారు వంశపారంపర్యముగా వచ్చుచున్న ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు ఆచార్యులై పదహారు వేల జనమును శిష్యులుగా నొనర్చిరి.

వీరి యౌగికజ్ఞానమును కొనియాడుచు జ్ఞానసభాసభ్యులు వీరికి బ్రహ్మర్షి బిరుదు మొసంగిరి. వీరిసతీమణి అగ్బరు బీబీగారు వీరితో ఢిల్లి నగరమువెళ్ళి ది. 5-4-35న దివి నలంకరించిరి. ఆదినమున ఢిల్లీశాసన

సభ మూయబడెను. వీరి గతించినప్పుడు వీరికి అయిదుగురు కుమార్లు యిరువురు కుమార్తెలు పెక్కురు పౌత్రిపౌత్రికలుండిరి.

శ్రీకవిగారి జీవిత చరిత్ర ప్రత్యేక పుస్తకముగా వ్రాయబడు చున్నది. వీరు రచించిన సూఫీవేదాంతగ్రంథమందు వీరు జీవితము సంగ్రహముగా నిట్లువ్రాసిరి.

—♦ స్వీ య ము ♦—

క. ఆ మొహియద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నా మహితాగమ హితవి
ద్యామత"ఉమ్రాషా" మహాకవి నేనున్.

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్యప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసిననాఁడను కల్పనాసక్త మతిపది
నాటకంబులను కర్ణాటఫక్కి
కూర్చినాఁడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలుపది నవ నవల లనఁగ
తెలిగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికులలర

తే. రసము పెంపార నవధానక్రమములందు
ఆశులవులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాస సీమలెక్కి
యవని "ఉమ్రాలిషాకవి" యనఁగ నేను.

ఉ. రాజుఁల జూచితిన్ సుకవిరాజుల నోర్చితిఁ బేరుమ్రోయ రా
రాజులఁ నోలగంబుల విరాజితపండిత సత్కృపింద్ర వి
భ్రాజిత మౌలవిబిరుద పట్టములందితి యూనివర్సిటిన్
దేజముమీఱ సభ్యుడయితిన్ మతబోధకుఁడైతిఁ గ్రమఙన్.

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వరసైక చారు వి
న్యాసములున్ మతాంతరమహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాఁడను "ఉమ్రలిషా" కవీంద్రుఁడన్.

ఉ. వేలురచించి విద్యలనుబెట్టి గడించితి పారితోషికా
ద్యాళిని వేయినూట పదియార్లను సింహతలాడముల్ మహా
భీలకసత్కళాకనక విశ్రుతముల్ జయభేరి మ్రోయ హిం
తాల వనీనటత్కుకవి తండము లేమిటి లెక్క మాకడన్.

సీ. సాధించితిని యోగసాధనంబులు హిమా
గమ మెక్కి మతిని చక్కాడియాడి ;
బోధించితిని జ్ఞానసాధనక్రమములు
చెవినిల్లుగాఁ జేసి చెప్పి చెప్పి ;
సవరించితిని పెద్దసారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి ;
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్ర
భుత్వంబు ముంగరమోపి మోపి.

తే ఇప్పుడప్పుడె నలుబది యేండ్లపైన
దాఁటిపోయెను వయసు నీనాటికైన
శాంతి గలుగదు నీ కళాధ్వాంతమందు
జీవితము తెన్ను సుడిబోవు నావబోలు.

మ. నను నీజ్ఞానమహాసభాసదులు నానందాన నర్థించి 'ఆ
దిని మీపూర్వపితామహుల్ గురువులై దివ్యత్వమేపారఁగా
ఘనవిజ్ఞానకళా ప్రవృష్టి ప్రజహృత్కాంతారముల్ నింపి రా
మని మీరాకృతి బోధసేయఁదగు 'ఉమ్రాలీష' బాషాగతిన్.

మ. అని నెయ్యంబునఁ గోరఁగావిని మహాహర్షంబు సంధిల్ల నా
నని యా జ్ఞానమహాసభాకథన మత్యంతంబు కష్టంబు మే
దిని సంసారనిమగ్న మానసులు నర్థింపంగ సాధ్యంబు గా
దని యున్నంత నెఱుంగసేతునని నే నారంభమున్ జేసితిన్.

ఉ. భారతదేశ శాసనసభా సభికత్వపదంబుఁ జేర నేఁ
గోరఁగ జ్ఞాన సభ్యులు నకుంఠితపేక్ష జగంబు మెచ్చఁగా
భూరితప స్సమాధి తమ బుద్ధిని నిల్పి జయంబుఁ దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలఁ జుండుఁ జూచితే.

చ. కవిత నెఱుంగనట్టి పృథుకాలము వ్రాసితి పుస్తకంబు లా
కవిత నెఱింగి వ్రాయుటకు గంటమురాదు, నుపన్యసించు నా
దినముల విద్యతోఁ గలసి తృప్తిఘటించెడు వాని నిప్పుడో
లవము నుపన్యసించుటకు లజ్జఘటించెడు నేమిచెప్పుదున్.

శా. ఢిల్లి భారతశాసనైకసభ రూఢిన్ ప్రాతినిధ్యంబు సం
ధిల్లన్‌జేరిమహత్తరోజ్జ్వలకళాధిక్యంబురంజిల్ల వి
ద్వల్లోకంబున రాజకీయకలనావ్యాపార పారంగతం
బెల్లన్ వేట్కను నిర్వహించుచును నేనీగ్రంథమున్ *వ్రాసితిన్.

ఉ. ఏమహిమాలయంబుపయి కెక్కి తపస్వులఁ జూచి వారి వి
న్నాణములన్ గ్రహించి విజనంబగుచోట రచించినాఁడ నా
నా నవ కావ్యమార్గము లనంతముగా హృదయాంతరంగ వి
జ్ఞానము విశ్వరూపముగఁ గన్పడునట్లు దృశంబు మార్చుచున్.

శా. నాలోనున్నవి నేనుజూచినవి విన్నాణంబులై లోకమం
దాలోకింపఁగ రాని యీ యమరవిద్యాతత్త్వమర్మంబు లం
దేలోటున్ జనియింప దీశ్వర రహస్యైకైక మీమార్గమే
మేలా దాచెదమంచుఁ జెప్పితిమి మీరిద్ధాత్ములై తేరఁగన్.

కం. మా తాతయు మాతండ్రియు
ఖ్యాతిని అఖిలలీ మహాగురువర వి
ద్యాతత్త్వము నేర్చిరి త
ద్రీతుల వివరింతు యోగరీతులు తెలియన్.

## —♦ అగ్బ రాం బ —♦

శా. ఆ ఢిల్లీనగరాంగ్ల శాసన సభాభ్యర్థిత్వ మర్థింపుఁ డం
చాడన్ నేను కృతార్థుఁడై జనిన నాకై వచ్చి ప్రాణంబులున్
వీడెను నానతి అగ్బరాంబిక చిలత్ విద్యుల్లతన్ బోలె ;యీ
నాఁ డేనశ్రులు 'గోరి' పైవిడుచుచు న్వర్తింతు నిర్జీవినై.

ఉ. ఏను రచించినిట్టి కృతు లెన్నిఁటినో విని తల్లి ; తండ్రి నా
నా నవనాటక ప్రకరణంబులు నాఁడగ జూచినారు ; ఢి
ల్లీ నగ రాంగ్ల భారతమహీధవ శాసనసభ్య సత్పదం
బానఁగ గాంచి 'అగ్బ' రమరాలయమేగె వెలుంగుచుక్కయై.

---

* సూఫీవేదాంతదర్శము

శా. ఎన్నో బాధలు బొందుచుండు మని నన్నీ భూమివర్జించి యా
పున్నెంపుంగని అగ్బరేఁగె దివికిన్ బూర్ణేందుబింబంబు వా
ర్ధి న్నిద్రింపగ బోయిన ట్లీఁక మహాంధీభూత మాలిన్య సం
ఛన్నాత్మన్నన్వినిపిద్ధజీవిత మభాసం బెన్ని నాళ్ళుండినన్.

సీ. ఏమాట చెప్పిన నెదురాఁడగా లేదు
పరమసాధ్వీత్వంబు వరలుకతన
ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసె
పరమహర్షంబు ముందరను నిలువ
కలిమిలేములను నొక్కటిగాఁగ గణయించె
నిత్యకళ్యాణంబు నెలకొనంగ
ఏవురు కొడుకుల నిద్దరు కూఁతుల
ననిశంబు దీవించి నాత్మశాంతి

తే. ప్రతిదినంబు చదువు ఖురాన్న మాజు
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె అగ్బ
రాంబ దివిజులు నీరాజనంబులిడఁగ.

చం. పరమపవిత్ర యీ వెలది పండితురాలు నితాంత సత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడ్డికిబారెడు ప్రేమమూర్తి సుం
దర సముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి యీ
శ్వరునెద నగ్బరాంబ కడు ప్రార్థనసేయుచు నెల్ల వేళనన్.

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లిలో బ్రిటీషుసామ్రాజ్యంబు పాలించు వా
రెల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
పుల్లాబ్జానన 'అగ్బరాంబిక' భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లున్ విచ్చిన కుండఁబోలె వెస నే జీరాడుచున్నా నిటన్.

చం. హృదయము ముక్కలౌనటుల నేడ్చుచుఁగన్నులనీరు కాల్వలై
చెదరఁగ నిమ్న లోకములఁ జేరుటకంటె సమాధితోంటి నీ
సదనము జేరుమార్గము విచారణజేయుట లెస్సయైహిక
స్పద విభవానుషంగభవబంధమువాసిన నిన్ను చూడఁగన్.

శ్రీ కవిగారు యిస్లాంమతస్థులు వీరు మాతృభాషఉర్దూ. ఆంధ్ర భాష మాతృభాషగా కానివారు తెనుఁగున సరసకవిత్వము జెప్పిన వారు ఈ కవిగారొక్కరే వీరు రచించిన మహాభారతకౌరవరంగ మను నాటకమున___

నాటకముల్ ప్రబంధము లనంతముగా రచియించి వాణి కా
వ్యాటవి భావవీధుల విహార మొనర్ప జయధ్వజంబు వా
గ్వ్యాటిని నిల్పినట్టి జనవిశ్రుత ఉంరలీషా కవీంద్రుడున్...."

అనివ్రాసిరి.

వీరు రచించిన గ్రంథము లేబదివరకున్నవి శ్రీ కవిగారు తమ శిష్యులకు దర్శన మిచ్చుటకై నరసాపురము (పశ్చిమగోదావరిజిల్లా) వెళ్ళి అచ్చట ది 23 జనవరి 1945వ నాటి సాయంత్రము 5గంటలకు దివి నలంకరించిరి. వీరి భౌతికదేహమును పిఠాపురముఁ దెచ్చి 24 వ తేదీ సాయంత్రము రైలుస్టేషనువద్ద నున్నవారి యరామములో సమాధి చేసిరి.



శ్రీ శ్రీ విజ్ఞాన విద్యాపీఠము

# *BRAHMARISHI*

# DR. UMER ALI SHAH

## TELUGU POET.

"A really great man has ideas always greater than himself" This is more true of Dr. Umer Ali Shah, the immortal poet of the Telugu language, than anyone else. He was born in March 1887 in Pittapuram, a town in the Andhra State of India.

Though he had no proper education he developed a great taste for Telugu which was not his mother tongue. and began writing verse when he wase a teenager. The genius of the boy was at once recognrzed by Telugu scholars and his fame grew as a poet by the time hi was 18.

He wrote plays in Telugu which can only find a parrallel in Shakespeare's. Many Hindu poets and scholars began to pay ribute to this Muslim poet of the Telugulanguage and regarded. im as a itern-poet in the Carlylian senes of the word.

His writings took a new shape in all branches of literature Besides poetry he wrote novels, plays and essays which excelled the writings of the renowhed Telugu schoiars of the twentieth century, and so on his works found a permanent place in the annals of Telugu literature.

Today he stands alone like a pole star guiding those who are interested in Telugu litereture, and he is acknwledged as their great master who brought a change over literary forms in Telugu.

He also made fresh departures in almost every form of literature. His poetry has no parallel In Telugu, despite the great writers whose works no doubt come nearer to his standard, and yet, lack that charm and cadence, lucidity and masterly style both in narration and criticism.

His vast knowledge of Sanskrit in which language also he was a scholor, contributed effectively towards his prodigious efforts in Telugu with his contribution Telugu leterature would be nowhere as rich as it is today.

What Shakespeare is to the English, what Dante is to the Italians. what Dr. iqbal is to Urdu speaking Muslims, Dr. Umer Ali shah is to the Hindus of Andhra.

His writings have no other parallel, as I stated before, in any other literature of the world, becase they are the creation of one man. He had to his credit such a vast bulk of written work in all literary forms that no one author in English or any other language could have produced.

But alas ! It is confined to Andhara, and Andhra only, and its great merit lies hidden outside the state even in India, not to speak of foreign countries

Yet his reputation, by a curious twist of fate, soared aloft

In 1936 the International Academy of America confirmed upon him the degree to doctor of literature for his thesis in Telugu. For a man with no university education to obtain such a high degree from the new world is certainly a matter of pride to the individual as well as to the province in which he was born

His was no ordinary intellent, thought he knew little English when compared to his ability in Telugu and Sauskrit.

His works in Telugu are clear evidence of what he struggled for, lived for and clied for He was out and out a nationalist purposed to reform the people around him culturally, socially economicily and politically, and accordingly he rendered youngman service to humanity at large during that little span of his meteoric rice.

He did everything in his capacity. His School of thohght pervaded all his works and helped remove the dogmatic ideas and beilefs of the ignorant and the illiterate and led them to the supreme path of glory and virtue

This won for him a saintly honour and he came to be regarded by all Hindus as a saint His writings spelled the qualities of a great seer.

Though he was a Muslim, the magnanimity of the Hindus Could not deprive him of what he was in truth, not did they (the Hindus) leave him in the lunch, but nursed his genius tenderly till it gava them the best of the life they needed. And he did not disappoint them.

Dr. Umer Ali Shah was also a social reformer in his own environs He had reformed the Hindus, customs and manners by dint of his profound knowlege of Sanskrit and the Hundu philosophy which he had mastered.

He know more them any Hindu scholar of his day. He could recite slokas so fluently and so correctly intepret them in Telugu that the pundits were stunned at his mastery.

All Hindus of Andhra admit that he had surpassed all in every branch of Telugu liteature and he came to be regarded as the only eminent poet in modern times in that language.

His writings created a sensation throught Telugu speaking areas both within and outside Andhra State. Indian universites adopted his works in their curricular for degree classes and no library is without his books.

His political caraer overlapped his literery one and he was so engrossed in both that it is very difficult to think of the one without the other.

During the last decade of his life his ltterary fame was at its highest while his political activities continued till his daeth.

He had to make mady trips every year from south to north to be presence in the Legislative Assembly at Delhi from the time when he was elected independently in 1935. From them on he used to repair to the hill-tops of simla to invoke the muse and produce his master-pieces in Telugu literature, even in his political travails.

Apart from his literary acties, his political career was also remarkable He was known as a good politician. Mahatma Gandhi accepted him as a man with sound political ideas when he was in congress upto 1935.

He worked for the nation unhesitatingly during the khilafat movement and was held in high esteem by all the national leaders of those times. His assemble speeches contained sound principles of integrity and magnanimity and therefore saw the press of his day.

Besides, he worked for tha good of the country delivering lectures everywhere irrespective of religian, cast or creed with a view to promoting goodwill amongst the people for which he was adored by Muslims and Hindus alike.

When he was preoccupied with political affairs and when his literary fame was at its zenith he was suddenly shaken by a tragic event His beloved wife Akbarbebi died Delhi In April 1935 when he was attending the sessions.

This shock are into his vitals and he breathed his last in January 1945 after a cerebral hemorrhage in a village of Narsapur

His body was brought for burial ro Pittapuram where every year Congregational meetings are held for one week by his 20,000 disciples including eminent poets end scholars of Andhra state in honour of their great hero-poet and he lies forever enshrined in their hearts.

—M. N. HUDA



చ	సుదతి మహాపతివ్రత ని
శుద్ధచరిత్ర పవిత్రగాత్ర నూ
డిదవలె పోల్చి నాకయి క
డింది భరంపడి హస్తినాపురిన్
హృదయము ప్రక్కలింప దివి
కేగిన నాసతి 'అగ్బరాంబ' కే
నిది కురురంగ సత్కృతిని
నిచ్చెద తర్పణమిచ్చు కైవడిన్.



"బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా
శ్రీ అగ్బరాంబ

క. జగమున ధర్మము నెల కొ
ల్పఁగ నీశ్వరుఁ డొక్క దివ్యవ్యక్తినిఁ బంపున్
యుగ యుగమున నాతఁడె యీ
సగుణాత్మకుఁడైన సారసాక్షుఁడు గంటె.



"బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా

చ. అణువులయందు సుందర యజాండమునందు హిమాంబు సూక్ష్మపుం
గణములయందు సూర్యశశికాంతులయందు పరాత్పరా భవ
ద్వినుత విలాసవైఖరి ప్రవీణతఁ దోఁచుచు నున్నదింకనిన్
గనుగొన లేనిచో కనులు గల్గిన నందులుగారె మానవుల్.

# పరంజ్యోతి

పడిన కష్టాలు పాటవంబలతిగాక !
సడలిపోయిన సౌఖ్యాలు స్మరణ రాగ
మాశిపోయిన మాటలు మరపురాక
పాటపాడిన పదములు పలుకలేక
వెడలిపోయిన కాలంబు వెదకుచుంటి
వెతుకుచుంటి నామరుగునే వెతకుచుంటి
తెలుసుకొంటి నామరుగునే తెలుసుకొంటి
తిరిగి కాలంబురాదని తెలుసుకొంటి (జన్మ)
లేదు పరతంత్రమికనాకు లేనెలేదు ;
లేదు నాయన్న మౌఢ్యంబు లేనెలేదు
స్వార్థమున నీప్రకృతి నాకు స్వస్తి జెప్ప
భ్రాంతిలోగన్న విషయ విభ్రాంతిగాగ
పోవుచుంటి నాదారినే పోవుచుంటి
కాననంబులో పురములో కానరాని
ఆ అయోమయ మధ్వాన్నమైన దారి
అప్రళయకాల దంధయ్యిమైన యట్టి
చిమ్మ చీకట్లు చెంగట చేరి చేరి
జరిగిపోయె సహస్రులు జగములోన
దాటిపోయెను మెన్నులా దారిలోన
స్వర్గ నరకాల వీధులాశ్చర్యముగను
దారులివ్వగ వాటిని దాటి నిలచి
చూచినా నది నిజముగ శూన్యజగము
కలతబడి మనో దుఃఖాన గలయజూడ
అంతదూరాన నేదియో నవతరించె
అందులో రూపమేదో నాకానుచుండె
అందు బ్రహ్మాండములును రూపొందుచుండె
ఎవరిదారూపు నాకపుడెరుక బడియె
అధియె నా గురుని స్వరూపమవధిగాను

అతడె ఆఖై లలీషుడు అది నిజంబు
అదియు ప్రేమైక రసరూప మవ్యయంబు
వెలువడెను గాదెనందుండి వెలుగదేహె
నిండెనా వెల్గు జగముల నిండె నిజము
నిండె నావెల్గు నాలోన నిండె నిజము
నిండి నాలోన జతనావ మండిపోవ
నిలిచె సంతృప్తిం నాలోన నిలిచిపోవ
ఇమిడె ప్రమదంబు నాలోన నిమిడిపోవ
తెలిసె జగములు "నేన"ని తెలిసిపోయె
నేనె "విశ్వంబు" విశ్వంబు నేనె నిజము
నిజము యీ దృశ్యమంతయు "నేనె" నిజము
గగనములలోన నారూపె గానుపించె
భాస్కరునియందు నారూపె బరగుచుండె
సలిలమందును నారూపె సాగుచుండె
ఈవసుందర నారూపె యెసగుచుండె
అరయ వాయువులో నిండినదిగొ దోచె
అదిగో వైశ్వానరుని నిండెనదిగొ చూడు
ఎన్ని చెప్పదు సర్వంబు "నేను" గాను
సృష్టినంతయు నాలోనె చూచినాడ
ఇదే పరంజ్యోతియన నొప్పు నీ వెలుంగు
ఇదియె యోగులుగన్నట్టి జ్యోతి సుమ్మ
నిలచిపోదు నీ జ్యోతి నేనెప్పటికిని
నిలచేపోయి నీ జ్యోతి నేనెప్పటికిని
రాను మిముజూడ వాంఛనే రాను రాను
తిరిగివచ్చెడి నాశలు తీరిపోయె
నెడలి వచ్చిన మాటలు వేరు లేవు
లీనమగుదు నీ జ్యోతిని నేనుగానె!
మరచిపొండింక నారాక మఱచిపొండు
వదలివేయుడు దర్భలు వదలునట్లు
విడచివేయుడు ధారను విడచునట్లు
ఇట్లు "హుస్సేనుషా" కవి ఎరుక జెప్పె!



"బ్రహ్మఋషి"

శ్రీ హంసేన్ షా

శ్రీ అజీమున్నిసా

# శ్రీ విజ్ఞాన విద్యాపీఠాశయము

శ్రీ విజ్ఞాన విద్యాపీఠమహర్షి జ్ఞానవేదమూర్తులు శ్రీశ్రీహుస్సేన్ షాకవి కృతంపాతత్వసంహితము యీశ్వరవాణిగా పలికి ఈశ్వరవాణిగా విశ్వమానవకోటికి శ్రీ విజ్ఞాన విద్యాపీఠమహాసభాసభ్యులకు అమితానందముగా చేయుచు భౌతికవిధానమందు అనేక జీవిత విశేషములకులోనై విరక్తిభావము శారీరకముగా కలుగుటవలన మానసిక నిశేషమును, పురస్కరించుకొని ధర్మప్రభోధమునుగావించి మానవుని మానవుడుగా మార్చుటయే యీధర్మముయొక్క లక్ష్యము. అనగా శ్రీ విజ్ఞాన విద్యాపీఠముయొక్క విశేషము. ఇది సృష్టి పుద్భవించి, యుగయుగాలుగా, తరతరాలు సృష్టిలో శాఖోపశాఖలుగా ఏకేశ్వరోపాసనచేయుచు, శృతి, స్మృతిలోస్మృతి గాపాడుచు జాతిమత విచక్షణలేక యదార్థమైన రసస్వరూపము శ్రీపీఠాచార్యునిమంత్రప్రభావముచేత జీవి ఆత్మపరిణామము అభౌతికమైనటువంటి దృశ్యరూపములో చిత్రించుటయే శ్రీ విజ్ఞాన విద్యాపీఠముయొక్కలక్షణము. దాని యదార్ధ ధర్మ విషయము. ఇదిఆచరించి అనుసరించినవారికి అనుక్షణము లోకవిషయ వాంఛలను దూరముచేసి సంకల్పసిద్ధిఁజేయును.

# పద్యరత్నములు

1) సీ॥ తరతరంబులనుండి తాతతండ్రులుమున్ను
విజ్ఞాన విషయంబు వివిధవిధము
మణులు మాణిక్యముల్ మదిని బడయునట్లు
సర్గపదార్థద్వయము సంగ్రహించి
వివిధదేశంబులు వెడలి సభ్యకులము
వినుతిగావించి రావిశ్వమూర్తి

ఆధ్యాత్మవిద్యల కాకరం బగు మహా
జ్ఞానశక్తిని తపశ్శక్తి బడసి

తే॥ గీ॥ ధర్మమననేమి యో దెల్పి ధరణి కెగసి
అమృతకరులై బోధకాధ్యాపకులుగ
నుండి పీఠికాపురమందు నోలగముల
ప్రభువులైయుండి రాహీ "షా" వంశభవులు.

2) ఉ॥ అన్నిటికన్న గొప్పమహిమాస్పదమైన మహత్మ్యముండు,నిం
దున్నది ఆ "షాతత్వ"మనె నుత్తమగ్రంథము దైవదత్తమై
సన్నుతమై పవిత్రమయి శాసనమై సచరాచరంబులో
నున్న రహస్యముల్ దెలుపుచున్నది యీశ్వరవాణిసృష్టికిన్.

3) తే ॥గీ॥ ఇట్టి విజ్ఞానమతము నర్థించి ప్రేమ
పాఠములునేర్పి విజ్ఞాన పక్కి గూర్చి
మానవోద్ధార కుండన మహినివెలసి
మలినములుమాపె "హుస్సన్‌షా" మౌనివరుడు

4) తే॥ గీ॥ ఏదొవేవెల్గు షాతత్వ నేగుదెంచి
అందులోన హుసనుషా కృతవతరించి
వచ్చినిలిచె తేజంబుగ వసుధయందు
దెచ్చితిని నీకిదేయని తేటపరచె.

5) తే॥ గీ॥ వేలు లక్షలు శిష్యులు పొలుగూడి
పర్జ, లజ్ఞానతిమిరంబు బారద్రోలి
భద్రమార్గమే కేశ్వరోపాసనంబు
ననుచు చాటిరి హృదయధక్కానుభూతి.

పంచరత్నములు సమాప్తము.

(పీరాచార్య)



శ్రీ శ్రీ విజ్ఞానవిద్యాపీఠాచార్యులు



భావి పీఠాధిపతి



# శ్రీ విజ్ఞాన విద్యా పీఠాశ్రమము

పి ఠా పు ర ము



# పీఠిక

"ప్రభాతకథావళి" యనుపేర నేనుకొన్నాళ్లక్రితము పెక్కు చిన్నచిన్న చారిత్రక కథలు వ్రాసినాఁడను. ఇవి కేవల మానవజీవితములోని యపార పరిణామములచే లోకమెట్లుమాఱి మహనీయమైన స్థానమలంకరించుచు వచ్చినదో యే యేసందర్భములయందు నెట్టెట్టి ప్రమాదశతములకు లోనై దగ్ధావశేషమైన నాగరికతాస్వరూపము మరల రేకెత్తి దిగ్దిగంతములు జ్ఞానప్రభాశోభితమై యలరారుచుండెడివో అవిన్నాణములే నిగూఢమైన వాస్తవములపై మోసియున్నవో ఆ రహస్యము లామార్గమెఱింగించునవే చరిత్రలుఆచరిత్రలు కవికాలానుగుణ్యముగ మంచియందేమేమోకవితాశిల్పములు గూర్చి చిత్రించి భావవీధులలోఁ బ్రవేశింపజేయునప్పుడు కథలుగాఁ బురాణములుగా వెలయుచుండును. అందు ముఖ్యమైన నైతికవైజ్ఞానిక సారస్వతాది నానావిధ ప్రతిపాదకములగు ప్రధానవిషయుల నెఱింగించుపెట్టున నతివిస్తరముకన్న సంగ్రహమే యగత్యముగావున కథలు ఛాందనముఁ బర్యాయపదభూయిష్టముగావించి పాఠకుని మెదడును పాడుచేయుటకంటె చెప్పవలసినవేవో హృదయము నాటుకొనిపోవునట్లు చెప్పుటలోనే సొగసున్నది నేనట్టిసూత్రములుపై యీకథారచనము గావించితిని. ఈపొత్తము మా జ్ఞానమహాసభాసభ్యులచే ప్రకటింపబడినది.

పిఠాపురము,<br>25-12-34.

ఇట్లు,<br>ఉమర్ ఆలీషాకవి.

# విషయసూచిక.







# ప్రహ్లాదుడు.



ప్రహ్లాదుడు జ్యోతిష్మతీపురము పరిపాలించిన హిరణ్యకశిపుని పుత్రుడు. ఈతనితల్లి లీలావతి. చండామార్కులను బ్రాహ్మణులయొద్ద నైదవయేట విద్యాభ్యాసార్థము తండ్రిబడిలోవేసి చదివించుచుండెను. చండామార్కులు చాల మంచి ఉపాధ్యాయులు ప్రహ్లాదుని కెన్నో మంచి మంచి పుస్తకములు చదివించు చుండిరి. ప్రహ్లాదుడవి యన్నియుఁ జక్కఁగాఁజదివి నీతిజ్ఞానము వినయము నేర్చుకొనియెను.

ఇట్లుండ నొకనాఁడు ప్రహ్లాదుఁడు ఈశ్వరుని గూర్చిచింతించి బడికిఁబోయి సొవధ్యాయులతో మనచదువులో నీశ్వరునివర్ణించుపాఠములేవియులేవు. ఈశ్వరుఁడను ఒక మహిమగల భగవంతుఁడున్నాఁడు అతఁడులేనిదే సృష్టికాఁజాలదు సృష్టినిఁ దెలియఁజెప్పు చదువెంతఁజదివినను దానిలోఁతునెఱుంగుట సాధ్యముగాదు గావున దేవుని నెఱింగించు పాఠములునేర్పుఁడని మనగురువులనడుగుదమని ప్రబోధించెను. అంతలోచండామార్కులువచ్చిరి. వారితోఁ బ్రహ్లాదుఁడుపిల్లలుకలిసి మాకుఁబరబ్రహ్మాత్మికమైన చదువుచెప్పుఁడని కోరినారు. చండామార్కులు వారి పరివర్తనమునకు వింతపడి మహారాజుతో వెళ్లి చెప్పిరి.

హిరణ్యకశిపుఁడు శూన్యవాది ఈతఁడు మొదట బాలకాలము ఈశ్వరార్థము తపస్సుచేసి యేదియునుగానక తుదకు నీశ్వరుఁడు లేఁడని మానవునకు జీవితము గడచుట కేవిప్రధానములో అవేపూజించుట తరుణోపాయమని నిశ్చయించిన సంస్కారి. ప్రహ్లాదుని యీశ్వరవాదమువిని నవ్వుకొని ఓరీ! కుఱ్ఱవాఁడా నీకేమి తెలియును అసలు ఈశ్వరుఁడు లేఁడు. ఉన్నాడనికొందఱుదరిద్రులు ఒకకథ కల్పించి పొట్టఁబోసికొను చున్నారు. కావున నీవీ భ్రాంతివిడిచి సృష్టిలోని విత్రవిచిత్రాత్మకమైన జ్ఞానసంపత్తి నేర్చుకొని గొప్పచారిత్రక పురుషుఁడవుకమ్మని మందలించెను. కాని ప్రహ్లాదున కామార్గమునచ్చక ఈశ్వరుంగూర్చి ప్రార్థించుచు తోడిబాలుర నెందఱినో తనవంకఁద్రిప్పుకొని గొప్పప్రచారముసేయ నారంభించెను దీనివలన హిరణ్యకశిపుని రాజ్యములో గొప్ప ఆందోళనము పుట్టినది. చదువు

చెప్పుపాఠశాలలుకట్టి అందఱకందఱు హరిభజనలు సేయనారంభించినారు. ఈసంగతి హిరణ్యకశిప మహారాజునకుఁ దెలిసి ప్రహ్లాదునిఁ బిలిచి గట్టిగాఁ గోప పడి భయంకరముగా నఱచి మహార్భాటముచేసి తీఁడించినాఁడు అవేఁడివేర క్త నాళములు పగిలి దురాగ్రహముగల సింహము వచ్చి కడుపు చింపివేసినట్లు ర క్తముగ్రక్కి హిరణ్యకసిపుఁడు పడిపోయి ప్రాణములను విడచెను.

---

# బూ అలీ - సీ నా.

బూఅలీ, వుల్, హుసేన్. సీనా అనునతఁడు గొప్పతత్త్వవేత్త విద్వాంసుఁడు. పెరిషియాలో "హందర్" పురమునందు క్రీస్తుశకము 750 సం॥ ప్రాంతయునఁబుట్టెను. బాగ్దాదులోని హమీదియా విశ్వవిద్యాలయమునఁ జదివి చదువుముగించెను.

తరువాత నానాదేశములకేగి యచ్చటచ్చటి వివిధ విద్యల నభ్యసించి తన జీవితములోఁ బెద్దభాగముగడపివేసెను. ఈప్రకారము బూఅలీ విద్యాయాత్ర ముగించి యింటికిఁ జేరునరికి డెబ్బదిరెండు దివ్యభాషలలోని సంపూర్ణసారస్వత మహాపాండిత్యము వచ్చియుండెను.

ఈతనికి సరిసమానుఁడగు కోవిదుఁడీప్రపంచమున లేఁడని వెల్లడియైనది. దశదిశలనుండి వేనవేలు విద్యార్థులతనియొద్దకువచ్చి కృతార్థులగుచుండిరి. తుదకీతని పలుకుఁబడి రాజకీయముగామార్చి యేదేశముపైనైనను దండెత్తఁ దలఁచినఁ బ్రజలందరీతని వెంబడించి రాజ్యములు తలక్రిందుగాఁ జేసివేతురను భీతి ప్రభులకందఱకు జనించినది. అందుబాగ్దాదు ప్రభువీతనినిచెఱసాలలోఁ

బెట్టించెను. కాని చెఱసాల అగుసనట్లుగ పడదయ్యెను. జనులు కుప్పతిప్పలుగా వచ్చిపడి యతనిని విడిపించి తీసుకొనిపోయిరి. సైనికశాసనము ప్రకటింపఁబడెను. దానితో బూఅలీ దేశమును విడిచి వెళ్ళిపోవలసివచ్చెను. ఏదేశముపోయినను పై రీతినేజరుగుచుండెను. పాపము బూఅలీ రాజకీయ విప్లవకారుఁడుగాఁడని యొకరును తలంపరైరి. ఈమహాబాధనెటులఁ దప్పునాయని తలపోసి వేరు గత్యంతరములేక వేషముమార్చి ఈజిప్టుదేశమునకుఁ బాఱిపోయెను.

అచ్చటఁగూడ విద్వాంసుఁడనని చెప్పకొన్న నిర్బంధింతురేమోయని కూలివాండ్రలోఁగలిసి దినమంతయుఁ గఠినమైన పనులను జేసి తట్టలనుమోయుచుఁ గుక్షి నింపుకొనుచుండెను.

ఈపేదఱికపు దినాలలో నొకచిన్న కుటీరమున రాత్రివేళఁగూర్చుండి యెన్నియో మహాగ్రంథములు వ్రాసినాఁడు. అందిప్పుడు వాఙ్మయచరిత్రలు 10. వ్యాకరణములు 14. అర్థికశాస్త్రములు 2. దర్శగ్రంథములు తత్త్వగ్రంథములు **(Science)** 20. వైద్యగ్రంథములు 18. అగపడుచున్నవి. ఇవి నేఁడు 40 భాషలలోఁ బరివర్తింపఁబడి ప్రచారములో నున్నవి.

బూఅలీ యొకనాఁడు ఈజిప్టురాజుకోటలో మట్టిత్రవ్వుకూలికై కూలి వాండ్రతోఁ బోయెను. అపనిజూచుటకు రాజును మంత్రియు వచ్చుచుండిరి. వారిరువురు బూఅలీ ! రానిక్రొత్త భాషలోఁ బ్రసంగించుకొనుచుండుట, బూఅలీ గ్రహించినాఁడు.

దానివిషయమైకనుఁగొనఁగా వారిరువురొక నూతన భాషగఁల్పించుకొని యొరులెవరికిఁ దెలుపఁగూడదని ప్రమాణములు చేసుకొన్నారని తెలిసినది.

బూఅలీ కూలికివచ్చినపుడెల్ల వారిమాటలపైదృష్టినుంచి అస్వరముల పోలికతో వారిభాష గ్రహించివేసినాఁడు. రాజొకనాఁడు బూఅలీ పనివిమర్శించుచు

నేదోయొక మాటనడుగ బూఅలీ యాతనినూతనభాషతోఁ బ్రత్యుత్తరముచెప్ప నారంభించెను. అదివిని రాజుతెల్లఁబోయి నేనెంతో రహస్యముగా దాఁచిన భాషను మంత్రి కూలివాండ్రపర్యంతము తెలియునట్లు వెల్లడించినాఁడు అని మంత్రితల ఖండించుటకుఁ దలారుల కాజ్ఞనిచ్చెను.

మంత్రియదివిని నేనునిరపరాధిని మీగూఢభాష నేనెవరికిని జెప్పి యుండలేదు. ఆకూలివాని కెట్లువచ్చినదో పిలిచియడిగి నేనుచెప్పినట్లున్ననన్నిప్పుడే సంహరింపవేయుఁడని కాళ్లపైఁబడి యేడ్చినాఁడు. రాజదిచూచి కూలివానిఁబిలిచి సంగతి కనుగొనఁగా బూఅలీ నాకెవరును చెప్పలేదు. మీరు సంభాషించు కొనుటఁజూచి నేను నేర్చుకొన్నాననిచెప్పెను. అప్పుడు నీవెవఁడని రాజును మంత్రియుఁ బ్రశ్నించిరి. నేను "బూఅలీ" నని చెప్పినాఁడు.

అదివఱకే బూఅలీ మహనీయుఁడని వారెంచుచుందురు. కావున వెంటనే వానిపాదములపైఁబడి సన్మానించి నీకీ కూలివాని బ్రతుకేలవచ్చినదని యడిగిరి.

బూఅలీ కన్నీళ్లుకార్చి నాయొద్ద విద్యనభ్యసింపవచ్చెడి వారిఁజూచి భూపాలురునన్నొక విప్లవకారుఁడని యపూహపడి పడరాని కష్టములఁబెట్టినారని తనపూర్వచరిత్ర మంతయుఁ బూసగ్రుచ్చినట్లుచెప్పి యీకూలివానివేషమున జీవింప వలసినవాఁడనైనానని నివేదించెను. దానిపై వారు మిగుల జాలిపడి వెంటఁదోడ్కొనిపోయి అర్ఘ్యపాద్యములిచ్చి పూజించిరి. తరువాత కొన్నాళ్లకు మా నూతనభాష నీవేరీతినిఁ గఱచితివనిరాజడిగెను.

అదివిని బూఅలీ రాజా ! ఒకటి రెండు బాషలయందు పరిపూర్ణమైన పాండిత్యమున్న రెండవభాష భాషావిధమునుబట్టి గ్రహింపవచ్చునని యాతని యొద్ద వానిసౌలభ్యమును గూర్చి చెప్పుచు తాను వ్రాసిన వాఙ్మయ చరిత్రలను జదివి వినిపించెను.

# శ్రీ రామ చంద్రుడు.



శ్రీరాముఁడయోధ్యాపురమునఁదశరథుఁడను రఘువంశపు మహారాజునకు కౌసల్యయను మహాపతివ్రతయందుఁ త్రేతాయుగంబునఁబుట్టెను. ఈతనికిఁబది రెండేండ్లప్రాయమువచ్చుసరికొకనాఁడు విశ్వామిత్రుఁడనుమహాఋషివచ్చి దశరథుని దర్శించి రామునితనవెంటనరణ్యాశ్రమమునకుఁ బంపవలసినదని అచ్చటదాను విద్యాదియుద్ధకౌశల్యములు నేర్పుదునని కోరినాఁడు.

దశరథుఁడు ఇట్టి అయాచితమైన విశ్వామిత్రుని దయమనయందంతగా నేలరావలెనని మనస్సులోశంకించి సంశయగ్రస్తుఁడై స్వామి ! రామునేల మీరు పిలువని పేరంటముగాఁవచ్చి విద్యనేర్పెదమని సెలవిచ్చుచున్నారు అని విశ్వామిత్రు నడిగెను.

విశ్వా—:దశరథమహారాజా ! నేను రాజ్యమును సంసారమును మహా మహీమండలమును వర్జించికికారణ్యాలలో నరసంచారములేనిచోటఁ బర్ణకుటీరమున నివసించియున్నను మాబోటిసాధుశీలుర పూజాదియజ్ఞవిధానములు, తాటకయను రాక్షసస్త్రీవచ్చి భగ్నముచేయుచున్నది. అందుచే నాతపస్సున కంతరాయము వచ్చిఫలసిద్ధికాకచెడిపోవుచున్నది. ఆమెనెన్నివిధాలబతిమాలినను వినదు. ఈదుష్ట స్త్రీని చంపివేసినగాని నాబాధకు నివారణోపాయములేదు. నేను నాజీవితమున మోక్షసాధనము గావించుకొను తెలవగపడదుగావున ఈకార్యము శ్రీరాముఁడు సేయఁగలఁడు.

దస—:నీవెల్లెఱుంగుదువు.

విశ్వా:—నేనెఱుంగని వేమియునుండవు.

దశ:—సంయమీంద్రా! నీవుసర్వజ్ఞుఁడవుగదా. నీశత్రువు తాటకను కోటి సైన్యమున్న నాచేత సంహరింపసేయకబాలుఁడైన రామునేల పంపుమనెదవు.

విశ్వా:—నీవడిగినప్రశ్న సమంజసమైనదే చూడు దశరథమహారాజా! నీవుకోటిసేనతో తాటకను డీకొన్న రాక్షసలోకమెత్తివచ్చి భారతభూమికబళించి వేయును. దానప్రజాహానిసంఘటించును. ఆమహాకోలాహలమున నేనువారిచేహత మారవలసి వచ్చును. కావున ఈరామునిచేఁ దాటకను జంపించిన నెవ్వరికిని తెలియదు. తెలిసినను ద్వాదశవర్షములుగల బాలుఁడైన రాముఁడు తాటకను సంహరించినాఁడన్న నెవరునునమ్మరు. అదిగాక నేనీతని నేచాటుననోపెట్టి తాటక నొక్కవ్రేటున నేలగూలనేయించెదను. అనిరాముని విశ్వామిత్రుఁడు గొనిపోయెను.

---

# సలీము.

సలీము అగ్బరు కొమారుఁడు ఈతని చరిత్రమంతయు నూర్జహానను మహా సాహసవతిపై మోసియున్నది.

ఈనూర్జహాను గొప్పసౌందర్యవతియేకాక గొప్పవిదుషీమణి కవయిత్రి. గాయని- రాజకీయ విద్యాదురంధర మహాయోధురాలు- ఆమెకీ విశ్వప్రపంచమునఁ గల సమస్తకళలు కొట్టినపిండివలె వచ్చియుండెను. ఈమె పెరిపియాదేశములో నొక సామంతప్రభునికొమార్తె. ఆదేశమున మతకలహములకుజడిసి తండ్రి నూర్జహాన్ చిన్ననాఁడే ఢిల్లీవచ్చి అగ్బరుచక్రవర్తి నాశ్రయించి యొక ఉన్నత పదవి సంపాదించెను.

ఆదినాలలో నూర్జహాను చిన్నపిల్ల అగ్బరనుమతిని సలీముతో నాడుకొను

చుండెడిది. అందులోనే వారిద్దరి మనస్సులు అనురాగ భరితములై ప్రేమయను తీవలు రేకెత్తియల్లుకొన నారంభించెను. ఆ ప్రశాంత సముదిత మహానందసముద్భూతదివ్యదినాలలో వారెన్నియో సృష్టివైచిత్ర్యములు చూచి చూచి పట్టరాని యావేశమున ముద్దుముచ్చటలు బడయుచుండిరి. అవియన్నియు మిక్కిలి పవిత్రములును పరిశుద్ధములును, కేవల నిర్మలాంతఃకరణమును సూచించునవియునై యుండెను.

అగ్బరు రాజకీయధర్మముల ననుసరించి రాజపుత్రులతో సంబంధములు సేయనారంభించెను. సలీమునకుఁగూడ అదే యాచారప్రకారము యోధపుర రసపుత్రులతో బంధుత్వము కుదిర్చెను. వారు సరేయని యంగీకరించి తిరిగిమహమ్మదీయ కన్యను నీకొడుకునకుఁ బెండ్లిసేయనని ప్రతినసేయుమని కోరిరి. అట్లు అగ్బరు ప్రతినఁజేసి సలీమునకు రసపుత్రకన్యకు వివాహముచేసెను. తరువాత కొన్నాళ్లకు సలీము నూర్జహానును పెండ్లియాడ నూహించెను. ఆసంగతి రసపుత్రులకుఁ దెలసి అగ్బరుతోఁ జెప్పిరి. అగ్బరుసలీమును కఠినముగశాశించి నూర్జహానను షేర్ఖానను ప్రతినిధికిచ్చి పెండ్లిజేసెను. కాని షేర్ఖా నామె నంటక సలీమునొద్దకేగి, నీవు వరించిన నూర్జహానును నేనుస్వీకరింపఁజాలను. అనిచెప్పెను. సలీముమిగులసంతసించి సరే నేను కబురంపువఱకు నూర్జహానును నిభగినివలె నీయింటనుంచుమని నేమించెను.

కొన్నాళ్ల కగ్బరు మరణించెను. సలీమునకు రాజ్యము వచ్చినది. సలీము నూర్జహానియ్యవలసినదని షేర్ఖానునియొద్దకుఁ గబురంపెను. తక్షణము షేర్ఖానుఁడు నూర్జహానును సలీమునొద్దకుఁ బంపెను కాని యిదియంతయు లోకవిరుద్ధమైన పనియని షేరాను తలంచి తానెట్టులనైనఁ బ్రాణత్యాగము జేసినఁగాని తన పైఁగల యానిందపోదని సలీమునొప్పించి మదపుటేనుఁగుతోఁ బోరాడి దానిపదాఘాతముల కసువులాహుతి గావించెను.

సలీము కొన్నాళ్లకు నూర్జహానును పెండ్లియాడినాఁడు. ఈసలీము విషయలోలుఁడు కావున నూర్జహాను అనంతరము మఱియిద్దరు మహమ్మదీయ రాజపుత్రికలఁ బెండ్లియాడెను.

వీరందరు నగరులోఁ దఱచు సమావేశమగుచుండిరి. ఈనలుగురు నొక్కరి కొక రీడుదీయని విదుషీమణులు. సాహితీ సంపదఁగలవారు ఇంచుమించు లలిత కళలన్నియు మహావిద్యలతోఁబాటు వచ్చినవారు. కాని నూరహాను మిక్కిలి ప్రసన్నబుద్ధిగలదియు తీవ్రతరమైన యోజనాశక్తిగలదియునై యెటువంటి విషమస్థితులయందైన నిట్టెప్రతిఘటించి యేదోవిధమున దానుపైకి నెగ్గుచుండెను. ఎన్నడును నామెయెవరికినోటువడకుండెను. మఱియుఁ బ్రతిదినమేదోయొక ప్రసంగమునఁ దనసవతులనెకసెక్కెములు సేయకుండనుండెడిదికాదు. సలీమునకు నూరహానన్న చాలయిష్టము కానితక్కినముప్పురకుఁ జాలకోపముగానుండెను. ఒక నాఁడుసలీము తననలువురు భార్యలను కూర్చుండఁబెట్టి షానామాయను పారసీ పురాణము చదువుచుండెను. క్లిష్టమైన భాగము లర్థముకానప్పు డొకరికొకరు చర్చించుచుండిరి. నూర్జహానేదోయొకయుక్తిచెప్పి నవ్వించుచుండెను. అందుచేఁ దాను మహనీయురాలినని గర్వించుచుండెడిది.

ఇంతలో దీపము చిన్నదై పోయినది. వత్తియెగసనఁ ద్రోయుమని సలీమొక భార్యతోఁ జెప్పెను. ఆనాటి యాముదపుదీపములు పుల్లతో వత్తిపైకెత్తుచుండిరి. అదిదొఱకకయామె అటునిటు చూడనారంభించెను. రెండవయామె నలువంకల పరువులెత్తుచుండెను. మూడవయామె రసపుత్రకన్యలమ్మా యీచంద్రకాంతశిలా నిర్మిత భవనమునఁ బూరిపుల్ల యెట్లువచ్చునా అనిచెప్పుచుండ నూర్జహానునవ్వి యెటులవచ్చునా ! చూడుఅని తనచేతిలోని గాజు పుటుక్కున బదలుకొట్టి దానితో వత్తిపైకెత్తెను. తక్కిన ముప్పురు చిన్నఁబోయెరి. సలీము నూర్జహాను కుశాగ్ర బుద్ధిని మెచ్చుకొని తక్కినవారిని దద్దమ్మలనితిట్టెను. అదివిని రసపుత్రస్త్రీ

అగును మేముదద్దమ్మలమే మీనూర్జహాను గొప్పనెరజాణ. ఆమెయొక గాజు బద్దలుకొట్టఁగలదు మఱియొకగాజుతోడగఁగలదు. మేమట్లుగాజులుబద్దలుకొట్టలేము బద్దలుకొట్టినఁ దిరిగి తోడగము. అనినూర్జహాను రెండవపెండ్లిని శ్లేషించి మాట లాడినది. అదివిని నూర్జహాను సిగ్గుచేఁ దలవంచి పాఱిపోయినది. నాటినుండి గర్వము మానివేసెను.

---

# హసన్ బిన్ సబా.

---

హసన్‌బిన్‌సబా పారసీక దేశములోని సైషాపూరను గ్రామమునఁ సబాయనువానికిఁ బుట్టెను. అతఁడు ప్రాజ్ఞుఁడై బాగ్దాదుపట్టణములో నైజామియా యను విశ్వవిద్యాలయమునఁ జదువుచుండెను.

ఈతని స్వాధ్యాయులు, నైజాముల్ ముల్కుతూసి, ఉమర్‌ఖయామ్ అను వారుండిరి. ఈముమ్వురు ఆనాఁటి నానావిద్యలు సాంతముగ నభ్యసించి గొప్ప పండితులై లోకమంతయు జయించి జయ ధ్వజములెత్తించిరి. ఒకనాఁడు ఉబుసు పోక యీముగ్గురుమనలోనెవరి కదృష్టముపట్టినను తక్కినవారికిఁ బంచి యియ్య వలయునను ప్రమాణపత్రము వ్రాసికొన్నారు. కొన్నాళ్ళయిన వెనుక ఈముగ్గురిలో నిజాముల్ ముల్కుతూసీకి బాగ్దాదు చక్రవర్తియగు "సల్జూఖియా" యొద్దప్రధాన మంత్రిపదవి వచ్చినది.

ఈసంగతి హసన్‌బిన్‌సబాకుఁ దెలిసి బాగ్దాదు వెళ్ళితూసీని చూచెను. వెంటనే తూసీ "ఖరాఢు" ప్రకారము వాని యైశ్వర్యములో మూఁడవవంతుఁ బంచియిచ్చెను. అది తీసుకొని మీరాజునొద్ద నాకును నేదేని పని నిప్పించుమని కోరెను.

దానిపైతూసి సరేయని రాజుతోఁజెప్పి యతనినార్థికమంత్రిగా నియమించెను.

తరువాత "హసన్" ఉద్యోగమునకువచ్చి ఆయశేష ప్రభుత్వ కోశాగారమునందలి యపరిమిత ధనసంచయములఁ జూచి యాశ్చర్యపడుచు నింటికిఁబోయిన యేమేమో విచారించుకొనుచుండెను.

ఒకనాఁడు "ఈతేఁడు నావంటి మానవుఁడేగదా వీనికింత ధనమెట్లు వచ్చి పడుచున్నది ? వీనిపూర్వులు విశాలమైన భూభాగమార్జించినారు వారును మానవులేగదా ? ఒకమానవునకు సాధ్యమగుకార్యము రెండవ మానవున కేలసాధ్యముగాదు. నేనింత మహత్తరవిద్యఁ జదువుకొని నిరక్షరకుక్షియైన యీతేనియొద్ద బానిసనై పడియుండుటకంటెహీనమైన కార్యమింకొకటేదియు లేద"ని మనస్సులోఁ వితర్కించుకొని వెంటనే తన కొలువు చాలించి స్వస్తిచెప్పి యడవులవైపు లేచిపోయెను.

తరువాత నాహసన్‌బిన్‌సబా చిరకాలమారణ్యములమెట్టి మిక్కిలి నిగూఢమైన పెద్దపర్వతపు లోయల నాశ్రయించి మంచి సమున్నతమైన యొకప్రదేశమునఁ దనయాశ్రమమొకటి గట్టుకొని యేతత్ప్రాంతపుట నాగరిక ప్రజల రావించి తానొక యీశ్వరదూతననియు, నయోనిసంభవుఁడననియు తనకా గతానాగతములు, భూన భోంతరాళముల యందలి రహస్యము లెప్పటికప్పుడు తెలియుననియుఁ జెప్పిబహువిధముల వారిని నమ్మించెను.

మఱియు వారల కింకను నమ్మికఁబుట్టుటకుఁ దానుమున్ను "తూసి" యెద్ద పంచుకొన్న ధనమొకచోటపాతఁబెట్టెను. అది వారలఁ ద్రవ్వితెమ్మని పంపినాఁడు. అట్టులాజానపదులు పోయి తెచ్చిరి. అది మొదలు ఇది యేదో గొప్ప మహత్తనియు నీతఁడు భూగర్భములో దాఁగియున్న ధనకనక వస్తువాహినులిట్లే

పెల్లగించి తీసుకొని రాఁగలఁడని యుద్రికరణశుద్ధిగా విశ్వసించిహసనునకు దాసానుదాసులై యుండిరి.



ఈహసన్ అధనముపెట్టి యచ్చట పెద్దకోటఁగట్టించెను దానికి స్వర్గమని పేరుపెట్టి అందుకువలయునానా విధాలంకారములు సమకూర్చి యెన్నియో వన్నె చిన్నెలుదిద్ది సింగారించెను. అది కాంచినవారంచఱు గొప్ప విభ్రాంతిలోఁ బడి పోవుచుండిరి. క్రమముగా బెద్దపెద్ద మహారాజులనుగూడనది నాకర్షించినది వారినారీతిని మోసగించివారిచే లెక్కలేనంత ధనము తెప్పించెను. ఆధనరాశులుపెట్టి పెద్దసైన్యము సమకూర్చినాఁడు కొన్నాళ్ళకుఁ దాను మున్ను కొలువున్న సల్జూఖియా రాజులపై దండెత్తెను. అప్పుడు ప్రధానమంత్రియగు తూసీకి ఈతని యుదంతమంతయుఁ దెలిసి తిన్నయింటివాసములే లెక్కించెదవా యని అధిక్షేపించెను. అది విని "హసన్" సరేమీరాజాను "జితోస్మి" యనిపించుము తరువాత నేను చెప్పెదను అని చెప్పి యొక గొప్పసభచేసి విజయము విద్యలోన న్నది గాని ధనములోను, బలములోను లేదనియు తొలుతఁ దానొక నిరుపేద వాఁడననియు తనయొద్దఁ బూర్వము భవభూతి "విద్యానవద్యా స్తినః" అని చెప్పినట్లు విద్యయొకటేకలదనియు దానిచే నేను రారాజులను జయించు స్థితికివచ్చి నావనియుఁ జెప్పి నాయనలారా! విద్యనాబాలగోపాలము చెప్పించుఁడని ప్రబోధించెను.



# కృత్రిమస్వర్గము.

కృత్రిమము లెందఱో లోకమున గావించినవారున్నారేగాని మనకథా కాలమున నిర్మించిన కృత్రిమస్వర్గమువంటి విధానము లేకాలమున నేదేశమున సాగలేదని సాగదని రూఢిగాఁ జెప్పవచ్చును. ఈరహస్యము గర్భనిర్భేదము చేసినవారు మహమూదు వానిభార్య ఆయెషా.

ఈఆయెషా తామూరు వంశములోని యువతి ఈమే అఖండ మేధాశక్తిగల పండితురాలు సాటిలేని యామె సౌందర్యము సద్గుణములచేతను సచ్ఛీలత్వముచేతను మిక్కిలి వన్నెకెక్కినది. ఈమె చక్కనికవిత్వము చెప్పుచుండెను. అమనోహర మధుర గీతములు దిశాంతముల నెందఱిచేతనో గానముసేయఁ బడుచుండెను.

ఈమెను బెండ్లి యాడ వలయునని యెందఱో వచ్చిరి. కాని విద్యావిశారదుఁడును, గుణవంతుఁడును, సత్కులసంభవుఁడును, మహాయోధవీరుఁడుననగు మహమూదును ఆయెషావరించెను.

మహమూదు చిన్న జమీదారైనను భారతదేశములోని నద్వాలేకనలంద విశ్వవిద్యాపీఠమునకు నధిపతిగను ప్రధానసాహిత్యోపాధ్యాయుఁడుగను నుండెను.

అవి చాల దుర్దినములు. ప్రజలు ప్రభువులపై తురుగఁబడుచుండిరి. ప్రజలకు రక్షణము బొత్తిగాలేకుండెను. దేశము మహాక్షామమున నల్లాడుచుండెను. ఇట్టి కఠినపరిస్థితులలో హసన్‌బిన్‌సబా యనువిప్లవకారుఁడు అటవికజనమును వశముచేసికొని రాజ్యములు కొల్లగొట్టి స్వర్గమనుపేర నొకరహస్యదుర్గముకట్టి యందు స్వర్గమునకు నుండవలసినలక్షణము లన్నియు సమకూర్చెను. దేవకన్యలకు బదులు సౌందర్యవతులగుస్త్రీల నపహరించి యందుంచు చుండెను. ఎంత లేనివారలకైన నీభీభత్సము స్ఫురణమునకు వచ్చిన నమాంతముగా గుండెలు నీరు విడిచిపోవు చుండెను. ఎందఱో సతీతిలకములు నిండ్లలో నిద్రించువారుఁ గూడ మాయమై పోవుచుండిరి. ఎవరెత్తుకొని యేరీతి నెచ్చటకుఁ దీసికొని పోవుచుండిరో యెవరికినిఁ దెలిసెడిదికాదు. ఈసంగతి ఆయెషాకుఁ దెలిసినది తాను గూడ నీరీతి నేదోయొకనాఁ డపహరింపబడుదు నని నిశ్చయించుకొని మహమూదును బిలిచి ప్రాణేశ్వరా! స్త్రీలోకమునకు నీకాలమున శరణ్యములేదు. ఎందఱో మహాపతివ్రతలగబాటులకు లోనై ప్రాణత్యాగములుగావించుకొను చున్నారు. హసన్‌బిన్‌సబాగూఢవారులు "కలరా" పురుగులవలె లోకమునిండి గొప్పహానిఁ గావించు చున్నారు. వీరిని నిర్మూలింపఁజేయు నుపాయ మేమని యడిగెను.

మహమూదు ఈసంగతి గొప్పగొప్ప రాజకీయతంత్రవేత్తలకే తోఁచ లేదనియు, హసన్‌బిన్‌సబా స్వర్గధామ మెందున్నదో యారహస్య మెవరికిని దెలియకున్నదనియు, నదితెలిసినచో నీవిపత్తును దప్పించవచ్చు ననియుఁ జెప్పెను.

అది ఆయెషావిని సరే మీరు ప్రభువుతోఁజెప్పి సేనను సంసిద్ధము చేసి యుంచుఁడు. నే నేదోయొకదినము హసన్‌బిన్ సబాచేదొంగిలింపఁబడుదును. నేను పోవునప్పుడు దారిపొడవునను కసందిగింజల నోడిలోఁబెట్టుకొని జల్లుకొనుచుఁ బోవుదును. అవి యానవాలుగాఁ బట్టి మీరు దండు నడిపించుఁ డనిచెప్పెను. సరే యని మహమూదు వెళ్లిపోయెను.

మహమూదు యథావిధిగాఁ దానుఁజేయ వలసినయేర్పాటులన్నియుఁ గావించి విద్యాపీఠమున నుపన్యాసములిచ్చుటకు వచ్చెను. కాని విద్యార్థు లొక్కరును రాలేదు. ఏలరాలేదోయని యింటికి వెళ్ళిపోయెను. ఇంటిలో "ఆయెషా" లేదు. తరువాత విషయము విమర్శింపఁగా నీవిద్యలయమునఁ జదువు వారంతయు హసన్‌బిన్‌సబాగూఢచారులేయనియు నాయెషాను హరించుట కిన్ని నాళ్ళు చదువు చున్నటు నటించినా రనియుఁ దెలిసినది. తెలిసినతోడనే మహ మూదువంటి యోధవీరునిహృదయము గూడ భయమునఁ గంపించినది. తల నేలకువంచెను. ఆయోషా చెప్పినచొప్పున కసందిగింజయగుపడినది. మహమూదు సంగతి గ్రహించి సరేకదాయని ఆదారినే సేన నతినిపుణముగఁ దీసికొని పోయినాఁడు. కొంతదూరము పోవుసరికి దారి తెలిసినదికాదు అప్పటి కప్పుడే ఆయెషా వేసినకసందిగింజలు మంచునకు మొలిచి బారులుదీర్చినట్లు దారిచెప్పక చెప్పుచున్నవి. దానినిబట్టిమహమూదు తనసేన నాకొండలోయలలో దాఁచి తానొక్కఁడే వేషము మార్చి వెళ్లిపోయెను. కొంతదూరము వెళ్లినతరువాత నొక గొల్లపల్లె యెదురైనది.

అందు మహమూదొకయింట నిలిచి సంగతులు తెలిసికొనియెను. కాని యాగొల్లవారల కచ్చటివిశేషము లేమియును దెలియవు కాని పాలుమజ్జిగలు స్వర్గములోని కందించు చుండిరి. అది మహమూదు గ్రహించి యొక పాలుగంపపై కసందిమొక్కలువేసి తీసికొని పొమ్మనియెను. ఆయెషా యదిచూచినది. మహమూదు గొల్లపల్లెకు వచ్చి యుండు నని గ్రహించి ప్రొద్దు పోయినవెనుక గొల్లదానివేసముతో నీవలకువచ్చి మహమూదును గలిసికొనియెను.

స్వర్గములోనిరహస్యము లన్నియుఁ జెప్పివెళ్లిపోయినది.

మఱునాఁడు మహమూదు సేనను స్వర్గముచుట్టు ముట్టడించి హసన్బిన్ సబాను పట్టుకొనియెను.

ఆకృత్రిమస్వర్గము స్వర్గమును దిరస్కరించుసొగసులతో విరాజిల్లుచున్నది. అది మానవమాత్రులు నిర్మింపఁజాలరని తోఁచుచుండెను. అందపహరింపఁబడిన సౌందర్యవతులగు యువతులు గంధర్వాప్సరో భామినులకన్న మిన్నలై యున్నారు. వారియొక్క సంఖ్య కొన్ని వేలుండును. ఆయెషావారి నందఱను వారివారియిండ్లకు సగౌరవముగా సాగ నంపించెను.

ఆకృత్రిమస్వర్గమునకు రాజమార్గము వేసి విశ్వవిద్యాలయముగా మహమూదు మార్చివేసినాఁడు.

---

# సో మి ని.

"సోమిని" యనుమహర్షి సుప్రసిద్ధుఁడు. ఈతఁడు ఘన విద్వాంసుఁడు. తపశ్శాలి. యోగదీక్షాధురీణుఁడు టైగ్రీసు నదీతీరమున నొకపల్లెలో నివసించుచు స్వయంకృషిచే భూమి దున్ని వ్యవసాయమువలన జీవనము నడుపుకొనుచుండెను.

వానియొద్ద నెందఱో విద్య నభ్యసింప వలయునని వచ్చి తర్కవ్యాకరణాది వివిధ సాహిత్యములు కఱచుచు నుండిరి. వారితో సోమినికూఁతురగు ఖాతూను గూడ గొప్పభాషాపాండిత్యము సంపాదించినది.

ఖాతూనునకుఁ బెండ్లియీడు వచ్చినది. తగినవరుఁడెవఁడా యని సోమిని నిరంతరము యోజించుచు మీనమేషములు లెక్కించుచు దీర్ఘచింతాక్రాంత మానసుఁడై యుండెను.

ఒకనాఁడు టైగ్రీసునదీతీరమునఁ దాను వేసి పెంచిన సిమరేగు (ఏపిల్) పండ్లనుగోయుచునుండ నందున్నకాయలు నీళ్లలోఁబడిపోయినవి. అవినదీ వేగమునఁ బోవుచుండ సోమిని తీసికొనుటకు నందినవికావు; కాని సోమినిదృష్టి వానిపైనే యుండిపోయినది.

సాలెహాజంగి అనునొకవిద్యార్థి సోమినియొద్ద విద్యనేర్చుకొన వలయునని నెన్నియో మజిలీలుచేసికొని మిక్కిలి దూరదేశమునుండి శ్రమపడి వచ్చుచుండెను. అతఁడు టైగ్రీసు సమీపించి యుపాధ్యాయుని యూరుచేరువకు వచ్చితిని కదాయని సంతసించి నదిలోస్నానమాడి శుచియై నదియొడ్డుననే కూరుచుండెను. కాని యాతని కాఁకలిచేతఁ గడుపుదహించుకొనిపోవుచుండెను. ఇంతలో రేగుపండ్లు నదిలోఁగొట్టుకొని వచ్చుచుండ చూచినాఁడు. అవి చేతికందునట్టులున్నవి. సరే కదాయని తీసి తనయాకలికొలఁది వేవేగముగ భుజించినాఁడు. అయుత్తరక్షణము ననేఅయ్యో! అన్నాతురత యుక్తాయుక్తా వివేకము లేకయే చేయుదోసకారినై యాబదరీఫలము లెవరి వనియైన విచారింపకయే తినివేసితినే! ఆహా! యెంత సాహసము ఎంతపాపము దీని కేఁక క్షమాపణయుఁ బరిహారముఁ గలదా యని వితర్కించి లేచి యాఫలములు కొట్టుకొని వచ్చినజాడనే వెడల మొదలుపెట్టెను. కొంతదవ్వేఁగినవెనుక సోమిని యెదురై నాయనా! నీ వెచ్చటకుఁ బోవునుంటివి? అని యడిగెను.

సాలెహాజంగి తనవృత్తాంత మంతయుఁ జెప్పి బదరీఫలము లపహరించిన పాప మెట్లు పోవునని యడిగినాఁడు. వానిసత్యసంధతకు నస్తేయమునకు సోమిని లోలోపల మిక్కిలిఁ గొనియాడి నాయనా! ఆబదరీఫలములు. నావే నేను చెట్టు నుండి కోయుచుండఁగానవి నీళ్ళలో జారి పడిపోయినవి యని జరిగినకథ నంతయుఁ జెప్పెను.

సాలెహాజంగి నాతప్పు క్షమింపుమని వేఁడుకొన్నాఁడు. అది విని సోమిని నేను క్షమింపను. నీకు నిజముగా క్షమాపణయే శరణ్యమగునెడల నాకేదేని పణా మియ వలయును అనికోరెను. దానిపై సాలెహా మీరేదియడిగిన నది సమర్పించెద నని ప్రమాణముఁ జేసెను.

సోమిని:—నీవు నీప్రమాణము దాఁటరాదుసుమాయని వితర్కించెను.

సాలెహా:—ప్రాణమైన విడుతునుగాని ప్రమాణ మతిక్రమించనని చెప్పెను.

సోమిని:—సరే! నాకొకకూఁతు రున్నది. ఆమెను నీ వీయపరాధక్షమా పణార్థము పెండ్లియాడ వలయును అనినుడివెను.

సాలెహా:—మహాభాగ్యము అనియంగీకరించి స్వామీ! యిది నాయ పరాధమునకు శిక్ష కాదే యని యడిగెను.

సోమిని:—ఇది శిక్షయే. అని చెప్పెను.

సాలెహా:—ఎట్లు? అని యడిగెను.

సోమిని:—నాతనయ కాళ్లు, కన్నులు, చెవులు, నోరులేనిది. ఈమెను నీవు పెండ్లియాడ వలయును అని చెప్పను.

సాలెహా:—సరే! అని సంసిద్ధుఁ డయ్యెను.

మహావైభవముగాఁ బెండ్లి జరిగినది. ఎందఱోపండితులాశీర్వదించిరి. ఆ మరునాఁడు సాలెహాజంగివచ్చి సోమినికాళ్లకుమ్రొక్కి స్వామీ ! మీతనయకు కాళ్లు, కన్నులు, చెవులు, నోరు లేదన్నారే ! సర్వాంగసౌష్ఠవయు, సర్వలక్షణ లక్షితయు మహాసౌందర్యరాశియు నైన యాబంగారుబొమ్మ ననవరత్నాలమాల ఆయనుపమానమానితసుగుణసంపద్విలాసినినినాకిచ్చి వివాహము చేసితిరి. ఇదిచాల నాశ్చర్యముగ నున్నది అని నవనవవదనారవిందుఁడై యడిగెను. సోమిని వానివినయాది సౌజన్యసంపదలకుమెచ్చి నాయనా ! నేను నీతోఁ గల్ల లాడినానని శంకింపకుము. నేను నిక్కమునే దాఁచక చెప్పినాను. ఏమందువా ? నాకూఁతునకు కాళ్ళున్నను నెప్పుడును బొరుగిండ్లకు వెళ్లి యెఱుంగదు కావునఁ గాళ్ళులేవని చెప్పనాను. కన్నులుండియుఁ బరులనెవ్వరినిఁ గాంచి యెఱుంగదు కావునఁ గన్నులులేవని చెప్పితిని. ఇట్లే చెవులతోఁ బరపురుష శ్రవణముచేసి యెఱుంగదు కావునఁ జెవులు లేవంటిని. నోరున్నను గట్టిగా మాటలాడి యెఱుంగదు కావున నోరు లేనిదని చెప్పినానని చెప్పెను. అది విన్నవారందఱు పరమానంద భరితులైనారు.

ఈఖాతూను పతిసేవచేసి గొప్పచారిత్రకమైన కీర్తి సంపాదించినది. ఈమెపుత్రుడే "జీవాని" వీరిగోరి బాగ్దాదులోఁ బెద్దకోటవలె నున్నది. వేనవేలు నిరంతరము దర్శించుచుందురు.

# జయుఁడు.

మహాభారతకాలమున జయుఁడు కళింగదేశమేలిన మహారాజు. ఈతని ధైర్యసాహసములు, ఆత్మగౌరవ నిర్వహణార్థము చేసిన త్యాగశీలత దేశమెప్పటి కెన్నితరములకును మఱవఁజాలదు. ఈతనికి భానుమతియను పుత్రికగలదు.

ఆమె గొప్పవ్రతశీలములు గలిగి, విద్యయందును, చిత్రలేఖనమునందును, సంగీతమునందును చాలా పెద్దపేరు సంపాదించి యాంధ్రస్త్రీ లోకమునఁ దల మానికమై యలరుచుండెను. ఈమె యొకనాఁడు కురురాజులలో దుర్యోధనుని బెండ్లియాడినట్లు కలగాంచెను. ఆ కల ఆమెను చాల కలతఁబెట్టినది. తుదకా యుదంతము తల్లితోఁ జెప్పెను. తల్లి జయునితోఁ జెప్పెను. జయుఁడు సంగతి విని మిగుల విచారించి అయ్యో! కౌరవులు చాల గొప్ప రాజాధిరాజులు. మనము వారిముందు చాలా స్వల్పరాజ్యమున్నవారము. మనకు వారికిఁ జుట్టరిక మెట్లు సంఘటించఁగలదని యోచింపనారంభించెను. అది భానుమతి గ్రహించి నాయనా! రాజ్యమునకుఁ జుట్టరికమునకు సంబంధ మేమున్నది. చుట్టరిక మెప్పుడును సంప్రదాయమును బట్టి యుండును. అని గట్టిగాఁజెప్పెను. ఆమె నిష్కర్షమైన తీవ్రవాదమునను జయుఁడు హర్షించి దుర్యోదనుని పేర తన కూఁతునిచ్చెదనని కమ్మవ్రాసి పంపెను. దుర్యోధనుఁ డదిచూచి యేప్రత్యుత్తరమును నియ్యక యూరకొనియెను. జయునికామాట గొప్పలజ్జాకరముగ దోచి దుర్యోధనాధులపై యుద్ధమునకు వచ్చుచున్నానని వార్తనంపెను. అది కౌరవులకు పెద్ద భయంకమైన ప్రతిఘనముగా తోఁచినది. భీష్మాదికురువీరులు చేరి యేమియా విపరీతము కళింగుఁడేమి మనపై యుద్ధమేమి? అతఁడెంతవాఁడు. అతనికి మాతో పోరాడునట్టి బలధైర్యసాహసము లెట్లువచ్చినవి అను విషయ ముల విని గూఢముగా యోజింప నారంభించిరి.

అంతట రణనిస్సాణము మ్రోగెను. దిశాంతరము ప్రతిధ్వనించినట్లయినది. ప్రశాంతమైన ఆప్రభాతశీత వాతాహతిని ప్రచలితమగు లతాంతము లుషస్సునకు నీరాజనము లిచ్చుచున్నట్లును, జగత్ప్రకృతి మలీమసముగడచి ప్రభాప్రపూర్ణమై సొంపు సంపాదించుచున్నట్లును దోచుచుండెను. అంతట సంజయుఁడు వచ్చి ఉదంతమంతయు ధృతరాష్ట్రునితో శ్రాద్ధభోజనముచేసిన భోక్త నిర్మలముగాఁ బ్రేంచుచు మాట్లాడునట్లు చెప్పసాగెను. దుర్యోధనుఁడు వచ్చి తండ్రి ననుమతి

గై కొని యుద్ధమునకుఁ బోదునా అని అడిగెను. ధృతరాష్ట్రుఁడు నాయనా! ఆకళింగమహారాజిప్పుడు మనపై దురమునకు వచ్చుటకుఁ గలకారణమేమి? అని అడిగెను.

దుర్యో :— ఆర్యపూజితా! నాకును అతని యుదంతమొకింతయుఁ దెలియదుగాని నాపేర తనకూఁతురును పెండ్లియాడుమని లేఖ వ్రాసినాఁడు. కాని నేను దానికి ప్రత్యుత్తరమీయలేదు. అని సవినయముగా మనవిచేసెను.

ధృత :—అది విని సరే! నీవు చాల పొరపడితివి అని పళ్లెమునిండ రత్నములుపోయించి జయునియొద్దకుఁ బంపి మేము నీకు వోడిపోయినాము. ఈపారితోషికముగై కొని మాభానుమతి కిమ్మని పంపినాఁడు.

జయుఁడది చూచి భానుమతి కేబదివేల నేనుఁగులును పదివేల గుఱ్ఱములును, చీనిచీనాంబరములతో దుర్యోధనునకిచ్చి పెండ్లిచేసిరి.

---

# శ్రీ కృష్ణుఁడు.

శ్రీకృష్ణుఁడు పురాణములు వ్రాయుకాలమున గొప్పపేరుమోసిన మహాపురుషుఁడు. వీరాధివీరుఁడై పెక్కుశత్రువులను రణరంగమునఁ దుదముట్టించి వేదాంతగీతములు విలాసముగా మురళితో వాయించి వేఁడుకగా కాలముచ్చిన మహాజ్ఞాని.

ఈతని సమకాలమున సీనాదేశ మేలుచున్న నరకాసురుఁ డనురాజు భారతదేశముపై దండెత్తి గంగోత్తరతీరభాగములు జయించి అస్సాముప్రాంత వాసులను తనకుఁ గప్పము కట్టునట్లు లేర్పాటు గావించుకొని వెడలిపోయెను.

ఆ అస్సాముదేశము "సంఘి" అనువాఁడు పాలించుచుండెను. సంఘి ఒకనాఁడు చింతాక్రాంతుఁడై మిక్కిలి విచారసాగరమున మునిఁగియుండెను. మంత్రిసామంత రాజాలు వచ్చి ఈవిచారమున కేమికారణమనియడుగ, సంఘి కన్నీళ్లుకార్చి యేమియు చెప్పలేదు.

బలగమంతయు అతని యుదంతము తెలియక ఏమిప్రమాదము వచ్చినది అని యడిగిరి. సంఘి కన్నీళ్లు నింపుచు, ఇదిగో ఫర్మానా! అని చేతికిచ్చెను. ఆ ఫర్మానా మంత్రి గట్టిగా "ఓసంఘీ! ఈయేడు మాకు నీవు కట్టవలసిన కప్పమునకు బదులుగా నీరాజ్యమునఁ గల సౌందర్యవతులైన యువతీలలామలను మూఁడువందలు దెచ్చి సమర్పించుము. లేనిచో నీదేశము నాశనము సేయుచును, ఇట్లు, నరకుఁడు." అని చదివెను. అది విని సభ్యులందఱు హడలి దద్దరిల్లి పోయిరి. రాజు మంత్రి శిరములు వంచివేసిరి. నరకుఁ డెంతటిక్రూరుఁడైనను సోదరీసమానులైన స్త్రీలోకమును కప్పముగా నడుగుట యెంత విడ్డూరమని యనుకొని పిడుగుపడినవారివలె మ్రాన్పడిపోయినారు.

సంఘీ శ్రీకృష్ణునియొద్దకు వచ్చి సంగతినంతయు జెప్పెను. అప్పుడు శ్రీకృష్ణునిభార్య సత్యభామయు సమీపమునుండి విని విపరీతమైన యీవార్త మిక్కిలి ఘోరముగానున్నదని శంకించి శ్రీకృష్ణుని యుద్ధసన్నద్ధుని గావించి తానును వెంట బాణతూణీరములు ధరించి చీనాదేశమునకుఁ బ్రయాణమైనరకునిపై దండువెడలినారు.

ఈవార్త నరకునకు తెలిసి శ్రీకృష్ణుఁడు కోటలోఁ బ్రవేశించకుండ ఏనుఁగులను, శతఘ్నులను చుట్టుకాపుంచెను. కృష్ణునిసేనానాయకుఁడైన సంఘి గొప్ప ప్రతాపమును జూపెను. కానినరకునికోట పట్టుకొనుటకు స్వాధీనము గాలేదు. అప్పుడు దుర్గముచుట్టి ముట్టడివేసి యుండిపోయిరి.

ఒకనాఁడు రాత్రి జామున్నర గడిచినది. రేరాజు మిక్కిలితేజోవిరాజితుఁడై ఆకాశమండలమున నక్షత్రము లను సతీతిలకములమధ్య వినోదగామియై యథేచ్ఛావిహారలాలసుఁడై యుండెను. చల్లని పిల్లవాయు వెచ్చటినుండియో కుసుమవితానముల సౌరభంబులెత్తుకొని వచ్చుచుండెను. అది అతిరమణీయమైన వనప్రదేశము. ఆసమీపముననే సంఘి సేనానియై కాయుచుండెను. ఆవినోదము చూచుచు "కళ" అనుయువతి వచ్చినది. ఈమె నరకునికూఁతురు. గొప్పవిద్యావతి. మహనీయమైన ఆమెసౌందర్యము వర్ణనాతీతము. ఆవెన్నెలబయళ్ళ సంఘిని జూచి వాని వైఖరి కచ్చెరువడి నమస్కరించి మిత్రురాలై పోయెను. సంఘి తనదీనస్థితిని జరిగిన నరకునియుదంతము, కళతోఁ జెప్పెను. సరే అని కళ ఆమరునాఁడు రాత్రి కోటతలుపులు విప్పి సంఘికి కబురుచెప్పెను. సంఘి శ్రీకృష్ణున కెఱింగించెను. సత్యభామా కృష్ణులు నరకుని దుర్గద్వారము జొచ్చి నరకునితోఁ బోరు ప్రారంభించిరి. నరకుని దెబ్బలకు శ్రీకృష్ణుఁడు మూర్ఛిల్లెను. వెంటనే సత్యభామ రథమెక్కి నరకునితో యుద్ధమునకు డీకొనియెను. నరకుఁడు సత్యభామచేత నిహతుఁడై పోయెను. శ్రీకృష్ణుఁడు లేచెను. కళ వచ్చి సత్యభామను కౌఁగలించుకొని యేడ్చెను.

సత్యభామ కళ నూరడించి, తరువాత కళను సంఘికిచ్చి వైభవముగా వివాహముచేసినారు.

---

# మహమ్మదువారు.

---

శ్రీ మహమ్మదువారి దివ్యచరిత్ర లోకపవిత్రమైన మహాస్థాన మలంకరించుచున్నది. ఆమహనీయునిపుత్రి బీబీఫాతిమా.

వీరిది అరబ్బుదేశములో మక్కా అను ముఖ్యపట్టణము కాపురము.

ఈ బీబీఫాతిమా చిన్నతనమునుండియు మంచిగుణములకు విద్యాబుద్ధులకు బేరుపడి సాటిబాలికలయందు మిక్కిలి వన్నెయు వాసియు పొందియుండెను.

ఈమె చాల అందముగలపిల్ల. నవ్వుమొగముగలది. చెడ్డపను లెప్పుడును చేసెడిదికాదు. ఎవరగుపడినను వినయ విధేయతలు జూపుచు, మిగుల మర్యాదగ సంచరించుచుండెను.

ఈమె నెందఱో రారాజులు, ధనవంతులు పెండ్లియాడవలయునని వచ్చు చుండిరికాని మహమ్మదువారు "అలీ" అను నిరుపేదవానికిచ్చి పెండ్లిచేసెను.

ఈ ఫాతిమా చిన్ననాఁటినుండియు గారాబముగఁబెఱిగినదైనను తనభర్త పేదవాఁడని తిరస్కరింపక ఎన్నికష్టములు వచ్చినను, ఒకనాఁ డన్నములేక పోయినను సహించి భర్తను దైవమువలె పూజించుచుండెను.

ఆమెయిబ్బందులు చూచినవారు మహమ్మదువారి యొద్దకుఁబోయి, మీకుమార్తెనింత లేనివానికేల వివాహము చేసినారని యడిగినారు.

వారిప్రశ్నకు మహమ్మదువారు, అమ్మా ! నేను పేదవాఁడను. నాఅల్లుఁడు కూడ పేదవాఁడే. బంధుత్వము సమానులకుకుదిరినట్లు అసమానులతోకుదురదు. 'గొంగళితోచొక్కాకుట్టి దానికి జేబున్ను, గొంగళిదే వేయవలయునుగాని శాలువ జేబువేసిన నది పరిహాసముగా నుండదా' అని ప్రత్యుత్తరముచెప్పెను.

అది విని, మహమ్మదుగారి మాటలకు ఆశ్చర్యపడిసంతోషముతో వెళ్లిపోయిరి.

---

# జాఫర్.



"జాఫర్" సువర్ణాక్షరములతో వ్రాయఁదగిన మహాయోధుఁడు. మహానీయమైన వీనియుదంతము భారతదేశచరిత్రయం దత్యంతతేజోవిరాజితమై యున్నది. ఈమహావీరాధివీరునిఁ గూర్చి వ్రాయునప్పు డీతనితల్లి "ఖాతూన్" ను గూర్చి చెప్పనిదే సాధ్యము గాదని తోఁచగలదు.

ఈఖాతూన్ మహాపతివ్రత. పారసీ అరబ్బీభాషలందపారపాండిత్యముగల యువతి. ఖురాను కంఠస్థముచేసి నిరంతరము నికూజు యీశ్వరధ్యానము శుచి శీలములుగలిగి గొప్పవ్యక్తిత్వము సంపాదించిన మహావక్త. ఈమె కాబూలుదేశమున పెద్దపేరుమోసిన వంశమునకుఁ జేరి మంచికీర్తితోఁ గాపురము సేయుచుండెను. ఈమె కేకపుత్రుఁడు జాఫర్. జాఫరునకు తల్లియన్న నిరుపమానప్రేమ భక్తియుండెడిది.

ఆనాఁటి ప్రతిదేశపుచరిత్ర యెక్కడచూచినను యుద్ధములు, బందెపోటులు, వధలు మున్నగు మహాఘోరములచేనిండి భయంకరముగా నుండెను. ఊరువిడిచి యూరుపోవుటకు సాగునదికాదు. సరేగదా యిల్లువిడిచి పొరిగింటికైన వెళ్లుటకు ప్రాణాలపై యాశజాలించుకొని పోవలసివచ్చెడిది.

దుర్భరమైన యాదినాలలోఁ ప్రభువులకుఁ ప్రజలకు గండములకు, అలజడులకు మేరలేకుండెను. అప్పుడు కాబూలు అహమదుషాఅబ్దాలీ పరిపాలించుచుండెను. సరిహద్దులలోఁ చిన్నచిన్న పోరాటములు నిరంతరము జరుగుచుండెను. వాని నెదుర్కొనుటకు సామంతరాజులు నేమింపఁబడిరి. వారలెత్తిన కత్తి దింపుటకు సాగకుండెను. ఆయరాజకమున జాఫరు తండ్రి మఱికొందఱు సంహరింపఁబడినారు. తరువాత ఖాతూనీ సంగతి అబ్దాలీకి దెలిసినది. అబ్దాలీ జాఫరునకు

సేనాధిపత్యమిచ్చెను. ఉత్సవములు వచ్చినప్పుడు ఖాతూను కోటలోనికివెళ్ళు చుండెను. కోటలోనివారందఱు క్రమముగా ఖాతూనును జూచి విన్నాణములెఱింగి యామెమహోన్నత విద్యాప్రబుద్ధుల కచ్చెరు వొంది యొకగడియయైనను విడిచి యుండుటకు సమ్మతింపరైరి. అందుచే ఖాతూను దుర్గమునందే నిలువవలసిన దయ్యెను. దుర్గములోని రాణులు పిల్లలు ఇంచుమించు ఖాతూనును వెంబడించు చుండిరి. ఖాతూను వారందఱకు ప్రార్థనము, ఉషఃగానము ఖురానుపఠనము నేర్పి నిత్యశౌచశీలాది సదాచారములు తప్పకుండునట్లు మార్చివేసెను. ఈపరి వర్తనములో రాజభవనము నిత్యకల్యాణము పచ్చతోరణములతో విరాజిల్లు చుండెడిది.

ఇది అబ్దాలీ చూచి ఖాతూనును వేనోళ్ళఁబొగడి తల్లీ ! నీసహవాసమున నాయిల్లు స్వర్గముగా మాఱినదని. రాజకీయవ్యవహారములను నామెతో ఆలోచనము చేయుచుండెను.

ఇట్లుండ భారతదేశమున మహారాష్ట్రులు రాజపుత్రులు గొప్ప విశ్వ ప్రయత్నము చేసి పెద్దసేనను చేర్చిరి. దానికి సదాశివభావుఁడు అనునాతఁడు చమూపతియై సేననడిపించెను.

ఈయుదంతము చారులవలన అబ్దాలీకిఁ దెలిసి సదాశివునెదుర్కొనుటకు దండయాత్ర సాగించెను.

రెండుసేనలు పానిపట్టునొద్ద నెదురయ్యెను. అది 1761 సంవత్సరము. సదాశివభావుని సేన 7 లక్షలున్నది. అబ్దాలీసేన 25 వేలు. యీసారి మనము సదాశివభావునిచేతిలో నాహుతియై పోవలసినదేయని అబ్దాలీ నిరాశావివశుఁడై యీశ్వరునిఁ బ్రార్థించి వెనుకకుఁ జూచునరికి జాఫరు గోచరుఁడయ్యెను.

అబ్దాలీ జాఫరును చూచి కర్తవ్యమేమని నుడివినాఁడు.

జాఫరు—ప్రభు ! భయపడెదవేలా ! జయాపజయము లీశ్వరాధీనములు. నాకు నైదువందల అశ్వికదళము వెంటనిమ్ము. రేపు భానోదయము గాకపూర్వమే నేను సదాశివభావు శిరస్సు నరికి నీకర్పించెదను. అని శపథముచేసినాఁడు. తల్లి యాశీర్వదించినది. తోడి దండనాయకు లాశ్చర్యచకితులై పోయినారు. జాఫరు 5వందల భటులను తీసికొనివెళ్ళిపోయెను. తెల్లవారినది. సదాశివభావుని తల తెచ్చెదనని వెళ్లిన జాఫరు రాలేదు. అసంభవమైన యాకార్యము త్రినేత్రునకైన సాగునా యని యున్నవా రనుచుండిరి. అందులో నొకసేనాని జాఫర్ శత్రువు లలోఁ గలసిపోయినాఁడు. వారు జాఫరునకు కోటిసువర్ణఖండము లిచ్చినారు. అని చెప్పెను.

అది విని అబ్దాలీమనస్సు మండిపోయినది. ఖాతూనును బిలిచినాఁడు ఆమెతో జరిగిన కథ సవిస్తరముగా జెప్పి ఆహా ! జాఫరెంతకృతఘ్నుఁడు ; అని కన్నీళ్ళు విడిచినాఁడు.

ఖాతూ నాయుదంత మాలకించి రాజా నాకొడుకుజాఫరుకృతఘ్నుఁడా!కృతఘ్నుడా! అని పెద్దయెలుఁగెత్తి ముక్తకంఠముతో నఱచి అట్లెంతమాత్రము జరుగదు. నేనే పతివ్రత నగుదునేని, ఈశ్వరుఁడే నిజముగాఁ గలఁడేని నాజాఫరు నాయనుంగు పుత్రుఁడొక్కనాటికైన నవిశ్వాసి కానేరఁడు. కృతఘ్నుఁడు కానేరఁడు అని చెప్పి పడిపోయెనది. ఒకసేనానిలేచి యీమె తనకొడుకుపైఁగల ప్రేమచే నిట్లు చెప్పు చున్నది. అనియెను. ఖాతూను ! కాదు నానమ్మకము పరిశుద్ధమైనది. నాజాఫరు నాఱొమ్ము చెఱిగినాఁడు. నేనాతని కొకనాఁడును శిరఃస్నానము చేసి శుచినై ఈశ్వరుని ధ్యానించనిదే పాలనిచ్చియుండలేదు. అట్టినాగర్భరత్నము ఈఁతేనికి ఈమాత్రుదేశమునకు హానిసేయఁడు సేయఁడు. అని కన్నీళ్లు ధారాపాతముగా వచ్చుచుండ శపథముచేసి చెప్పినది. అంతలోనొకమూల ధూళిగ్రమ్మిన దృశ్య మగుపడినది. ఆతెరలమాటు గడవి మబ్బులోనుండి వెలువడినచంద్రునివలె నొక వ్యక్తి అపాదమస్తకము రక్తసిక్తమైజల్లెడవలెఁ దూట్లుపడిన దేహముతోఁ బరువు

పరువున వచ్చి జేనికాళ్ళపై సదాశివభావు తల పడవేసి వెనుకకు తిరగఁబడి చని పోయెను. అతఁడే జాఫరు. అది చూచి ఖాతూనుకూడ ప్రాణముల విడిచినది. తరువాత అబ్దాలీకి విజయము చేకూరినది.

# షద్దాద్

పూర్వ మిాజిప్టు అనుదేశమేలినమహారాజులలో ముఖ్యుఁడును గొప్ప చారిత్రకవిఖ్యాతిఁగన్న వాఁడును నగు "షద్దాద్" చరిత్రఖురానువంటి ఈశ్వర దత్తగ్రంథములయందుగూడనగపడుచున్నది.

ఈ షద్దాద్‌తల్లిదండ్రులు ఓడ నెక్కి దేశాంతరము పోవుచుండఁగా, గాలివాన పట్టినది. పడవ దారితప్పి సుడిలోపడి బ్రద్దలైపోయినది. ఓడలోఁ బ్రయాణము సేయువారందఱు సముద్రపుకెరటాలలో నంతరించిపోయినారు. వారిని చేపలుతినివేసినవి. ఒక గర్భవతియగు స్త్రీ కొకబల్లచెక్క దొఱకినది. అది యాధారముగాఁ జేసికొని యామె యెటులో నదియొడ్డునకు రావలెనని పయత్నించుచుండెను. ఇంతలో దైవవశమున నాదిక్కుమాలినపక్షివలె తేలిపోవు చున్న దీనురాలకు గర్భవేదనవచ్చి ప్రసవచిహ్నములగుపడినవి. ఆ మహా భయంకరమైన సముద్రమధ్యమున నామెకు సాగరకన్య తప్ప నెవ్వరును తోడు పడువారు లేరైరి.

ఆమె యామున్నీటినీటిపై తేలిపోవుచున్న చెక్కపైనెటులో ప్రసవమైనది. ప్రసవమైన క్షణములోనే చెక్కనుండిజారి యుదధిలోఁబడి ప్రాణములు విడిచెను.

ఆమె కన్నది మగశిశువు. ఇంతలో జాలరు లందుకొని శిశువును కాపాడి తోడ్కొనిపోయిరి. ఆ శిశువుపేరే షద్దాద్.

షద్దాద్ దినదినప్రవర్ధమానుఁడై విద్యాబుద్ధులు నేర్చి గొప్పబలశాలియైనను ఆపల్లెవాడలయందేయుండవలసినవాఁడై సంధ్యాసమయములయందు సాగరతీర భాగములయందు దిరుగుచుండును.

ఒకనాఁడు ఆకాశవీధినుండి దేవతలు పోవుచు నేలను పువ్వులు కురిసిరి. అందొక అంజనపుపెట్టె యుండెను. అది షద్దాదు తీసి కన్నులకు కాటుకవలె నుంచుకొనియెను. అంతటనాతనికి భూగర్భములోని రత్నాలు, మణులు, మాణిక్యములు గోచరము లగుచుండెను.

అవి యాజాలరులచేత పైకి తీయించి కోటలు పేటలుకట్టి క్రమముగా అపారమైన సైన్యముచేర్చి "ఈజిప్టుదేశముపై దండెత్తి గొప్పరాజయ్యెను.

ఈశ్వరుని మహామహిమ చెప్పనలవికానిదిగదా. ఒక పూరింటనుండు సన్యాసి నొకరాజాధిరాజును గావించి, భర్మహర్మ్యములంబెట్టి తులతూగించెను. ఆహా ! అంతటితో షద్దాద్ సంతసించలేదు.

ఈశ్వరుఁ డనువాఁడు నాకన్న నధికుఁడా యని గర్వించినాఁడు. ఈలోకమే నిజ మనుకొన్నాఁడు. తనయైశ్వర్యమే యనపాయ మనుకొన్నాఁడు. అప్పుడు ఈశ్వరుని కుండవలసిన లక్షణములన్నియుఁ బండితులవలన విని తా నలంక రించుకొని ప్రజలను తన్నే దేవుఁడని పూజింపుఁ డని శాసించినాఁడు. ఆప్రజలు ఈశ్వరుఁడు స్వర్గములో నుండునుగదా నీకు స్వర్గమేదని యడిగినారు. దానిపై షద్దాద్ స్వర్గము కట్టించినాఁడు. పురాణాలలో స్వర్గద్వారము ఒకేరత్నమున జెక్కి ద్వారబంధములు, తలుపులు అమర్చినారని యున్నది. అది షద్దాదునకు లభించలేదు.

అప్పు డీశ్వరుఁడు స్వర్గద్వారము తీయించి దేవతలచేత నంగడిలో విక్రయింపఁజేసెను. అది షద్దాదు కొని తనస్వర్గమునకు నెత్తించెను. అది తూచినట్లు సరిపోయెను.

తరువాత షద్దాద్ తన స్వర్గప్రవేశోత్సవము బాటించి వివిధదేశపు రాజాధిరాజుల రావించి వారితో నూరేగి ద్వారాముకడకు వచ్చునరి కొకవీరపురుషుఁ డు కరకుఁగరవాలము వ్రేలాడ నిలువఁబడియుండెను. షద్దా దాతనిఁజూచి నీ వెవరవు అని ప్రశ్నించెను.

ఆపురుషుఁడు, నేను యముఁడను. నీప్రాణములను తీసితెచ్చుటకు నీశ్వరుఁడు నన్నంపినాఁడని చెప్పెను. షద్దా దామాటలు వినినతోడనే గుండెలు నీరువిడిచిపోయినవి. గాలికి రావియాకువలెఁ గంపింప నారంభించెను.

ఓ వీరుఁడా ! నీవు నిజముగా యముఁడవే కావచ్చును. నేను కట్టుకొన్న స్వరమును నన్నొకసారి వెళ్లి చూడనిమ్ము. ఆవెనుక నాప్రాణములు నీవు తీసివేసినను నాకు జింతలేదని బతిమాలెను. కాని యముఁడది విని యీశ్వరాజ్ఞలేనిదే నేను జేయలేనని యిందు నీవు ప్రవేశించినచో నీకు మృతియే యుండదు గావున అంతకుఁ బూర్వమే నీజీవమును తెమ్మని నన్నీశ్వరుఁ డంపినాఁడని షద్దాదును చంపి తీసుకొనిపోయెను. ఎంతవారికైనను మృతితప్పలేదుగదా.

తరువాత యముని నీశ్వరుఁడు పిలిచి సమవర్తి ! యిన్ని ప్రాణాలు తీయుచున్నాఁడవుగదా నీ కెప్పుడైన జాలియనునది గలిగినదా ! అని యడిగెను.

యముఁడు-దేవా ! రెండుసార్లు కలిగినది. అని చెప్పినాఁడు.

ఈశ్వరుఁడు-అది యెప్పుడెప్పు డని యడిగినాఁడు.

యముఁడు-ఒకసారి సముద్రమధ్యమునఁ జెనెడుచెక్కపై పిల్లవానిని కని జారి వారధినిఁ బడిపోయిన తల్లిప్రాణాలు తీయునప్పుడును, రెండవసారి స్వర్గము కట్టుకొని కన్నులారఁ గాంచ వలయుననివచ్చినషద్దాదుప్రాణాలు తీయునప్పుడును నామనస్సు చాల చింతిల్లినది. అని చెప్పెను.

ఈశ్వరుఁ డది విని, ధర్మరాజా! ఆనాఁ డావెక్కపై కన్నవాఁడే యీపద్దాద్ అని చెప్పెను.

యముడుఁ డాశ్చర్యపడి, దేవా! యేమి నీమహామహిమ. ఆ నిరాధార బాలుఁడేనా నీపై కత్తికట్టినది. ఇదియంతయు నీమాయగాక మఱేమున్నది? అని నమస్కరించెను.



# తామూరులంగ్



తామూరులంగు భారతదేశము జయించిన మొగలాయి వంశపురాజులలో మొదటివాఁడు.

ఈ మొగలాయివంశము రఘువంశమువలె మిక్కిలి ప్రాచీనమును, పరిశుద్ధమును, నైతికబద్ధమును నైయుండెను.

ఈవంగడము తొలుదొలుత మంగోలియాదేశములోనిది. కావుననే మొగల్ అని పేరువచ్చినది. వీరు మొదటినుండియుఁ బ్రభువులుగనే యుండిరి. వీరిలోఁ జారిత్రకపురుషుఁడు "చంగీసుఖానుఁడు" ఈతని సంతతివారు మహమ్మదీయమతము కూఁకటివ్రేళ్లతోఁ బెఱికిఁ బాఱవేయవలయునని పెక్కుదండయాత్రలు మహమ్మదీయరాజ్యములపైఁ వెడలి బాగ్దాదు జయించి కోట్లకొలఁది మహమ్మదీయులను నరికివేసినారు. అంతఁ గొన్నాళ్లకాసంతతి మహమ్మదీయమతము స్వీకరించినది.

అందు తామూరులం గనురాజు గొప్పవిజయములనుగాంచి బ్రహ్మాండమైన రాజ్యమును స్థాపించి విఖ్యాతిగాంచిన రారాజు.

"లంగు" అనఁగా పారసీభాషలోఁ గుంటివాఁడనియర్థము.

ఈతఁడు బాల్యమునఁ గాలుమీఁద కాలువేసికొని నిద్రించువాఁడనియు, అది దరిద్రహేతుకమని సాముద్రికశాస్త్రవేత్తలు చెప్పినను మానకుండెననియు, అది భాగ్యదేవతచూచి వానికాలు విరుగఁగొట్టెననియు, తరువాతనేవానికైశ్వర్యము విజయము, రాజ్యము, వైభవము పట్టినదనియు జెప్పుదురు.

ఈతామూరు 'లంగ' ని బిరుదము పెట్టుకొన్నాఁడు. పూర్వము ఇప్పటివలె లోపములను గప్పిపుచ్చుకొను నాచారముండెడిదికాదు. కావుననే రారాజులు సైతము బానిసవంశమని బహమనీరాజులని పిలువఁబడుచుండిరి. ఇట్లే శాకటాయనుఁడని యొకవైయ్యాకరణి కలఁడు. శాకటాయనుఁడనఁగా బండితోలుకొను వాఁడని యర్థము. మఱియు శ్రీకృష్ణుఁడు పార్థసారథి అనఁగా అర్జునుని బండివాఁడని యర్థము. ఇట్లే యెన్నెన్నో కలవు.

ఈ తామూరులంగు క్రీస్తుశకము 1398 సంవత్సరము "ఢిల్లీ" సింహాసనముపైఁ గూర్చుండెను. ఆనాఁటి పేరోలగమునఁ బెక్కుగాయకులువచ్చి పాటలు పాడినారు.

ఆంధ్రదేశమునుండి త్యాగరాజుశిష్యులలో నొకఁడగు "అంధభట్టు" అను గ్రుడ్డివాఁడు వీణవాయించి కృతులు పాడినాఁడు.

తామూరులం గాసంగీతరవసుధామాధురీరసమును వేరతోఁ గ్రోలినట్లు గ్రోలి, పరవశుఁడైపోయినాఁడు.

కొంతసేపటికిఁ దేఱి, గాయకుఁడా ! ఎంతమంచిపాటలుపాడితివి. నీ గాత్రమాధుర్యము మమ్ము వివశునిఁ గావించినది. నీవు చాల పూజ్యుఁడవు. నీపేరు చెప్పుము. అని యడిగినాఁడు.

అంధభట్టు—మహారాజా ! నాపేరు "అదృష్టము" అని చెప్పినాఁడు.

అది వినుటతోడనే తామూరునకు నవ్వువచ్చి నీపేరు, అదృష్టమా ! నీవు గుడ్డివాఁడవు. ఎప్పుడైన నదృష్టము గుడ్డిదియగునా ! యని పరిహసించినాఁడు.

అంధభట్టు—రాజా ! అదృష్టము గుడ్డిదిగావుననే కుంటివానియింటికి వచ్చినది. అని చమత్కారముగాఁ జెప్పినాఁడు.

అందలి స్వారస్యము తామూరులంగు గ్రహించి వేనవేలు బహుమానము లిచ్చి సత్కరించెను.

అది అంధభట్టు తీసికొని నే నదృష్టవంతుఁడనే యనివెడలిపోయెను.

---

# జనకుఁడు.

జనక అను ఇంటిపేరుగల మహారాజులు చిరకాలము మిథిలానగరమున రాజ్యముచేసిరి. వారింట మొదటినుండియు భగవద్భక్తి, జ్ఞానసంపత్తి, శౌచశీలాత్మకమైన బ్రహ్మతత్త్వము ప్రాయికముగాఁ గలదు. అందు త్రేతాయుగాదిని జనకుఁడను సీరధ్వజుఁడు పరిపాలించుచుండెను. అతనికి రాజ్యపీఠమునఁ బ్రభుత్వముసేయుట కంటె పొలములకుఁ బోయి దున్ని వ్యవసాయము చేయుట యందే చాల ప్రీతి. ఆతని కుమార్తెకు "సీత" అను పేరుంచినాఁడు. సీత అనఁగా నాగలిచాలు అని యర్థము. సీతయుఁ జాల బుద్ధిశాలిని. తండ్రితోఁబాటు పొలమునకుఁ బోయె శ్రమపడి పనిచేసెడిది. జనకుఁడు జనకుని లక్షణములతో సీత కెన్నెని విద్యాప్రపత్తులునేర్పి పెద్దదానిఁగా జేసెను. సీత కొన్నాళ్లకు యుక్తవయస్కురాలైనది. ఆమెను నెపనికైననిచ్చి పెండ్లిసేయవలెనని జనకుఁడు రేయుంబగళ్లు ఆలోచించు చుండెను. కాని యెవరును తగినవరుఁడు లభించలేదు. అప్పుడాచారమునుబట్టి పెద్ద క్షత్రియకుటుంబములలో యాడుపిల్లలకుఁ బెండ్లికానప్పుడు స్వయంవరములు చాటించి ఆ యుత్సవమునకు వచ్చిన రాజులలో నెవరినో యొకనిని కన్య వరించిన వాని నామెకు బెండ్లిచేయుచుండిరి.

అట్లే సీతాస్వయంవరము జనకుఁడు చాటించినాఁడు.

అది విని, యెందఱో మహారాజాధిరాజులు వచ్చిరి. విశ్వామిత్రుఁడను ఋషి రాముని వెంటఁదెచ్చెను. రామున కప్పుడు పదియారేండ్ల వయస్సు. జనకునకు విశ్వామిత్రుఁడన్న చాల భక్తి. అతనివెంట సీత కీడుజోడైన రాముఁడు మిగులసొగసును, సామర్థ్యాదిమహారాజలక్షణలక్షితుడునునై రెండవ మన్మథుని వలెఁ బ్రకాశించుచుండెను. కాని స్వయంవరమున సీత వరించవలెను గాని జనకుని యిష్టము పనికిరాదు. అప్పుడొక ఇనుపవిల్లు తెచ్చి, యీ విల్లు నెక్కుపెట్టున విరచినవారికి సీత నిచ్చెదమని ప్రకటించిరి ఆవిల్లు చాల బలమైనది. సామాన్యు లెక్కుపెట్టుట యటుండఁగా అన్యులెత్తలేని స్థితియందున్నది. అది శివుని చేతి ధనుస్సు. ఆస్వయంవరమునకు వచ్చిన బందుగు లెవరును దానిని కదపలేక పోయిరి. రాముఁడు చటుక్కున నెత్తియెక్కుపెట్టున రెండుగా విరిచి పాఱవేసెను. వానియఖండబలసంపత్తికి మిక్కిలిగా మెచ్చి సీత నిచ్చి వివాహము చేసినారు.

---

## ఆదంబలఖీ.

ఆదంబలఖీ "బలఖ్" అను దేశమునకు సార్వభౌముఁడు. ఈతనిపేరు ఆదం. తాతతండ్రులచే సంపాదింపఁబడిన మహారాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడై ధర్మముతప్పక ప్రజలను పరిపాలించుచుండెను. వానియైశ్వర్యము, వైభవము, భోగభాగ్యములకు మేఱలేకుండెను. అతఁడు దినము తొమ్మిదిమణుగుల మల్లె పువ్వులపైఁ బరుండెడివాఁడు. మహాభోగి, అసూర్యం పశ్యతు" అనురాశిలో చేరినవాఁడు.

ఒకనాఁ డాతని యింటికి "షంషత్బరేజ" ను యోగివచ్చి కటికినేలను పరుండెను.

రాజదిమావి మనమేలపరుండరాదని యనుకొనియెను. అట్లనుకొని యోగి ప్రక్కను దానొకమూల పరుండెను.

యోగిలేచి చకితుఁడై రాజా! ఈబూడిదలో నీవిట్లేల పొర్లాడు చున్నాఁడవు? నీవు పువ్వులమీఁదను, హంస తూలికలయందును గదా నిద్రించెడివాఁడవు. నేఁడిట్లేల మాఱితివి? అని యడిగినాఁడు.

రాజు——నేనును నీవంటిమానవుఁడ నే. నీవలె నేనును నేలను నిద్రించు చున్నాను. ఇందేమివిపరీతమున్నది అని చెప్పినాఁడు. ఆసౌమ్యమగు రాజుయొక్క భావపూరితమగు మాటలు యోగి విని మిక్కిలిసంతసించి రాజా! నీతత్త్వము చాల సుగుణములతో నిండినది. నీవు ఈశ్వరజిజ్ఞాసచేయు నధికారము గలవాఁడ వని యాతనిచెవిలో నుపదేశించి వెళ్ళిపోయెను. ఆయుపదేశము మెఱపుమెఱసినట్లు నాతనిమార్చివైచినది. అది మొదలు రాజు భోగములందలి మమకారములు వదలి ఈశ్వరస్వరూపవిమర్శనము సేయనారంభించెను. అం దాతఁడు చూచిన దృశ్యములలో నేదిసుగుణసంపత్తికి నిదానమని తోఁచునో యది యభ్యసించు చుండెను.

ఒకనాఁడొక గొల్లవాఁడు చేరలతో నీళ్లుద్రావుచుండ చూచి నీళ్లుత్రావుటకు పాత్రనిమిత్తము లేదనుకొని తానును కరాంజలితో సలిలపానము సేయ నారంభించెను.

ఒకనాఁడు తనతండ్రి కట్టించిన యనాథశరణాలయమున కేతెంచి చూచుసరి కొకబాలుఁడు తనహస్తము పధానముగా నిడుకొని నిద్రించుచుండెను. ఆహా! నిద్రకు నెట్టిపరికరములును నక్కరలేదని తెలిసికొని తానట్లే యాచరించుచు కొన్నాళ్లకుఁ దనరాజ్యసర్వస్వము కూమారున కొప్పగించి రాత్రిజామునఁ బురము విడిచి లేడిపోయెను.

మఱునాఁడు వానిస్వజనము బాలవగవి వెదకి, దేశ దేశముల వెదకుటకై వారుల నంపినారు.

ఆదం గొప్ప విద్వాంసుఁడు. మహనీయుఁడు. దీర్ఘ దర్శి. సకలకళా కోవిదుఁడు. వైరాగ్యమునంజేసి దిశాంతముల మెట్టిజ్ఞానవిద్య నేర్చి పరిపూర్ణుఁడై నిస్పృహవృత్తినాయూరునాయూరు దిరుగుచు కడపట తనయూరే చేరెను. కాని తనయూరనుమాట మఱచిపోయినాఁడు. ఎంతసన్యాసికైనను, ఉదరపోషణము మానదు గదా, ఇట్లని యొకదివాణపుటుద్యోగియొద్దకుఁ బోయి తనకేమైనపని (కొలువు) నిమ్మనికోరెను. ఆయుద్యోగి.

ఈఆదము వృద్ధుఁడగుటచేత నీతఁడేందుకుఁ దగునని యోజించి తోటకాపరిగా నుండు (నౌకరి) కొలువు స్వల్పభరణమునకు నేమించెను.

ఒకపర్వదినమునఁ దోటలోనికి ఆదంకుమారుఁడగు రారాజు పరిమితవారుఁడై కతిపయామాత్య సహితముగ వచ్చెను. వచ్చినవారెల్లరు చెట్లక్రిందఁ దిన్నెలపైఁగూర్చుండి తోటకాపరిని బిలిచిరి. ఆదమువచ్చెను. ఆఆదమునకు నౌకరియిచ్చిన ఉద్యోగి, ఓయీ కాపరీ! తియ్యదానిమ్మపండ్లు తెమ్మ అని యాజ్ఞాపించెను. వెంటనే-

ఆదము—తియ్యనివి పుల్లనివి బాగుగఁ బండిన దానిమ్మపండ్లు గంపతోఁ దెచ్చి సమర్పించెను.

అవి రారాజును పరివారమును నారగింపఁ బంచఁబడినవి. రారాజుమున్నగు పలువురు పెద్దఉద్యోగులవంతునకు వచ్చినవన్నియు పుల్లదానిమ్మలే.

మేము తియ్యదానిమ్మ తెమ్మని చెప్పితిమిగదా అదినిర్లక్ష్యముచేసి యీకాపరి మమ్మునెగతాళిచేయుటకుఁ గాఁబోలును, తియ్యనివి పుల్లనివి కలిపితెచ్చినాఁడని మంత్రి కోపమున మండిపడి దూషింపుచు ఓరీ! దొంగకానా! యివియేమిపండ్లురా!

తియ్యదానిమ్మఁ దెమ్మని చెప్పియుండ పుల్లనివి తెచ్చినావు. నీకింత కండకావరము బలిసిపోయినదా ! అని పటపటపండ్లు కొఱికి లెంపలువాయించెను.

ఆదం ఆదెబ్బలుతిని నేలపడి యేడ్వలేదు. నవ్వుచునే లేచి, స్వామీ! నన్నేలకొట్టి నాశరీరమును నొవ్వఁజేయుచున్నారు ? నేను చేసినతప్పేమి ? అని యడిగెను.

మంత్రి—నీవు చేసినదంతయు తప్పే. మేము తియ్యదా నిమ్మలుతెమ్మనిన నీవు పుల్లదానిమ్మలు కలిపి తెచ్చితివి. ఇట్టి కొంటితనపు పెద్దిములు మహారాజు సమక్షమునఁ జేయఁదగునా ? అని కన్నులెఱ్ఱఁజేసెను.. ఆద మదివిని నావిధ్యుక్తమును నేను జేసితిని అని బదులుపలికెను.

మంత్రి—ఏమీ ! మరలఁ జెప్పెదవు ? అని కృద్ధుఁడై యడిగెను.

ఆదం—మంత్రీ ! నీ వేల యలిగెదవు. నీవు నాకిచ్చినపని తోట జాగ్రత్త పెట్టి కాసినచెట్టుకు దోహదములు గావింపుమని చెప్పితివి. నేనట్లే నెఱవేర్చుచున్నాను. ఇంక దానిమ్మలు తియ్యనివో పుల్లనివో తినువారికిగాని కోయువారికెట్లు దెలియఁగలవు. రుచి నాలుకచెప్పనుగాని వ్రేలుకాదు. నన్నేల నిష్కారణముగా మర్దించితివి. పాపమునకు వెరవవా అని సలక్షణమైన భాషతోఁ దన నిర్దోషత నుపపాదించెను.

అది విని యెల్లవారాశ్చర్యపడి వనమంతయుఁ బరీక్షించిరి. కాని యావనమందొక కసుగాయయు నపహరింపఁబడి నట్లగపడలేదు. అదిచూచి-

ఆదంవంటికాపరి లోకమునసెందైన నుండునా ? యీతఁడెవరోమహాయోగియని సభ్యులెల్లరు వేనోళ్ళఁబొగడిరి. కొందఱాఆదమును తేఱిపాఱఁజూచి ఆదమనిపోల్చి, యీమహనీయుఁడు మన వృద్ధరాజేయని యెఱింగించిరి. అది వినివారందరు సిగ్గున తలలువంచి తమతప్పులుక్షమింపుమని కాళ్లపైఁబడి వేఁడు

కొనిరి. కాని వారు కొట్టినదెబ్బలు తీసికొనలేకపోయిరి.

తే. గీ. కూలివాఁడైన దినము త్రాగుటకు గంజి
లేనివాఁడైన సత్యంబుఁ మానఁడేని
యతఁడెబాగగు నెన్నాళ్లకైనఁగాని
కోవిదులు దీనినేనేర్చి కొనెదరెపుడు

అని మిన్ను గీతము పాడినది.

రాజబంధువులు నానాదేశపురాయబారులు వచ్చి ఆదంబలఖీని తిరిగి రాజ్యము స్వీకరింపుమని కోరిరి. కాని ఆదం నవ్వినా కిప్పుడున్న రాజ్యమున కీరాజ్యము ఘనమైనదికాదని చెప్పెను. ఈప్రకార మాదంచెప్పినను ఆవి పిచ్చిమాటలని నవ్వుకొనిరి. అది ఆదం గ్రహించి నాయనా! మీరాజ్యము కేవలము భౌతికము, ఆభాసమైనది. నాయీశ్వరరాజ్యమునకది యేయంశము నఁగూడ సాటిగాదని పలికెను. కాని వారవి విశ్వసింపలేదు.

ఆదము సరే మీరు ఆత్మికరాజ్యమును నమ్ముకున్నారు. మీ ప్రాపంచిక రాజ్యమునందేమైన బలమున్న నేనిదే యొకసూదిని యీచెఱువులోఁ బాఱ వేసెదను. తీయింపుఁడు అని పడవేసెను. అదిచూచి రాజపరివారములోఁ బెక్కు రీఁతఁ గాండ్ర నాసరోవరమునం దింపి వెదకించిరి కాని సూది దొరకదు. నేలఁ బడినసూదియే దొఱకనప్పు డప్పులఁబడిన సూచిక లభించుట యసంభవముగదా.

అంత ఆదము నాయనా! మీయత్నము లింక చాలింపుఁడు. అని కాసారము సమీపించి జలదేవత నుద్దేశించి దేవీ! నీవు పరధన మపహరింపని దానివేయైన నీవు నిజముగాఁ గులీనవేయైన నస్తేయమే నీవ్రతమగునెడల నాసూది నాకిచ్చివేయుము అని కోరెను. ఈప్రకారముగా ఆదము సంవిధానముచేసిన వెంటనే యాసూది నొకచేప నోటకఱచికొని పైకివచ్చెను. ఆదమది తీసికొని ఆప్రజలందఱితోఁ "జూచితిరా ఆధ్యాత్మికమగు నీశ్వరరాజ్యమునకంటె రాజ్య మధికముగాద" ని చెప్పి వెంటనే ఆదము తిరోహితుండై వెడలిపోయెను.



# నర్మద

"నర్మద" వింధ్యాపర్వతప్రాంతమధ్యమాగాణములకు గొన్నిక్రోశముల దూరముననున్న మన్నెప్రదేశములలో నొకజానపదము తపతియను నదీతీరమున నుండెను. అందు మిక్కిలి నిరుపేదలైన కాపుల యింట జన్మించినది. ఆమె పుట్టినతోడనే విశ్వప్రకృతి ప్రశాంతమై జలదరించినట్లును, పైనుండి యెవరో దేవదూతలు వచ్చి చుట్టు అలముకొన్నట్లును, రిక్కలు తలంబ్రాలుజల్లినట్లు నేల రాలిపోవుచున్నట్లును, ఇట్టివేమేమో గొప్ప మహాపరివర్తనములు జరిగినట్లు ఆయూరివా రనుకొను చుండిరి.

తపతీనదీఘట్టమున నర్మదతల్లిదండ్రులకు వ్యవసాయముండెడిది. అందు నర్మద చిన్ననాఁటినుండియు వ్యవసాయమే చేయుచు పితరులకుఁ దోడ్పడు చుండెడిది. వారామె నెంతో గారవమునఁ బెంచి పెద్దదానినిఁ జేసిరిగాని నర్మదకు వివాహముచేయుటకు ముందే చనిపోయినారు. ఒంటరియైన నర్మద నాదరించు వారు లేక తపతీనదియందు పడిపోయి దివికేగిన తన తండ్రిదండ్రులను కలిసికొన నెంచినది గాని అదియును సరియైన దారిగాదని చింతించి యచ్చటినుండి లేచి వింధ్యనెక్కి యొకలోయనుజూచుకొని తపస్సుచేయ నారంభించినది. ఆతపస్సు అఖండముగా ఫలించుటచేత దేవలోకమున కామెయంత ఆమెయే యెగిరివెళ్ళి పోయినది. అచ్చట దేవదూత లామెను స్వర్గములోనికి రానియ్యక ద్వారములు మూసికొన్నారు. ఆవిపరీతము నర్మద చూచి దేవతలతో నేనుచేసినతపస్సునకు ఫలమిదేనా అని దీనముగా అడిగెను. దేవతలదివిని తల్లీ! నీవుచేసిన తపస్సు గొప్పదే కాని నీవు స్త్రీవి అవివాహితవు. అవివాహితలైన స్త్రీలకు స్వర్గములేదని బదులుచెప్పిరి. అప్పుడు నర్మద మిగుల విచారించి నేలకువచ్చి ఒకవికలాంగుని దైవవశమునఁ బెండ్లియాడెను. ఆతనిపేరు బలి. బలి చాలకురూపి, పైత్యరోగి, దురహంకారుఁడు. ఇన్నిటికి నోర్చి వానినొకగంపలోఁ బెట్టుకొని భిక్షమెత్తి జీవించుచుండెడిది.

ఇట్లొకనాఁడు రాత్రివేళ పోవుచుండఁగా "వాలఖిల్యాదు" లను ఋషులు చెట్లపైనుండి క్రిందకు వ్రేలాడుచుండిరి. వారిని బలి గంపలోనుండి తడిమిచూచి అదియేమోఅని మోచేతితో మూతిపగలునట్లు కొట్టువాఁడు. వారదిచూచి దుఃఖించి సూర్యోదయాదిని మమ్ముకొట్టిన దుష్టుఁడు తలపగిలి చచ్చును గాకయని శపించిరి. అదివిని బలి తనకు చావు తప్పదని భయపడిపోయి నర్మదను పట్టుకొని బతి మాలుచు యేడ్వ నారంభించినాఁడు.

నర్మద:—నీకేమినీ్ని భయములేదు అని చెప్పినది.

బలి:—నర్మదా ! నీవెంతదయమాలినదానవు.

నర్మద:—నాథా ! నీయెడ నేనేమియపరాధము జేసితిని?

బలి:—నర్మదా! నన్ను చంపుకొనెదవా?

నర్మద:—లేదు. నీవు నా ప్రాణముకన్న నధికము.

బలి:—నర్మదా ! సూర్యోదయాదినే నాప్రాణములు పోవునుగదా మఱియెట్లు?

నర్మద:—నాథా ! సూర్యుఁడుదయింపఁడు.

బలి:—అది సంభవమా?

నర్మద:—సంభవమే-

బలి—:ఎట్లు?

నర్మద:—నాపతివ్రతాప్రభావమున-

బలి:—ఆహా ! అని నిద్రవోయెను. సూర్యుఁడుదయించువేళ కుదయింప లేదు. లోకములన్నియు చీఁకటయిపోయినది. ఈకారణమేమని అనేకులు వ్యాకుల పడిరి. నర్మద సూర్యుఁడుదయింపరాదని అడ్డుపెట్టినదని యెల్లవారు తెలిసి కొన్నారు. అప్పుడు దేవతలువచ్చి సూర్యునుదయింపఁజేయుమని ప్రార్థించినారు.

నర్మద:—తనభర్తకుఁ బ్రాణాలు కాపాడెదమని అభయమిచ్చిన నేను సూర్యునుదయింపఁ జేసెదననెను. దేవతలు సరే అన్నారు.

అప్పుడు సూర్యుఁడుదయించునట్లు నర్మద ఆనతిచ్చినది. తూర్పుదిక్కున సూర్యుఁ డుదయించినాఁడు. బలి ప్రాణాలు దేవతలు కాపాడిరి. నర్మద నీరై నదివలెఁ బాఱి ప్రవహించినది. అదే నర్మదానదమని సూరతుదేశముగుండ పోవు చున్నది.



# లైలి



'లైలి' ఈజిప్టుచక్రవర్తి యనుంగుకూఁతురు. పూర్వకాలపు మహారాజులు తమబిడ్డలను ఊరబడులకుఁ బంపు నాచారముండెను. ఏమనిన వారి యౌవనదశను నిల్లువెడలరాని "గోషా" లోనుండుట తటస్థించునని చిరుతకూఁకటినాఁడే గంతు లువేయుకాలమునందే వారలజాండ మారయవలసిన విడుపుదినములని దలంచి యుందురు. లైలి "హాలీ" యను గురువునొద్ద చదువుచుండెను. లైలి, మిగులు నల్లనిశరీరచ్ఛాయఁగలది. "లయల్" అనఁగా వారి యరబ్బీభాషలోఁ జీఁకటి యని యర్థము, "లయల్" అనుధాతువు స్త్రీలింగమైనప్పుడులైలియనురూపము సిద్ధించును.

ఈ లైలితరగతిలో "మజును" అను నొకపేదకార్మికుని కుమారుఁడు చదువు చుండెను. ఈచదువులో వారిరువురకన్యోన్యానురాగ మేర్పడియెను. ఆ స్వచ్ఛమైన ప్రేమ శారీరకమైనదికాదు. మానసికము. తుది కది యాధ్యాత్మికముగాఁ బరిణ మించినది.

ఇట్లుండ నొకనాఁడు బడిలో ఖురానుపఠనమునందు మజును రాత్రినిఁ గూర్చిన మంత్రములు.

"ఇన్న అల్ జల్నాహు ఫీ
లై లతుల్ ఖదరె
ఒమాఅదరాక మా
లై ల తుల్ ఖదరె
లై ల తుల్ ఖదరె"

అని వల్లెవేయుచుండెను. లై లి యింకను ఆపాఠమువఱకు రాలేదు. ఈమె మిగుల చిన్నపిల్ల అయినను మజును తనపేరు ఖురానుమంత్రాలలోఁ బెట్టి పాడు చున్నాఁడని చాలకోపము తెచ్చుకొని, మజునూతో గొప్ప కలహముపెట్టుకొన్నది. మజును, ఎంతచెప్పినను ఆమె కోపము మానలేదు. కొన్నాళ్లకు లై లి ఆపాఠము నకు వచ్చినది. తాను మున్ను మజునూతోఁ గలహించినందులకు మిక్కిలి లజ్జపడి వగచినది. తన యవజ్ఞతకుఁ దానే లోలోపల నిందించుకొని మజునూను వివిధ విధముల క్షమింపవేఁడుకొన్నది.

మజును పేదవాఁడు, లై లి రారాజు కూఁతురు. ఆమె వేఁడికోలు మజునూను కరఁగించివేసినది. కరఁగిపోయిన తనహృదయములో మజును, లై లీని చూచినాఁడు. ఇట్లే వారి పరిశుద్ధమైన ప్రేమానురాగలతావితానములు దినదిన మతిదట్టముగ నల్లుకొని పెనవేసికొనిపోవుచుండెను. ఒకగడియయైన నొకరినొకరు చూడకుండ నుండలేకపోయెడివారు. ఇట్లుండ కొన్నాళ్ళకు లై లి యుక్తవయ స్సునురంగమున నడుగుమోప నున్నదని పితరులెఱింగి బడి మాన్పించివేసినారు. నాఁటినుండి లై లి, మజునూను చూడఁజాలకుండెను. ఆ వియోగమున లై లి తనపేరు లయలని పెట్టి నందుకు సార్థకముగాఁ దానొక గోషా యను చీఁకటిలోఁ బడిపోయినానని దుఃఖించు చుండెను. మజునూ యిఁకఁదన జన్మమధ్య నగుపడఁడని భూనభోంతరాళముల నీమానవ నిర్బంధసంస్కారములను గూర్చి తలపోయుచు మానసికరథమును దోలి తోలి రజముచేసి పరాగాలేపనభూయిష్ఠమైన మైకమున మూర్ఛిల్లిపోవు చుండెను.

నిరంతర మనుపమానమానిత దివ్యాదర్శశోభిత మహామతియగు లైలి యగోచరయై తలలిపోయినందుకు లోకమే లేదని ఆలైలి పోయినను, ఈలైలి (చీఁకటి) కలదని వ్యసనా మృతమహాగాఢాంధకారతపస్సు మనస్సునఁజేర్చి లేచి పోయినాఁడు. మజును అనఁగా అరబ్బీభాషలో వెఱ్ఱివాఁడని యర్థము. తుదకు మజును, మజునూ అయిపోయినాఁడు.

ఈసంగతి లైలి వార్తాహారులవలనఁ దెలిసికొని, వివిధదేశముల వెద కించెను. కాని మజును అగపడఁడయ్యెను.

ఒక్కనాఁడు మజును ఈజిప్టునకు వచ్చి, లైలివియోగ గీతములు పాడుచు పోవుచుండెను. ఆసంగతి లైలికిఁ బరిచారికలు చెప్పిరి. ఆతని సందర్శింపవలెనని లైలికోటగురుజుపైకెక్కి మజునూను చూచినది. ప్రేమాంబుధి పొంగి పొరలి యువ్వెత్తున ముంచివేసినది. పెద్ద నిట్టూర్పుపుచ్చి లేచి యశ్రువులు గార్చి తిరిగి చూచుసరికి మజునూపై ఊరిలోని కుఱ్ఱకుంకలు రాళ్లురువ్వుచుండిరి. వానివలన లైలి హృదయమేగాదు శరీరముగూడ తూట్లుపడుచుండెను.

అప్పుడామె-

"రాళ్లరువ్వకుఁడతఁడు నాప్రాణహితుఁడు" అని యేడ్చినది. ఆయేడ్పు ఆ సమీపమున "నమాజు" (దైవప్రార్థన) సేయుచున్న మౌల్వీ విని రాజున కీ యుదంత మెఱింగించెను. రాజు లైలీని బిలిచి మందలించెను. లైలీ మౌల్వీని జూచి "నీకు నా యేడుపెప్పుడు వినిపించినది" అని యడిగెను.

మౌల్వీ—నమాజులో,

లైలి—నీ నమాజులో నాయేడ్పు వినిపించినది గాని నాయేడ్పులో నా "మజునూ" అగపడినాఁడు. అని వెళ్లిపోయినది.



# నోవా.



"జబీదా" నోవాయను మహాపురుషుని పుత్రిక. ఈనోవా బైబిలు, ఖురాను, అనుమతగ్రంథములలో గొప్ప ప్రవక్త. దేవదూత అని వ్రాసియున్నది.

ఈనోవా సర్వదా యీశ్వరభక్తి జనులకు నేర్పుచు తన కాలము గౌరవ ముగా గడపుచుండెను. కాని కొందఱీతనిని నిందించుచుండిరి.

జబీదా తండ్రియందు మిక్కిలి విశ్వాసము ప్రేమగలిగి సర్వకాలసర్వావ స్థలయందును కంటికిఱెప్పవలెఁ గాచుచుండెను. ఈజబీదా చాలవిద్యావతి, గుణవతి, సౌందర్యవతి సమస్తభాగ్యలక్షణములు ఆమె ముఖబింబమున నద్దములోనగుపడు మల్లెపూలవలె నగపడుచుండెను. ఆమెనుచూచినవారందరు చాల ముచ్చట పడు చుండిరి.

నోవాకూడ జబీదాను కన్నులలోఁబెట్టికొని పెంచుచుండెను.

ఈమెకుఁదోడు నోవాయొద్ద నొకకుక్క ఒకకోఁతి ఒకయెలుఁగొడ్డు నుండెడివి. వీరితో దినమంతయు నోవా గడుపు చుండెను.

ఒకనాఁ డీశ్వరుఁడు నోవాయొద్దకువచ్చి ఓభక్తుఁడా ! నేనీలోకమంతయు నీటిలో ముంచివేయనున్నాను. నీవు ముందే మేల్కొని నీజనమును కాపాడు కొనుము. లేనిచో ఆమహాజల ప్రళయములో లయమైపోవుదురు అని చెప్పెను.

నోవా అదివిని స్వామి ! నీమహామహిమచేఁ బ్రపంచమును నాశనముసేయ నున్నప్పుడు నేనుగాని నాస్వజనముగాని తప్పించుకొనుట కెట్లు సాధ్యమగును. అని యీశ్వరు నడిగెను.

ఈశ్వరుఁడు ఓనోవా ! నీవు భయపడవలదు. నేఁటినుండి యొక నావను

కట్టుము. అందులో భక్తకోటి నెక్కించుము. నేనా నావకు కర్ణధారుఁడనై నడిపి మిమ్మందఱఁ గాపాడెదను. అని అంతర్ధానమై వెడలిపోయెను. ఈసంగతి నోవా ప్రజలకెఱింగించెను కాని యెవరును నమ్మలేదు. నోవా పడవకట్టి, ఓభక్తులారా! మీరైన నాతో రండురండు అని బతిమాలి పిలిచెను కాని ముఖ్యులగు పదిమంది కంటె నధికముగ నెవ్వరును రారైరి. వచ్చిన ఆపదుగురను, జబీదాను, కుక్క, కోఁతి, పిల్లి, యెలుగుగొడ్డును తీసికొని నోవా నావ నెక్కెను. అంత మర్నినాఁడే నీళ్లుభూమినిముంచివేసినవి. నోవాతో నున్నవారుతక్క తక్కిన వారందఱు మునిఁగి ప్రాణములనుపోఁగొట్టుకొన్నారు.

తరువాత నీళ్లు హరించిపోయినవి. సృష్టియథాప్రకారము సాగనారంభించి నది. అంత నోవా తన యనుంగు కూఁతునకుఁ బెండ్లిచేయ నూహించెను. ఈసంగతి విని వెంట నంటియున్న శునకము, మర్కటము, మార్జాలము, భల్లూకము కలిసి యేడ్వనారంభించినవి. వాని విలాపకారణము నోవాకుఁ దెలియక మీరేల యీలీల దుఃఖపడుచున్నారని యడిగెను.

ఆనలుపురు నీవు మాసోదరి జబీదాకుఁ బెండ్లిసేయ నూహించుచుంటివిగదా మఱిమాకుమాత్ర మేల పెండ్లిసేయవు? మేము నీకూఁతురుతోఁబాటు నీ సేవసేయ లేదా నీయాజ్ఞప్రకారము నడచుటలేదా అని మొఱపెట్టెనవి. ఆదీనాలాపములకు నోవా కరిగి జాలిపడి వారినలుపురను తనజబీదావలెఁ గావలయునని తపస్సుచేసి మానవతులనుగాఁ జేసినాఁడు.

తరువాత నోవా వారినైదుగురను నైదుగురువరులకిచ్చి వైభవముగా వివాహముజేసెను.

కొంతకాలము జరిగినవెనుక నోవా తనముద్దుతనయను చూడవలయునని అల్లురనిండ్లకు వెళ్లెను. కాని తనకూఁతు రసలెవతోఁ బోల్చలేకపోయినాఁడు. అప్పుడు

వారిభర్తలలో నొకొక్కరిని బిలిచి, నాయనా ! నీవు సుఖివై యుంటివా ! యని యడుగు చుండెను. అందొకఁడు. స్వామి ! ఏమిచెప్పుదును నాభార్య భార్యగాదు. కనకమని యొకఁడు. నాభార్య మార్జాలముగాని మానిని గాదని రెండవవాఁడు. నాభార్య మర్కటముగాని మహిషిగాదని మూఁడవవాఁడు నాభార్య భల్లూకముగాని భామినిగాదని నాల్గవవాఁడు చెప్పుకొన నారంభించిరి. అదివిని నోవా తనలోవీరి భార్యలకు నావరప్రభావమున స్త్రీ రూపములువచ్చినను గుణములు మాలలేదని యనుకొని యూరార్చి అయిదవదియదు జబీదాయింటికి వెళ్లి అల్లునిబిలిచి నీవు సుఖివై యుంటివా ! యని నోవా యడిగెను. అతఁడు స్వామి నాసుఖమునకు మేరలేదు. నాభార్య పాతివ్రత్యమహాప్రభావమున నేనష్టైశ్వర్యముల ననుభవించుచున్నాను. ఆమె యడుగు మోపినచోట బంగారము వర్షించుచున్నది ఆమె కన్నెత్తిచూచినచోట మోళ్లుగూడ చిగిరించుచున్నవి. నిలిచినచోట నిత్యకల్యాణము పత్ర్పతోరణములు పరగుచుండును అని పొగడ నారంభించెను.

అప్పుడు నోవా సంతసించి యీామెయే తనతనూజయని, తెలిసికొని యర్ఘ్య పాద్యముల నందుకొని విందారగించెను.

పైనలువురు జంతుసంతతివారే లోకములోని చెడ్డస్త్రీలనియు, జబీదాసంతతి వారే ఉత్తమస్త్రీలగుదురనియు, నిరూపించెను.



# దానవవధ

## ( నాటకము )

ఇది

"బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా కవిగారిచే

రచింపబడినది

శ్రీ విజ్ఞాన విద్యా పీఠము

పిఠాపురము

తూ॥ గో॥ జిల్లా.

***1988***




దానవవధ లేక ప్రహ్లాద హిరణ్యకశిపము.

ఇది భాగవతసప్తమస్కంధమునఁ బోతనామాత్యుఁ డత్యంతప్రావీణ్యముచేఁ గవితారస మొలికించి జగంబున నప్రతిమానం బగుకీర్తినిఁ బడసి యున్నాఁడు. ఆకవితకుఁ జాలినకవితగాని ఆధోరణికిగాని జాలినధోరణిగానియాంధ్రభాషయందు లేదు. నన్నీకథ నాటకరూపమున వ్రాయుట కొకస్నేహితుఁ డుత్సాహపఱచిన నే నత్యల్పకాలమునఁ (1911 సం॥) బూర్తి గావించితిని.

ఇదియును, 250 పేజీలు గల "పద్మావతి" యనునవల (ఇం దొకరాకుమారి యొక్క యద్భుతయుదంతము వర్ణింపఁబడి యున్నది.)

ఈరెండుగ్రంథములును మాగ్రంథమాలికాప్రథమపాఠకులు చవిచూచిన వెనుక మఱియొక నూతనపక్కగ్రంథములు తృతీయచతుర్థకుసుమములోకే.సారిగా నివ్వనున్నాము. ఈమాయుద్యమమును శ్రీ విజ్ఞాన విద్యాపీఠ సభాసభ్యులచే అత్యోత్సాహముతో దీనిని నచ్చొత్తించి ప్రకటించిరి వారికి నేను కృతఘ్నుఁడను.

పిఠాపురం.
21-1-1914

ఇట్లువిధేయుఁడు,
ఉమర్ ఆలీషా

క. కరుణామయుఁ డగుపరమే
శ్వరుఁడు, మహమ్మద్రసూల్ప్ర • వక్తయు స్థిరులం
చరసెద, నాఖైలలిగురు
వరుని నుతించెదను భక్త • వత్సలుఁ డనుచున్.

## కృతి.

సీ. కల్యాణగుణముల • కాణాచియై బంధు
వర్గంబు దనిపిన • పరమసాధ్వి
పుట్టినయింటికి • మెట్టినింటికి శుభ
ములు గూర్చి వెలసిన • పుణ్యచరిత
పతియందుఁ దనదుసం • తతియందు ననుకూల
మతియయి మసలిన • మహితశీల
అక్కసెల్లెండ్రైన • నన్నదమ్ములనైన
నతిభక్తి నెఱపిన • యమలహృదయ

లలితవ్రతశేష సకలమం • గళవిశేష
కిల్బిషవిదూరపరితోష • కీర్తిశేష
యైనశ్రీఫాతిమాంబ మా • యక్కకు నీది
కృతి యొసంగెద సుకృతసం • గతి నెసంగి.

ఉమర్ఆలీషా.

"ఓం పరమేశ్వరాయనమః"

శా. తేజోరాశి ప్రచండదీధితులచే ♦ దీపింప దిఙ్మండలిన్
రాజిల్లన్ భగవానుఁ డం చెవనిక ♦ ర్ఘ్యంబుల్ సమర్పింతురో
రాజీవంబుల కెవ్వఁ డాత్మహితుఁడై ♦ రాణించునో యాయినున్
బూజింతున్ భగవంతుఁడైన నతఁడే ♦ ముఖ్యుండు లక్షింపఁగన్.

ఉ. ఆరమణీయసర్వసుగు ♦ ణాన్వితుఁ డార్తశరణ్యుఁ డాపదో
ద్ధారుఁడు దీనరక్షకుఁ డు ♦ దారుఁడు సర్వము దానెయైనయోం
కారుఁడు పాపభంజనుఁ డ ♦ కల్మషుఁ డప్పరమేశ్వరుండు నన్
జేరెడునట్లు నాహృదయ ♦ సీమను నిల్పి భజంతు నిత్యమున్.

తే. గీ. నీఁకటులు విచ్చు సూర్యుని ♦ రాకవలనఁ
దాపము శమించు మలయశీ ♦ తంబువలన
లలితశుచి వచ్చు గంగాజ ♦ లంబువలనఁ
బాపము నశించుఁ బరమేశు ♦ ప్రార్థనమున.

తే. గీ. సూదిమోపుటకైనను ♦ జోటులేక
నిండి యున్నాఁడు పరమేశ్వ ♦ రుండు జగతిఁ
గలఁడు లేఁడని మూర్ఖుండు ♦ కలఁగు చుండు
సారిది నిసుకరాలినకను ♦ చూపు పగిది.

క. ఆసకలాంతర్యామికి
భాసురత్రైలోక్యజీవ ♦ పాలనఖనికిన్
వాసవహృదయవిహారికిఁ
జేసెద జేజేలు భక్త ♦ చింతామణికిన్.

## ఇందువచ్చుపాత్రములు.

హిరణ్యకశిపుఁడు—రాక్షసరాజు.

సుమంత్రి లేక మధుప్రియుఁడు—మంత్రి.

విదూషకుఁడు లేక నర్మసఖుఁడు.

దేవేంద్రుఁడు

ప్రహ్లాదుఁడు.

చారులు.

గంధ, గజగంధ, గార్గి, గరళపాదుఁడు — రాక్షససైనికులు.

సామంతరాజులు.

యమ, వరుణ, అగ్ని.

రాక్షసవాహినీపతి.

దేవసేనాని.

బాలకులు.

చండామార్కులు—ప్రహ్లాదునిగురువులు.

తలారులు,

కపాలకుండలుఁడు, రత్నాకరుఁడు — ప్రహ్లాదునివిహితులు.

శుక్రాచారి—రాక్షసగురువు.

అహితుండికుఁడు....పాములవాఁడు.

ఋషి.

బృందారకుఁడు.

### స్త్రీలు.

లీలావతి—ప్రహ్లాదునితల్లి.

శచి—దేవేంద్రునిభార్య.

రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ — దేవవేశ్యలు.

# నాంది.

శా. శ్రీ లీజాలునా బంధమోక్షవిజయ ♦ శ్రీ లిచ్చునో భాగ్యముల్
బాలం గూర్చునొ నిత్య మర్థులకుఁ ద ♦ చ్చారిత్ర మీధాత్రిపైఁ
బోలంబోదు ముఖ స్తవంబులకు నై ♦ పొంగారుచున్నట్టితే
జోలంకారుఁడు నీశ్వరుం డిడును మీ ♦ కత్యంతసౌభాగ్యముల్.

తే. గీ. దిక్కులేనివారి ♦ దిక్కయి జగముల, కొక్కవేలు పగుచు ♦ మ్రొక్కువారి
కఖిలశుభము లిచ్చు♦నాద్యంతరహితుండు, సౌఖ్యముల నొసంగు♦సభ్యులకును.

(నాంద్యంతరము సూత్రధారుఁడు)

సూత్ర—నటీ ! నీ వొకసా రిటు రమ్ము.

నటీ—ప్రియా ! ఏమి యనుజ్ఞ ?

సూత్ర—అఖిలకల్యాణగుణవిశారదు లైనయీ సభాసదులు మనల నొకనాటక
మాడి యానందింపఁజేయుట కనుజ్ఞ నొసంగుచున్నారు.

నటి—సభ్యులయనుజ్ఞ సర్వదా శిరసావహింపవలసినదేగదా ?ఇప్పుడేనాటక మాడి
సకలకళాకోవిదు లైనయీమహాజనులను మెప్పింపవలయును ?

సూత్ర—నేనును నయ్యదియే యోచింపుచున్నాఁడను.

ఉ. ఏకథనంబు ముజ్జగము ♦ లీశ్వరుఁ బాడునొ యేది పుణ్యను
శ్లోకులు కోవిదుల్ విబుధ ♦ లోకము మెచ్చునొ యేది పూజ్యమో
యాకథనంబు నాటకము ♦ నాడిన నాడఁగవచ్చు లేనిచో
శ్రీకరమై వెలార్పదు వి ♦ శేషచమత్కృతు మై దనర్చినన్.

నటి—ఓహో ! ఇది చాల నసాధ్యమే.

క. శృంగార మొకరు గోరెద, రంగనలప్రసంగ మెక్క రడుగుదురు రవిం
పంగను వేదాంతము, నటి, సంగీతం బెవరు విం్రదు ♦ సభికులయందున్.

సూత్ర—చెలీ ! నీ విచ్చట మిక్కిలి పొరపడి "వేదాంతము నటిసంగీతం బెవరు
విం్రదు ♦ సభికులయందున్" అని యధిక్షేపించితివి. అట్లు గాదు.

శా. సంసారంబులు సేయుచున్నను మహా ♦ సన్యాసియై యుండినన్
హంసీయానలఁ గూడి యాడుచు విలా ♦ సాసక్తుఁడై యున్నవి
ధ్వంసజ్ఞానుఁడు మూర్ఖచిత్తుఁడు కృపా ♦ బాహ్యుండునై యుండినన్
కంసారాతి వినీతి గీతికలకున్ ♦ గైవాఁపు లర్పింపఁడే.

నటి—(అవనతవదనయై) నాథా ! ఈయర్థము ముమ్మాటికిని యథార్థము. అట్టి
ప్రహ్లాదకథ నేదేని నొకదానిని మీరే నిరూపించి నిర్వచింపుఁడు.

సూత్ర—నటీ ! అసంకల్పముగా నుబ్బావ్వ సవాయువువలె నీనోటనే జాఱిపడిన ప్రహ్లాద కథకన్న నధిక మేమున్నది ? దానినే ప్రదర్శించెదము.

ఉ. భాగవతోత్తముండు బుధ ♦ వంద్యుఁడు ముజ్జగమందు వానిని
ద్యాగరిమంబు సంస్తుతిని ♦ దానము జ్ఞానలతాలవాల మై
తూఁగు జగానఁ దచ్చరిత ♦ తోఁ జరితార్థము గావె నాటకో
ద్యోగము మాకు నెచ్చెలి ! త ♦ దుక్తికి సభ్యులుగూడ మెచ్చెడున్.

నటి—మీయాశయము పరమపూజ్యము. ఈకృతి యెవరిచే రచియింపఁబడినది.

సూత్ర—ఉమర్ఆలీషాకవిచేత.

నటి—ఇంక నడుగవలసిన దేమున్నది ?

తే. గీ. కవిత కుండువలసినల♦క్షణములకును, భావముస్వభావవర్ణనా♦బంధములకు
పుట్టినిల్లగునీకవి ♦ బుధునివాక్కు, సారె కననేల పుత్రమాలి ♦ షాసుకవిని.

సూత్ర—అగు నీతీరున నీకవిఁ బెక్కుగ్రంథములు సర్వజనాదరణీయం బగునటుల వ్రాసి పేరుమోచి యున్నాఁడు.

నటి—కావుననే కవితనుగురించి నిర్వివాదాంశము. (ప్రకటనపత్రికఁ జూచి) నాథా! దీనికి దానవవధ యనునామ మేమి ?

సూ-గీ. దానవులు దేవతలపైని♦ దాడి వెడలి, జేసినవధావిధానంబు♦ చెడిహిరణ్య
కశిపుఁడాత్మజు బాధించి♦కసిమసంగి, పడినవధచేత "దానవ♦వధము" నయ్యె.

నటి—సరి. ఇది యుభయార్థములయందును వర్తించి సార్థకముగానే యున్నది.

సూత్ర—నటీ ! ఇంతసేపటినుండియు నేదేని యొకపాటైనఁ బాడవైతివి. ఈ సభ్యులు నీగానమాధుర్యమును గాంచి హర్షించెదరు గదా !

నటి— దేనినిఁ గూర్చి పాడవలయును ?

సూత్ర—ఈశరదృతువును గూర్చియే పాడుము.

నటి—అవస్య మట్లే పాడెదను.

ఉ. శారదనీరదభ్రమముల ♦ బాటున మాటున డాఁగి చూచుక
ల్హారమనోహరుండు విర ♦ హార్తిఁ గృశించుచకోరపాళికిన్
నీరము పాలు పోసి రజ ♦ నీచరులన్ గలగుండుసేసి సొం
పార నభోంతరాళము ప్ర ♦ హ్లాదమొనర్చదె యెట్టివారికిన్.

సూత్ర—ఓహో ! ప్రహ్లాదకుమారుజన్మచరిత ముగ్గడింపుచు హిరణ్యకశిపమహారాజదే కొలువునకు విచ్చేయుచున్నాఁడు.మనమును బోవుదము రమ్ము. (అనిపోవుదురు.)

# దా స వ వ ధ.

## ప్రథమాంకము.

రంగము—సభామంటపము.

(హిరణ్యకశిపుఁడు, మంత్రి, సామంతరాజులు, విదూషకుఁడు ప్రవేశించి యుందురు.)

హిర—సభ్యులారా! మీసందేశము నాకెఱుంగ వచ్చినది. సఫలీకృత తపస్సంపన్నుఁడనైన నావలన మీరు పడయరాని యర్థము లుండవు. ఇంక మీవాంఛితము లవిచ్ఛిన్నముగా నెఱవేరును. ఏ మనియెదరేని :—

సీ. ఎండవానల కాఁగి ♦ కొండకొండలదరిఁ, దిరుగాడుదుఃఖంబు ♦ దీఱె కాదె
జపమాలికలు గొని ♦ యుపవాసదీక్షలఁ, గడపెడువ్యసనంబు ♦ గడచెఁ గాదె
మునివృత్తి నూర్ధ్వాభి♦ముఖమున వేయేండ్లు, దపమొనర్చెడు క్రియల్ ♦తప్పెఁగాదె
ఆఁకటి కిన్నియా ♦ కలము జలములు, స్వీకరించెడుబాధ ♦ వెడలెఁ గాదె

నేఁడు విశ్రాంతి చేకూఱె ♦ నిర్జరేంద్ర
వరులగుండెలలో రాయి ♦ వడెడునట్లు
వైరికాంతలకన్నీరుఁ ♦ గారునట్లు
శౌర్యధనులారా! రాక్షస ♦ వర్యులార!

సామంతరాజులలో నొకఁడు—నేఁడు గదా! మేము సంపూర్ణధన్యులము. నేఁడు గదా! వైరులబారినుండి విడివడినవారము. (హిరణ్యకశిపునివంకఁ దిరిగి) ఓ దానవసార్వభౌమా! నీకడపటివాక్యము లమోఘము లగును గాక! వైరికాంతల కన్నీరు లొలుకును గాక! నిర్జరేంద్రులగుండెలు పగిలి పోవును గాక!

విదూష—(చంకలు కొట్టుకొని) నా కీవేళ శ్రాద్ధభోజనములో గారెముక్కలు దొఱకినంతసంతోషముగా నున్నది. మహారాజుగారి కడసారివాక్యములు, ఈ సామంతరాజుల స్తోత్రపాఠములు, ఓహో! మా కింద్రపదవి మహారాజునకు

పరమపదవి. ఓవెఱ్ఱి సామంత రాజులారా ! సార్వభౌమునిచేత నప్పుడే మరణ శాసనము వ్రాయింప నెంచిరా ? మీయమ్మకడుపు చల్లగాను తపస్సునకుఁ బోయి అన్నాళ్ల కిన్నాళ్లకు నడవులనుండి కొండలు దిగి యేళ్లు దాఁటి భార్య బిడ్డలపై నున్న ప్రేమచేతఁ బరుగెత్తుకొని వచ్చినమహారాజును జూచి "మీ కడసారి వాక్యము" లని అప్పుడే మారణమంత్రములు పలుకు చున్నారా? అప్పుడే శాపములు పెట్టు చున్నారా? బాలు! పోఁతగంజి త్రాగిన బక్కకుక్కలకువలె మనకుఁ దిరిగి దానవేశ్వరుని జూడఁగనే చేవ వచ్చినది. ఆ నాలుగుతలకాయల వెఱ్ఱిపీనుఁగు ఇంద్రాదిదేవతలవీఁపు బ్రద్దలుకొట్టు మని మహారాజుకన్నివరములు ఇచ్చి పంపనే పంపినాఁడు. మనరొట్టె నేతిలోఁ బడనే పడినది. మఱల దేవలోక మున మన మొక వెలుఁగు వెలిఁగింతుము. చూడు నామహిమ! (అని చంకలు కొట్టుకొనును.)

మంత్రి—దానవేశ్వరా ! తాము వడిసినవరము లేమేమి యున్నవి ?

హిర—ఇన్నియని లెక్క యేమున్నది?

ఉ. మూఁడుజగంబులం దెదిరి ♦ పోరెడు శూరుఁడుగాని నన్నువేఁ
టాడుబలుండు గాని భువ ♦ నావళిఁ బుట్టఁడు ; పుట్టబోఁడు ; నా
పాడిన దెల్ల పాట పరి పాటిగ ♦ నాడిన దెల్ల యాట కొం
డాడఁబడున్ త్రిమూర్తులన ♦ డంచినఁగాదనువారలుందురే.
మఱియు

ఉ. రేలఁ బవళ్ల సంధ్యల న ♦ రిప్రకరంబులచేతఁ జావు రాఁ
జాలదు నేల నాకసపుఁ ♦ జాలున నద్రిసముద్రదుర్గది
గ్జాలములందుఁ బ్రాణభయ ♦ కారణముల్ సమకూడ వీజగ
జ్జాలము నాయధీనము ప్ర ♦ జన్ బరిమార్చిన లేక పెంచినన్.

సామం—మహాభాగ్యము. మహాభాగ్యము. మాకుఁ గావలసినవరము లివియే. (అనియభివాదములు సేయును.) ఇంకనైన దానవలోకము సముద్ధరింపఁ బడునుగాక !

హిర—నాఁడు సూర్యచంద్రులను జక్రములుగాఁ జేసి చేసిన త్రిపురాసురసంహారమునకుఁ బ్రతీకారముగా నేను ద్విమూర్తిసంహారమున కదేరీతిని బోయి పిలుకు మార్చెదను.

విదూ—అగును మహారాజా ! ఆమహాకాలునిరథ మెర వడిగి తీసుకొనిరమ్ము. నేను నీకు సారథిగా నుండెదను.

సామంత—మహారాజునకు జయ మగునుగాక !

మంత్రి—సార్వభౌముని విజయయాత్ర కెన్నివారములు పట్టును.

హిర—ఎప్పు డవసరమువచ్చిన నప్పుడే వెడలవచ్చును. అప్రయత్న మిప్పటి నుండియే సాగించు టెందులకు ?

మంత్రి—ఇప్పు డట్టిముఖ్యావసరము వచ్చినది. అది యేమన:—

చ. సవనశతంబు లేయెడల ♦ సల్పిన హవ్యము లారగింపఁగా
తవతవ నేగుచుండిరి హు ♦ టాహుటి మాపినతల్లిపుత్త్రులా
దివిజు లొకింత పాలిడక ♦ తెంపరులై మము లెక్కసేయ రీ
భువిపయి గౌరవంబు చెడి ♦ పోయెను న్యూనత వచ్చె నెంతయున్.

హిర—అగు నది నే నెఱుంగుదును.

సామం—వారిదుండగ మడంచినఁ గాని మనకుఁ బోయినదేవత్వము మరల రానేరదు.

విదూ—మనము పూర్వదేవతల మని పుణ్యజనుల మని యీ ప్రజలు బొత్తిగా మఱచియే పోయినారు మఱల వానిపునస్సృష్టికిఁ బ్రయత్నింపవలయును. ఊడిపోయిన బిరుదులు తిఱుగ వేసికొని గంగిరెద్దులాడినట్టులాడివచ్చును. మనబ్రతుకెప్పుడును గాలికెగురురావియాకులవంటిదే కదా! ఈభీమబలాఢ్యునాఁత చేసికొని మనము మిన్నంటి యాడియాడి యీతనియనంతరము గేవలము చేఁపలబుట్ట తిరిగి చేతికి వచ్చును. యిది చిరకాలమునుండి వచ్చు

మన్నయాచారము. నాకదే సరి. కులవృత్తి కేదియు సాటి గాదు, నవు మంత్రపుఁగల్మి యెంతయున్న నేమి కార్యము ?

మంత్రి—దేవతల యక్రమ మంతటితో సరిపోవ లేదు.

హిర—ఇంక నేమి చేయుచున్నారు ?

మంత్రి—ఏమి చేసినను జేయఁగలరు.

హిర—ఇటుపై మనజోలి కెంతమాత్రమును రానోపరు.

మంత్రి—కడచిన దంతయు మఱచినచో నట్లే యుండును. శక్రాదిదేవతలు మన పైఁగత్తులు నూఱినూఱి యలసి పోయిరి. యిటుపై నూఱుకొన్నను నూఱు కొనవచ్చును.

హిర—అదియును నొకశ్రేయమే కదా ?

మంత్రి—(స్వగతము) ఓహూ ! యీతని నేరీతినైన యుద్ధసన్నద్ధుని జేసి దేవతలను రూ పడించి వేయవలయును. (ప్రకాశముగ) దేవా ! దానవుల కెంతపరాభవము రావలెనో యంతయు వచ్చి వేసినది ; కాని పేరు చెప్పినంతమాత్రమున భువనత్రయము లల్లలాడుదానవభర్తకుఁ గూడ సేగి వచ్చినందుకు వగచుచున్నాను.

విదూ—దానవరాజసింహునకే తలవంపులా !

మంత్రి—కాదా ?

చ. తప మొనరింపఁగాఁ దలఁచి ♦ తద్దయు నీవు హిమాద్రిచెంగటన్
జపసర మూని త్రిప్పుచును ♦ జాహ్నవినీరము ద్రావునాఁడు ని
ష్కపటముతోడ నింటను వి ♦ చారమతిన్ గృశియించుదేవినే
యపహరణం బొనర్చి రసు ♦ రారులు గర్భిణిగా నెఱింగియున్.

హిర—నాయెడల భయంబుఁ దక్కి దేవత లెంతద్రోహ మాచరించిరి.

మంత్రి— అప్పు డాపట్టపుదేవి గర్భమునం దున్నబాలప్రహ్లాదుని భిన్నముసేయు టకుఁ గూడఁ గడంగి రఁట.

విదూ—వానివజ్రధార యిట్టి వెన్నిశిశుహత్యలను జేసినదో.

హిర—అది మహానుభావుఁ డైననారదముని వారించెను గదా ?

విదూ—లేకున్న నేమి కావలసినది ?

మంత్రి—అప్పటి వానిహితోపదేశములును మనరాక్షసపక్షపాతముగనే యున్నవి. చూడుఁడు.

"ఉ. నిర్భర యైనగర్భిణిని • నేర మెఱుంగనిసాధ్వి నీగతిన్
స్వర్భువనాధిపుండు జెరఁ • బట్టుట విన్నను దైత్యనాథుఁడున్
దుర్భర మైనకోపమునఁ • దూఁగి భవత్సురలోకకామినీ
గర్భము లొల్చి ప్రేవులను • గట్టినయుయ్యల లూఁగకుండు నే."

విదూ—బలే నారదా ! మాదానవలోకమును పునరుజ్జీవింపఁజేసినట్లు మాటాడితివి. అప్పుడు నే నున్నచో దేవిగారితో చెప్పి వేయిన్నూటపదారు లిప్పించి యుందును.

హిర—అప్పు డాదేవేంద్రహతకుఁ డేమని బదులు పలికెను?

మంత్రి—ఇస్సిరో ! (యనినిట్టూర్పులు నిగుడించి నోట మాటరాక తుట్టతుదకు)

తే. గీ. రాక్షసులు మమ్ము హింసించి • రవఁ జేసి
గిరులఁబట్టించు టీ వెఱిం • గినది గాదె
అట్టి యగచాటు లిఁకమీదఁ • బుట్టకుండ
నీమె గర్భస్థశిశుఁ జంప • నెంచి నాఁడ.

అని బదులు చెప్పెనఁట.

విదూ—అహా ! ఏమి సమాధానము. దూడగడ్డికొఱకై కొబ్బరిచెట్టెక్కి తిన్ననట్టు లెంతచక్కఁగాఁ జెప్పినాఁడు.

హిర—అవురా ! దుర్మతీ ! గోత్రవిధ్వంసకా !

చ. సుదతుల నోరెఱుంగని ని ♦ సుంగుల జంపుట రాచపాడి గా
దుదితనిశాతఖడ్గముల ♦ నూని రణంబున నీల్గమానులన్
సదమదలీల గెల్చుటయె ♦ బాలక నోడుటొ కీర్తిగాని చూ
లిది నెల లన్నినిండినది ♦ లీల ; పరాంగన నంటఁ బాడియే.

మంత్రి—నాఁడు నారదుఁడును నిట్లే లెస్సగ చెప్పి యున్నాఁడు.

"చ. పురమున లేఁడు రాక్షసవి ♦ భుండు దపం బొనరింపఁ గాననాం
తరముల కేగె వానికను ♦ దమ్ములఁ గప్పి రణాన కెట్లు నీ
వరిగితివో తదీయవన ♦ జాస్యను నేగతిఁ దెచ్చినాఁడవో
యెఱుఁగవొ నీతి నీపడఁతి ♦ నే యిటు జేసిన నేమనందువో"

అనిననప్పు డాగిరిభేది తలవాంచెనట. నారదుఁ డలుకతో లీలావతీదేవిని విడిపించి వెండియు నిట్లనియెను.

క. వనితల కొఱకో ధరణీ
ధనములకొఱకో విరోధ ♦ దావానలముల్
జనియించు నయ్యవే కుల
వనములుఁ దెగమాడ్చు గోత్ర ♦ భంజన వింటే.

హిర—అని నాఁడే వివరించెనా?

మంత్రి— మునులు సర్వజ్ఞులు.

హిర— అయిన నాసురలోకవినాశన మమోఘమేనా?

మంత్రి—అశ్లీల ముపశమించును గాక.

విదూ—అది యెట్లు. మనకు గ్రాంధికభాష యెప్పుడు వచ్చినదో అప్పుడే అశ్లీలములా ! ప్రాసములా ! సంధులా ! యతులా ! అన్నియనర్థములు వచ్చి పడినవి. హాయిగా గ్రామ్యభాషయే యుచ్చరించిన నీయశ్లీలోపశ మనము లెందుకు? ఈగౌణవేదపారాయణ మెందుకు? "అయితే ఆసుర

లోకవినాశనము అమోఘమేనా ?" అంటే సరిపోదా అయినా నాసురలోక వినాశన మనగానే కంఠము పట్టుకొన్నది. చంకన్ + ఆకు = చంకనాకు అనిన ట్లైనది. కావున పాతతెలుఁగు తీసి క్రొత్తతెలుఁగు పాఠశాలల యందుఁ జెప్పింప వలయును. క్రొత్తతెలుఁగులోఁ గూడ నొకింత క్రొత్త యుండవలయును గాన క్రొత్తకు కొత్తయని తెలుఁగునకు తెగులని మార్చి యొకవ్యాకరణము వ్రాయవలయును. దానికి కాటమరాజుకథలు గొల్ల సుద్దులే ప్రమాణములు. రెండవది కూచిపూడి భాగవతము.

మంత్రి—దేవా ! దానవవైరులవినాసన మవశ్య మగునుగాక !

విదూ—అశ్లీల ముపశమించును గాక.

మంత్రి—ఏమి యశ్లీలము.

విదూ—ఏమని మఱల నడిగెదవా ? ఇప్పుడు నీ వేమంటివి ? దానవవైరుల వినాశనము అవశ్యముఅగును గాక అని గదా. మనకు వశ్యముగాకున్న వారలకే జయమని గదా ! భావము.

మంత్రి—మహారాజునకు సర్వదా జయమే సంధిల్లును గాక.

విదూ—మానోములు ఫలించును గాక.

మంత్రి—మహారాజా ! బృందారకులఁ దలంచినప్పు డెల్ల నాయొడలు భగ్గున మండిపోవు చుండును. ఇట్టిదాయాదు లీరేడులోకంబులం దెందును గలుగఁ బోవరు. మొదటినుండియు మమ్మనేక మోసములపాలు సేసిరి.

చ. అమరులు దానవుల్ కలిసి ♦ యద్రిని గవ్వము గట్టి వేడ్కతో
నమృతము దీసి నప్పుడుభ ♦ యార్థము లీయక మాయఁ జేసి య
క్రమ మొనరించి రాసురలు ♦ కాసయినన్ విడరైరి మాకు మా
శ్రమము వృథాభరం బగుచు ♦ జాఱెను వంధ్యకుఁ జూలుకైవడిన్.

విదూ—తే. గీ. అమృతమే కాదు మనరాజ్య ♦ మపహరింపఁ
గడఁగి చనుదెంచి యసురరా ♦ ట్కాంత యనక
దొంగిలించిరి చాలదే ♦ ద్రోహ మింక
శాంత మేటికిదై త్యేశ ! ♦ శక్రుపైని.

హార—శాంతింపక చేయున దేమున్నది ? ఏదేని యొకవిష యుండవలయును గదా !

మంత్రి—ఏమి ! శక్రాదిదేవతల నుక్కడింపుటకు హేతువులే లేవా !

సీ. అనుఁగుతమ్ముడు హిర ♦ ణ్యాక్షుని నోడింపఁ, జాలక మాయతోఁ ♦ జంపునాఁడు
హిమవన్నగంబున ♦ కీ వేగి నపుడు నీ, తరుణీమణిన్ గొని ♦ యరుగునాఁడు
నీ వొనర్చినతపం ♦ బేరీతినై నను, విఘ్నంబు గల్పింప ♦ వెదకునాఁడు
మృతజీవనీమంత్ర ♦ వితతిఁ గైకొన వచ్చి, దేవయానను( బడఁ దిట్టునాఁడు

కడలిఁ బుట్టినయమృతంబు ♦ గల్పకంబు
గోవు శ్రీదేవి యశ్వమై ♦ రావతంబు
లందు సగపాలు బెట్టక ♦ న్యాయముగను
గొనిననాఁ డైనఁ గలహకా ♦ రణము లేది ?

సామంతరాజులు—అయ్యో ! మే మెంతనిర్భాగ్యుల మైపోయితిమి. అక్షీణకౌక్షేయ గదాదండ మండితకరకమలుండు ఉద్దండరిపుశుండాల కాండంబుల ఖండింపగలదండి వీరుండు రాక్షసక్షోణీతలాధీశ్వరుండు, జ్యోతిష్మతీపుర వరమహాసింహాసనాధిరూఢుండు మేటిమగలకు మగఁడై త్రిజగంబుల నట్టిటు నూఁగులాడింపఁ గల యీమహారాజునకు దేవతలన్న నెంత జంకుగా నున్నది. అయ్యో పౌరులారా ! రాక్షసవీరులారా ! హతాశ లైరిగదా ! మీరక్తనాళములయందుఁ బవిత్రమగు పౌరుషరుధిరము సమసిపోయెనా !

(దౌవారికుఁడు ప్రవేశించి)

దేవా ! పౌరులు వచ్చి హజారమున వేచి యున్నారు.

హిర—సత్వరము రావింపుము.

దౌవా—చిత్తము (అని నిష్క్రమించును.)

పౌరులు—(ప్రవేశించి) దేవా ! దానవకులముఖ్యా !

ఉ. ఎప్పుడు మంచుకొండదరి ♦ కేగి తపం బొనరింప నెంచితో
యప్పటినుండి మాకుఁ గడు ♦ పారఁగ మానవమాంస మబ్బలే
దెప్పుడు రక్తసిక్తమగు ♦ నెల్లునికూడు లభించ లేదు మా
కుప్పుడుఁ బత్రిలేకిటుల ♦ నుంటిమి త్రుప్పడుకత్తులట్టులన్.

విదూ—అగును. పాపము రాజకీయవిషయములయందు గవులగంటములుఁగూడ నిట్లేతుప్పడి పోవుచున్నవి.

ద్వి. పౌ.—దేవా ! నామొఱ్ఱాలకింపుము.

ఉ. వేఁపలు నత్త లాఁకటను ♦ చేతులఁ దెచ్చియు విక్రయించి యీ
కాపుర మెంతకాల మిటు ♦ కష్టముతో జరిగింతు మయ్య మా
పాప మదేమొ దేవతలు ♦ భద్రముగా నమృతమంబుఁ గ్రోలి స్వ
ర్గోపరిసౌధవీథికల ♦ నుందురు దుఃఖ మెఱుంగ కింతయున్.

విదూ—దేవతలకు దుఃఖమా ! భార్యపోయిన దనియా ! రాజ్యముపోయిన దనియా ! సహస్రాక్షుఁడు అహల్యాజారుఁడు వానికేమి.

తృ. పౌ.—దేవా ! మాబ్రతుకులపై మఱి నీళ్లు వదలుకొన వలయునా?

శా. దేశం బింతయుఁ బండలే దలిగియే ♦ దేశంబుఁ బోఁపోయినన్
గోశాధ్యక్షులు పన్నుగొందు రిఁక మా ♦ కున్ దైన్యమున్ క్షామ మా
వేశించెఁ మఱి యాలుబిడ్డలగతిన్ ♦ వీక్షింప జీవించుటే
యాశల్ చాలవు నూతిలోఁ బడుదుమ ♦ న్నా వీరు లే దక్కటా !

విదూ—నీరులేకున్న ఊరిలేదా ! అన్నము లేకున్న సున్నముతినేది.

చ. పౌ.—ఓప్రభువర్యా ! ఇంక మా కేమిగత్యంతరము?

ఉ. చేలను నీరు లేదకట • చిన్కు చిటుక్కున రాల లేదు మా
నేల పగుళ్లు దీర్చె మన • నేరము ; పంటలు లేవు కూటికిన్
జాలఁగఁ గష్టమయ్యె నిఁకఁ • జావునకున్ గడువాచియుంటిమో
పాలక యెట్లు గాఁచెదవొ • ప్రార్థితులన్ మము పంటకాపులన్.

హిర—ఓపౌరులారా ! ఊరడిల్లుఁ డూరడిల్లుఁడు.

విదూ—ఊరడిల్ల కేమి సేయుదురు? అఱచి యఱచి వారలే లేచి పోయెదరు. ఇదియొక కడుపుమంట. పేదముండాకొడుకుల మొఱ్ఱలెవ రాలింతురు. వారెక్కడకు పోయినను దఫడవాయింపులు చీవాట్లు తప్ప మఱి యే మున్నది.

హిర—అయ్యయ్యో ఇంతగా వీరల కీసంతాప మేలవాటిల్లినది?

విదూ—ప్రభువులపాలనము సరిగా నేకున్నచో ప్రజలకు సంతాపము గాక సంతోషములు వచ్చునా ?

హిర—ఏమీ ! నాపాలన మంత నిందనీయముగ నున్నదా !

మంత్రి—నే నెట్లు చెప్పఁగలను. ప్రజ లట్లు ఘోషింపు చున్నారు.

హిర—అది యేమి ?

మంత్రి—కాటకమునకు సహింపక.

హిర—ఏల మనదేశము పండ లేదు ?

మంత్రి— పంటకు వలయునుపకరణము లన్నియు దేవతలచేతియందే యున్నవి. ఇంక మన కెట్లు సుభిక్షము వచ్చును?

తే. గీ. వనదనాథుఁ డింద్రుఁడు గాన • వర్ష మిడఁడు ;
యోషధీశుఁడు శశిగాన • నుమియఁ డిచట ;
సస్యములు పండు టెట్లు మా • క్షామబాధ
సమయు టెట్లు దైత్యులు దివిఁ • జనెడు దాఁక.

హార—అందుల కేమి సేయఁ గలము?

విదూ—ఇంక కర్తవ్యమే లేదా! దండనీతి మొదలంట సమసియే పోయినదా! కత్తులు కూలఁబడయోనా? పౌరుషము మొక్కవోయినదా? ఇంకయరాజ్యకమే శరణ్యమా? ఆహా! యెంత విపరీతము.

తే. గీ. ఇంద్రియంబుల నరికట్టి • వీక్షణములఁ
బైకి నిగుడించి యోంకార • పదవికొలఁకుఁ
దప మొనర్చిననాఁటిశాం • తంబు వీడ
వింక రాక్షసపీఠ మ • లంకరించి.

హార—శాంతము వీడి చేయున దేమున్నది?

మంత్రి—కావుననే మాయవస్థ లిట్లు వచ్చినవి.

సీ. మణులు మాణిక్యంపు • గనులు వారిని నేల, గనరాని మసిబొగ్గు • గనులు మావి
ఘన మైనయమృతభో • జనము వారిది పట్టి, నత్తగుల్లలు భోజ • నములు మాకుఁ
గామధేనువు కల్ప • కంబును వారివి, గొఱియలు సురతరు • కులము మాది
కనకవర్షము గురి • యును వారి కనిశంబు, నెఱిమంచుగడ్డలు • గురియు మాకు

తే. గీ. స్వర్గలోకంబు వారిని • వాసభూమి
సతతదుఃఖలోకము నివా • సంబు మాకు
సురలు వారలు మేము నా • సురల మగుట
వారికిని మాకుఁ గొండంత • వార కలదు.

హార—సచివాగ్రణి! నీవన్నది వాస్తవము. నా కిప్పుడు కొండంత యాగ్రహ ముదయింపినది. కాని యేమికార్యము?

చ. సురలను దచ్ఛమాపతులఁ • జూచినవారల నెల్లఁ బట్టి సం
హరణ మొనర్తు మన్న నమ్మ • తాశను లౌటను జావు లేదు ఘో
ర రణవసుంధరన్ నిలిచి • రమ్మని పిల్చిన రారు వారి నే
కరణి జయింపఁగావలెన • కారణపుంగలహంబు గోరుచున్.

విదూ—సరే! దాని కెవ రేమిసేయఁ జాలుదురు? ఇదివఱకు రాక్షసు లన్న ముజ్జగంబులు కంపించుచుండెడివి. నేఁ డావిగి క్రమముగాఁ జాఱినది కాఁబోలును. స్త్రీలకు యౌవనము క్రమముగా దిగజాఱును. చంద్రునిధవళ కిరణములు గోడలనుండి యదేతీరున దిగిపోవుచుండును. ఆదరణము లేని కవిబ్రతుకును దినదిన క్షీణతను బొందును. ప్రకృతిని నెవ్వ రడ్డఁ గలరు?

సీ. మహిషాసురుం డన్న ♦ మాత్రానఁ ద్రిజగంబు, లొక్కపెట్టునఁ గూలి ♦ ప్రక్కలగును
సోమకాసురుఁ డన్న ♦ సొలసి బ్రహ్మాదులు, తలక్రిందులై పడి ♦ తలఁగు చుంద్రు
శంబరాసురుఁ డన్న ♦ సప్తాబ్ధు లోకమారె, యింకు దిగ్దంతులు ♦ గ్రుంగిపోవుఁ
ద్రిపురాసురుం డన్న ♦ నిపుడైన రవిచంద్ర, తారకల్ తెగి రాలు ♦ ధరణిపైని

నకట ! నీతమ్ముఁ డగుహిర ♦ ణ్యాక్షుపాటి
వాఁడ వైతివి కావెనీ ♦ తోడ నింక
రాక్షసకులంబు నశియించు ♦ రవ్వ యేల
రిపులకు సుఖంబు జయము వ ♦ ర్ధిలును గాక.

హిర—(అగ్రహముతో) ఏమేమి ! నేఁ డెట్టియమంగళము లీచె వింబడుచున్నవి. అక్కటా ! ఈహిరణ్యకశ్యపమహారాజుతోఁ దుదకు దానవకులము పౌరుష విహీనమైయపకీర్తిశేషమై వినాశనమై పోవును గా !

మంత్రి—(స్వగతమున) ఇంతసేపటి కీతని కమరవిద్వేషమహాగ్ని ప్రజ్వరిల్లినది ఇందుపైమఱి రెండుసమిధలు వేయవలయును. (ప్రకాశముగ) ముందు ప్రజలు తిండి లేకయే మాడిపోవుచున్నారు గదా ! అందు కేమి కర్తవ్యము?

హిర—భయము లేదు. షష్ఠోపవాసదీక్షాధురంధరుండనై వీక్షణంబులు పైకి నిగుడించి యొంటికాలుపై నిలిచి వేయేండ్లు హిమవన్నగగంగాస్రవంతికాప్రాంత కాంతారసీమల నొనర్చినతపోధన మంతయు వృథయైపోవునా? అది

యంతయు దానవద్వేషుల రూపుమాపుటకుఁ గాదా చేసియుంటిని ! యొక్క త్రుటిలో వారందఱను హతమార్చి వచ్చెదను.

మంత్రి—ఇప్పుడు మన మొకవేళ దేవతలపై దండెత్తిపోయినను కార్యము లేదు. వారు కడుబలవంతులై వలయునన్ని యుద్ధోపకరణములఁ గూర్చి యెదురు లేని వీరులంబలె విఱ్ఱవీఁగు చున్నవారు. అట్టిపోటుమానిసులను మన మెట్లు జయింపఁగలము ? ఎట్టు లీవిజయధ్వజ మాయమరావతీపురపుఁగోటబురుజులపై నాటఁ గలము. ఇదియెంతయు దుర్ఘటమైనకార్యముగా నున్నది బలాబలములు లెక్కింపకవైరులపై వెడల రాదు.

హిర—ఓమంత్రిపుంగవా ! అస్మత్పరాక్రమమహోజ్వలనజ్వాలావిలాసంబులు సమరక్షోణిని వీక్షింప నీ కాసక్తిఁబొడమినట్టు లున్నది. సరే ! అచిరకాలమున నీక్షించెదవు గాక.

చ. ఇనుఁ డుదయించునే పవన ♦ మిట్లురుడెంచునె యగ్నిరాజునే
వనధిఁ దరంగమాలికలు ♦ వచ్చునె సోముఁడు వేడ్క నూపునే
దినములు రేలు పోయి దశ ♦ దిక్కులు నొక్కటి కావి మిన్నుమ
న్నని నియమింపఁగాఁ గలరె ♦ యాయుధ మేను ధరించి పోరినన్.

విదూ—తథాస్తు.

మంత్రి—ఓరాక్షసవీరులారా ! పౌరులారా ! హిరణ్యకశ్యపమహారాజు దేవలోకముపై దానవాచారప్రకారము దండు వెడలుచున్నాఁ డని దేశమంతయుఁ బ్రకటించి రండు.

పౌరు—మహాభాగ్యము. మహాభాగ్యము. మాకుఁ గావలసినవరమే యది.

హిర—అవల మీరలు యథేచ్ఛముగా సంచరింప వచ్చును.

సీ. అడవిలో లేళ్ల వేఁ ♦ టాడెడుకై వడి, సురనారులను బట్టి ♦ చూఱ గొనుఁడు
ఎరవేసి చేఁపల ♦ దరిని లాగినరీతి, నమృతభాండంబును ♦ నాఁచి కొనుఁడు
కొంగలు త్రొక్కిన ♦ కోనేటికై వడి, మానసపరమును ♦ మట్టి రండు
అమరావతీపుర ♦ మగ్నికి నర్పించి, దేవవేశ్యల మాకుఁ ♦ దెచ్చి యిడుఁడు

కామగవి కోసికొని కల్ప • కంబు ద్రుంచి
కాల్చి పీయూషమున వ్రేల్చి • కలిపి తినుఁడు
హంసలను జంపి వంజుల • నారగించి
రండు మీ కింతహానియు • రాదు పొండు.

పౌర—(చంకలు కొట్టికొనుచు) జోహారు మహారాజా! జోహారు. నేఁటితో మా దరిద్రము వదిలి పోయినది. (అని నిష్క్రమింతురు.)

హిర—అమాత్యశేఖరా! సైన్యసన్నాహము సత్వరము సేయింపుము.

మంత్రి—ఇదివఱకే సంసిద్ధమై యున్నది.

హిర—సరే. సామంతనృపతులారా! మీరును నాతో దేవలోకమునకు దండు నడువుఁడు. మీభాగములు మీకును బంచి యివ్వఁబడును.

సామం—శిరసావహించి మఱి వచ్చుచున్నాము. మహారాజునకు జయ మగుఁగాక.

విదూ—లాభ మున్నప్పు డామాత్రమైన స్తోత్రము చేయ వలదా? బ్రతికి బాగుగ నున్న నేనును నొకరాయంచఁ దెచ్చికొనియెదను. గ్రుడ్లయినఁ బెట్టును.

మంత్రి—తొలుత దేవలోకపరివర్తన మెట్లున్నదో చారులఁ బంపి తెలికొనియావల మనము వెళ్లుట కర్తవ్యము.

విదూ—అగును.

తే. గీ. ఎదిరిబలము లెంత • యేపుతో నున్నవో
కనుగొను టది మంచి • పనియె కాదె
నూత దిగెడువాఁడు • లోఁతుఁ బరీక్షింప
గడను వేసి ముందుఁ • గాంచు నట్లు.

(తెర పడిపోవును.)

ఇది ప్రథమాంకము.

# దానవవధ.

## ద్వితీయాంకము.

రంగము—మనస్సరోవరము.

(రంభ, ఊర్వసి, మేనక, తిలోత్తమలు ప్రవేశించియుందురు.)

రంభ—భగినీ! యూర్వసీ

సీ. కామితార్థంబు లీ ♦ కామధేను వొసంగుఁ, గల్పకం బిచ్చు సం ♦ కల్పములను
మానసకాసార♦మానంద మొడఁగూర్చు, హంసలు చెలువంబు♦లడరఁ జేయు
తుంబురుండును నార♦దుఁడు పాడి మెప్పించు, శ్వసనుండు గుసుమవా♦సవలఁజల్లు
నలరుసుధాకరుఁ♦డమృతంబు గురియును, సౌధరాజములు వి♦శ్రాంతి నొసఁగు
మదనపరివారములతోడ ♦ మదనుతోడ
క్రీడ లాడవచ్చును బవల్ ♦ రేలు జెప్ప
వాల్పక జరామరత్వభా ♦ వంబుతోడ
లోపములు లేవుమా సుర ♦ లోకమునకు.

ఊర్వ—అది ముమ్మాటికిని నిజము. మన ముండుటచే నీస్వర్గమునకు మరింత వన్నె వచ్చినది.

రంభ—అగును.

తే. గీ. అందుకే కాదె మాపొందు ♦ లాశ్రయించి
సవనములు సేసి తపములు ♦ చాల సలిపి
వచ్చుచుందురు తెగి ముని ♦ ముచ్చు లంద
టినుపకచ్చల బిగిజాఱ ♦ మనము లూర.

మేన—అగును గాని నాసందేహ మొక్కటి గలదు.

తే. గీ. ఎన్నినా ళ్లున్న దివియందు ♦ నింతె మనకు
హాయిగా నిద్ర లేదు; వి ♦ హారగరిమ
లేదు; క్షుత్పిపాస లొకింత ♦ లేవు; సుఖము
దుఃఖములు నుండవలె నని ♦ దోఁచె నాకు.

ఏమనిన నిది స్వర్గలోకము దుఃఖములేని సుఖములన్నియు నున్నవని వేనోళ్ల భట్టులవలెఁ బొగడిరి కాని యిది యేమియు నాకాహ్లాదము దోఁపించుటలేదు. ఆఁకలిఁ గొనినవానికిఁ గాని యన్నము రుచింపదు. నిద్ర లేకున్నఁగాని నిద్ర సహింపదు. దరిద్రునకుఁ గాని ధనాభిలాష ముండదు. అట్లే దుఃఖితులకుఁ గానిసుఖ మెఱుంగ రాదు. కావున సర్వదా తెప్పవాల్పక యనుభవించెడి యీసుఖము కేవలము దుఃఖప్రాయము. రోగపీడితుఁడు గానివాఁడు దినమంతయు లేవక పరుపుపై నిద్రించెనేని వాని కాపరుపే పీడవలెఁ దోఁచును, మన మమృతాశనుల మనుసంబరమే కాని, అజీర్తిరోగి కెంతసుఖమో యిదియును నంతటిదే కావున చెలులారా ! ఈకామధేను వెందుకు? ఈకల్పవృక్ష మెందుకు? మీ కేమి కోరిక లున్నవి? కోరికలను గదా యివి యీడేర్చును. ఏయవస్థలు లేని మన కీవైభవము లెందుకు? ఈవినోదము లెందుకు? అవసరము నుపయోగములేనికలిమి పెండ్లియాడిన వేపరావిచెట్టువలె నుండును.

తే. గీ. షండునకు సుందరాంగి పా ♦ షండునకుము
సిద్ధమగు వేదవాక్యంబు ♦ చెవిటివాని
యొద్ద శంఖ మయ్యంధుని ♦ కద్ద మట్టు
లమరపుర మేల నిష్కాము ♦ లైనమనకు.

తిలోత్త—అక్కా ! మేనక ! నీ వన్నది వాస్తవమే !

తే. గీ. మిసిమిబంగారురేవడి ♦ యిసుక మనకు
మణులు పేర్చి కట్టినసౌధ ♦ గణము మనది
వాడి నేలరాలనిపూల ♦ వనము మనకు
దుఃఖములు లేనిసుఖ మేమి ♦ తోఁచు నిచట

మఱియు,

తే. గీ. రేలు రాఁబోవు ; నిద్రింప ♦ తెప్పపడదు ;
తినుట కరుగఁబో దమృతంబు ♦ స్థిరసుఖంబు
లున్నదుఃఖంబె ; యవి యివి ♦ యున్నఁ గాని
విషక్రిములరీతి మనము జీ ♦ వింపవలసె.

రంభ—చెలులారా! మీచరిత్రములు కడు విచిత్రములుగ నున్నవి. మీ కీవి పరీతబుద్ధు లెట్లు బుట్టినవి?

తే. గీ. లోకమంతయు మనస్వర్గ ♦ లోకమునకు
నభిలషింతురు సుఖదుఃఖ ♦ మైనలోక
మునకు నాశించుచుంటిమి ♦ మనము భళిరె!
భాగ్యవంతులు లేమికై ♦ వగచు నట్లు.

ఊర్వ—అనుభవములేని వీరలకు దుఃఖమయలోకములు కడు నపేక్షింపఁబడు చున్నవి. అం దెన్నికష్టము లున్నవో యెఱుంగుదురా!

చ. కలిమికిఁ జింత; లేమికి వ ♦ గ ల్పడుచింత; నిశల్ పవళ్లు నాఁ
కలికిని జింత; రోగములు ♦ గల్గినఁ జింత; సుఖానుభూతితన్
వలవనిచింత; పెమ్మిదిమి ♦ వచ్చినఁ జింత; హృదంతరాళముల్
కలచుచునుండ మీ రపుడు ♦ గాంచి తపింతురు స్వర్గలక్ష్మికై.

మఱియు,

తే. గీ. సౌఖ్య మాశించి పాపంబు ♦ సలుపవలసి
వచ్చు; దాన నరకము సం ♦ ప్రాప్త మగును.
కడ కధోగతి వచ్చు నీ ♦ కరణిఁ దలఁపఁ
జెడుగుఁగోరుట భాగ్యంబు ♦ లుడుగుకొఱకె.

రంభ—కాదా! ఎన్నఁడైన నిట్టివిపరీతములు వింటిమా!

ఆ. గీ. నిరుపమాన మైన ♦ నిత్యకల్యాణముల్
పచ్చతోరణములఁ ♦ బరఁగునట్టి
పూని సిరులు రాఁగ ♦ మోకాల నొడ్డెడు
వారి నింక దివము ♦ పట్టఁ గలదె?

మేన—ఈమాత్రపునీతులు మాకుఁ దెలియక పోలేదు. మనయదృష్టమున భాగ్యమే వ్రాసిపెట్టినయెడల నాసిరి. మోకాలే కాదు, మోచేయి యడ్డుపెట్టినను రాక

మానదు. దురదృష్టవంతులకు సిరి యున్నను దరిద్రమే.

తిలో—అట్టివా రెందఱు లేరు.

తే. గీ. ఉన్నఁ దినలేరు తొడుగుట • కొప్పరింత
యివ్వ రిప్పించ రొరుఁ జూచి • యేడ్చువార
లెంద ఱున్నారు వారియ • దృష్ట మెల్ల
బూడిదను బోయుపన్నీరు • వోలెఁ బొలియు.

మేన—కావున మే మెక్కడ నున్నను నదృష్టవంతుల మైనయెడల సౌఖ్యములే కాని దుఃఖములు రానేరవని నేను లెస్సగ నెఱుంగుదును.

తిలో—నాయభిప్రాయము నదే.

ఊర్వ—అవును. నీవెక్కడ నున్నను సానివై సంపాదింతువు. కులటవై కూడఁ బెట్టుదువు. స్వైరిణివై జీవింతువు. జారిణివై సుఖి యింతువు. వేశ్యవై విఱ్ఱవీఁగుదువు. పణ్యస్త్రీవై పాలింతువు. నీదేహము చల్లగానుండినఁ జాలును.

మేన—నారాయణునితొడయందుఁ బుట్టితి నని విక్రమునిపడపుఁజెలి నని నా కింకను బిరుదులు రాలేదు. వచ్చిననీ వట్లుచేసిన బాగుగ నుండును.

రంభ—నీకేమిసిగ్గు లేదా?

మేన—నా కెట్లు లుండును? జన్నములు చేసి వచ్చినవారినిఁ గౌంగిటఁ జేర్చి కామాగ్ని రవిలించి నరకావాసమున కంపునపుడు నీ కుండును.

రంభ—అవును. నీవు విశ్వామిత్రుని యిల్లాలవు. దుష్యంతుని యత్తవు. శకుంతల తల్లివి. కౌసికుల కోడలవు. ఆహా! మావంటివేశ్య లంద ఱిల్లాం డ్రగు చున్నారు.

ఊర్వ—ఆహా! ఏమి కాలము. నీచులందఱ కాధిక్యము వచ్చు చున్నది కాఁబోలును.

రంభ—అధికులకు నీచత్వము గూడ వచ్చు చున్నది.

క. వెలకాంత లిపుడు సాధ్వుల
వలె వైధవ్యంబునను బ్ర • వర్తించెద రా
కులకాంతలు రెండవపెం
డిలియాడి వినోదముల న • టింతురు వీకన్.

తిలో—దాని కేమికాని చెలులారా! ఇప్పట్టున మనకు విరోధులై నదానవులు వచ్చి యీస్వర్గలోకమును దోఁచుకొని మనలనందఱను జెరబట్టిన మన మేమి సేయఁగలము?

మేన—ఆహా! ఎంతమంచిసంగతి నడిగితివె! ఇట్టి నీతెలివికి సంతోషించి బుగ్గలు నులిమి రెండుచీవాట్లు పెట్టి తలపై రెండు వడ్డించి నీపురుకట్ట చేతి కిచ్చి చింపిచేఁటలతో నూరేగించిన బాగుగ నుండునె!

(తెరలోఁ గలకలము.)

రంభ—అయ్యో! అవి యేమి ధ్వనులు. (అంత నొకరిపై నొకరు పడి సురగణము పారిపోవుచు)

ఇటు ఇటు, అని వారలకు దారిచూపి "అక్షీణకౌక్షేయపాణు లైనరాక్షసు లదే చుట్టుముట్టు చున్నారు." (అనియొక డఱచుచుఁ బోవుచున్నాఁడు.)

ఊర్వ—ఇం కెయ్యది శరణ్యము? మేనకా వీరంద ఱెవరే?

మేన—(నిశ్చలయై) ఎవరో గాని కారుమబ్బులవంటి దేహచ్ఛాయలు మెఱపుల వంటి చంద్రహాసములు గాంచిననాకన్నులు మిఱుమిట్లు గొలుపు చున్నవి. (తనలో) వీరలే యుద్ధరంగములయందు వీరశయనమును గన్నమహనీయులు గాఁబోలును.

రంభ—ఈదీర్ఘకాయు లిట్లేల వచ్చిరే? (అని కంపించును.)

మేనక—అట్లేలకంపించెదవు? నీకొఱకే వచ్చి రేమో! దూతికల నంపి తెలిసి కొనుము.

రంభ—ఎందుకు? వా రెవ్వరు?

తిలో—ఎవరా! విటులో! నటులో?

మేన—లేక సోమయాజులో !

రంభ—ఛీ! యూరకొనుము.

తిలో—అంతమాత్రమునఁ బోవునా! వీరిసంగతి నీకింకను దెలియ కున్నది. స్వచ్ఛమగుసోమయాజులు. పలుపురకు ప్రాతసోమిదమ్మ వగునీకొఱకే యారడి పడుచున్నారు. వేగము పోయి యూరడింపుము.

మేన—నీ కెంత మంది యున్నారే.

తిలో—అందుచేతనే రంభ అంటే రోలంత పొంగెదవు.

(తెరలో)

శా. మార్గంబుల్ బిగియించినా రకట ! యే ♦ మార్గంబు పోఁబోవదు
ర్మార్గుల్ దైత్యులు మూఁగి యుండి రదిగో ! ♦ మమ్మింకఁ గాపాడ నే
భర్గుం డిచ్చటి కేట్లు రాగలుగు మా ♦ పాల్గెంచఁగావచ్చునే
స్వర్గానర్గళసౌఖ్య మొక్కత్రుటిలో ♦ వమ్మయ్యె బృందారకుల్.

మేన—(నలువంకలఁ జూచి) ఆ! ఏమి! దైత్యులు నిజముగా వచ్చిరా!

రంభ—దుశ్శకునపక్షులవలె దైత్యులు వచ్చుటకు మీరలే కోరుకొంటిరి గదా! మఱివగవ నేల? యనుభవింపుఁడు.

తిలో—తుదకు వమ్ములే నిజమ్ము లైనవి.

రంభ—నీమాట వరహాలమూట బోటు పోవునా?

ఊర్వ—మీ కేమి చింత ! ఏడ్చుదానిమగఁడు వచ్చిన నామగఁడును వచ్చునన్నట్లు మీకానందమే. మధ్యను మేము దుఃఖములపాలు కావలసి వచ్చినది.

(అంత గంధ, గజగంధులను రాక్షసులు కేకలు వేయుచుఁ బ్రవేశింతురు.)

రంభ—ఆహా! పుట్టి మునిఁగినది. (అని అందఱును మూలమూలల దాఁగుదురు.)

గంధ—ఓరీ ! గజగంధా ! ఆటపాటలచే నాటకము లాడుచున్న యాపాటలగంధు లేచ్చోటికిఁ బోయినారురా?

గజ—అన్నా ! గంధాసురా ! ఱెక్కలు కట్టుకొనిపై కెగిరి యుందురు.

గంధ—అయిన నేను నెగిరి పట్టుకొందునా ? (అని యెగిరి నేలఁ గూలఁబడి) ఓరీ ! పైకెగుర లేదురా.

గజ—ఈ పూఁబోదలమాటునఁ జూడుము.

గంధ—అవు నదిగో ! కొండముచ్చులవలె నెట్లు డాఁగియున్నారో ! (అని చంకలు
కొట్టుకొని) ఓరీ ! అదే (అని చూపుచు)

సీ. జంభారిగంభీర ♦ దంభంబుతోడ సం, రంభించునట్టి యీ ♦ రంభ నాది

గజ—సౌందర్యసర్వల♦క్షణధుర్యచాతుర్య, వతి యగునట్టి యూ♦ర్వసియె నాది

గంధ—మాణిక్యమంజుల ♦ మాలికామంగళ, గళ యైనమేనకా ♦ గణిక నాది

గజ—లీలావినోదకే♦ళీలోలగుణజాల, తతమత్త యగుతిలో ♦ త్తమయె నాది

గంధ— మెఱుగునగ లాణిముత్యాల ♦ సరులతోడఁ
గురులు వ్రేలాడుసురనారి ♦ కులము నాది.

గజ— అప్సరలు సిద్ధగంధర్వ ♦ లాదిగలుగు
వనిత లందఱు నావంతు ♦ వారు వారు.

(అని కేకలు వేయుదురు.)

(దేవకన్యలు పాఱి పోవుదురు.)

గంధ—ఇస్సీ ! మనధాటి కాఁగలేక ఈదేవకన్య లేలాగు పాఱుచున్నారో చూడు

గజ—మనసంగతి యీగంజిమొగాల కేమి తెలియును?

గంధ—అటులైన వీర లేమి బాగుగ నున్నారురా !

తే. గీ. ఱెప్పవేయనికన్నులు ♦ రేలు నిదుర
లేక వెల్లఁబోయెడుముఖ ♦ లీలతోడ
వెల్లగోడఁ బోలెడి సుద్ద ♦ విగ్రహంబు
లంద మిది యేమి యెవరి కా ♦ నంద మిడును?

గజ—మఱి యెట్లుండవలయును ?

గంధ—ఎఱుఁగవా ?

తే. గీ. మసిని నిరసించునెమ్మోము ♦ నిసినిబోలు
నొడలు వల మైనపెదవులు ♦ నిడుదనోరు
తొడలు పల్చన రోలంత ♦ నడుము గలది
కన్నె విటులకుఁ గొంగుబం ♦ గారు గాదె ?

గజ—ఓరన్నా ! అక్కడేదో తినుచున్నారు. మనమును పాలుకూడుదము రారా!
(అని నిష్క్రమింతురు.)

(మఱికొందఱు రాక్షసులతో గార్గి గరళపాదుఁడు అను సేనాపతులు వచ్చెదరు.)

గార్గి—గరళపాదా ! నీకోరి కేమిటిరా?
గర—నీకోరిక చెప్పు—ము.
గార్గి—చెప్పా?
గర—చెప్పరా?

గార్గి—సీ. అమృతంబు వండి నే♦నంబలివలెఁ జాల, భక్షింతు నాకొన్న♦కుక్షినిండ
గర— కల్పవృక్షము ద్రుంచి♦కాల్చి బొగ్గులఁజేసి, యమ్మెదఁగంచర్ల♦కడ్డిగలకు
గార్గి— కామధేనువుఁ బట్టి♦కటికివారల కిచ్చి, పుష్టిఁజేయుంతుపూఁ♦బోడికిపుడు
గర— చింతామణిని గాల్చి ♦ చింతామణినివండి, వైద్యంబుజేతుమా♦వారికెల్ల
గార్గి— సరగ నైరావతంబు ను ♦ నుచ్చైశ్రవంబు
బండ్లకును గట్టి లాగింతు ♦ బాడిగలకు
గర— నూడిగము సేయ నుంతు నీ ♦ యూరియాడు
పడుచులను గొనిపోయి నా ♦ పడఁతికడను.

గార్గి—నీ కెంతాశ యున్నదిరా !

తే. గీ. లోకమున నున్నసతు లెల్ల ♦ నీకె వలయు
లోకమున నున్నధన మంత ♦ నీకె వలయు
నీయొకనికోర్కెఁ దీర్పఁగా ♦ నేర వెన్ని
జగములైనను గలరె నీ ♦ సాటివారు?

(తెరలో) ఓ రాక్షసులారా ! దోఁపిడి నిలుపుసేయుఁడు. దోఁపిడి నిలుపు సేయుఁడు !

దేవేంద్రుఁడు—(ప్రవేశించి) ఓరీ ! యెవరురా దోఁచుకొనుమేటిమగఁడు.

శా. ఔరా ! రాక్షసదుర్విదగ్ధమతులా ♦ రా ! జంకు నావంతలే
కీరీతిన్ వడి వేల్పువీటిపయి మీ ♦ రే వచ్చిరో ఘోరదు
ర్వారం బైనమదీయవజ్రశితధా ♦ రాపాతభిన్నోరుకం
ఠోరుస్థానము లూఁగులాడఁ గన మీ ♦ యుర్వీశుఁడే పంపెనో.

(రాక్షసులు వికావికలై పరువిడుచున్నారు)

దేవేం—ఓరాక్షసహతకులారా ! నిలువుఁడు ! నిలువుఁడు ! మీపీచ మణంచియే పంపుచున్నాఁడను. విహారార్థమై మేము వరుణపురంబునకుఁ బోన దొంగ చాటున నమరావతిని జొచ్చి యబలను జెఱఁబుట్టుటకు నుంకించితిరా ? ఓగీర్వాణులారా ! పౌరులారా ! భయపడకుఁడు ! భయపడకుఁడు !

తే. గీ. రాక్షసాధము లేమి మా ♦ రాజధాని
యేమి యిటవచ్చి దోఁచుట ♦ యేమి చిత్ర
మయ్యె నీలాటివిపరీత ♦ మాచరింపఁ
గలరె కులిశంబు వజ్రిచేఁ ♦ గ్రాలువఱకు.

(అంత తెరపడిపోవును)

ఇదిశుద్ధవిష్కంభము.



రంగము—అమరావతీపురపుఁగోట నంటియున్న యుద్ధభూమి.
(దేవేంద్రుఁడు, అగ్ని, యమ, వరుణు లాయుధపాణులై
ప్రవేశించి యుందురు.)

దేవేం—ఓ యమాగ్నివరుణులారా! మఱుల మనకు రాక్షససంక్షోభ మాపాదించి నది. మనజీవితకాల మంతయు వీరితోఁ బోరుటతోడనే కడచి పోవుచున్నది. అయ్యో ! ఈజగత్కంటకుల నాముక్కంటియైనను గడతేర్పఁడు గదా !

సీ. వరుణునికోటపై ♦ ధ్వజము పాతిరి కుబే, రునిధనంబును దోఁచు♦కొనఁ గఁజనిరి
ఖేచరావళని దో ♦ బూచులగొని పారి, రాకాశమార్గాన ♦ కడ్డు దూరి ;
గంధర్వపురములఁ ♦ గాల్చి మిన్నేటిలో, యానపాత్రలముంచి ♦ యరిగినారు
పంటలు మొదలంట♦పాడియావులఁ జంపి, భూజనంబుల బల్మిఁ♦బొడిచినారు ;

నేఁడు మనయమరావతిఁ ♦ గూడ గొనఁగ
వచ్చుచున్నారు రాక్షస ♦ వాహినీశు
లింక నోడుగెల్పులు సెప్ప ♦ నెవరితరము ?
పరమహితులార ! యష్టది ♦ క్పాలులార !

యమ—గోత్రభంజనా !

ఉ. జెచ్చవడంగ నేల నర ♦ రే ! మన కేమి భయంబు రాక్షసుల్
వచ్చిన వత్రగాక రిపు ♦ వర్గము లుండరె యెట్టివారి కం
దచ్చపుధర్మ మొక్కటె జ ♦ యం జొడఁగూర్చెడు నేయవస్థలం
దెచ్చటనైన దోర్బలము ♦ లే గెలుపొందిన నిల్వ నేర్చు నే.

వరు—ఇంత యేటికి ?

తే. గీ. రాక్షసులపోరుఁబడి ప్రాణ ♦ రక్షణార్థ
మెన్నినాళ్లిట్టు లగపాటు ♦ లున్నవొక్కొ !
ఆత్మదేశముల్ విడిచి స ♦ న్న్యాసవృత్తిఁ
బోవుదము రండు మన కేమి ♦ పోరితంబు.

అగ్ని—అగును. నీవు నీదేశమును బోఁగొట్టుకొంటివి గావున నీ కది సము చితముగ నున్నది. అయ్యో !

ఉ. అంచిత మైనశౌర్య మడు • గంట వచించితి వెంతమాట యో
చించితినే వ్రపంచములు • క్షీణతఁ గాంచనె జారచోరరా
త్రించరదుర్న యాధములఁ • దీవ్రమతిన్ విదళింప కున్న రా
జంచును నూరకే బిరుదు • లందుటకా ప్రజ నేలకుండఁగన్.

కావున నీవ్యుక్కటిరక్కసులను దెగటార్చి జగంబులకు క్షేమంబు గూర్ప వలయును.

యము—అందుకు మన మందఱము సంసిద్ధులమై యున్నారము గదా !

భటుఁడు—(ప్రవేశించి) ఓ బృందారకేంద్రా ! హిరణ్యకశిపుఁడు దండెత్తి వచ్చిచ మూసమూహములతో నూరిబయల విడియుచున్నాఁడు. పరిఘలచుట్టు న క్తంచరులు మూఁగి పురములోనికిఁ జొరిబి వచ్చుటకు వేలీలల నుపాయంబులు పన్నుచున్నారు. వరుసగాఁ జేర్చినశతఘ్నులు వివిధాస్త్ర శస్త్రధారులై నభటులచేఁ బరివేష్టింపఁబడి మనకోట నొక్కసారిగఁ గూలఁ ద్రోయు యంత్రము లమర్పఁబడుచున్నవి. అవి చూచుటకు భయంకరమును, వినోదముగ నుండి యద్భుతకల్పనాపాండిత్యమును బ్రకటింపుచున్నవి ఇప్పటికిఁ బదివేల కుంజరంబులు, పదియారులక్షల తురంగంబులు, పదు నొకండుకోట్ల కాల్బలము వచ్చి యున్నవి. ఇంకను రాక్షసరాజుతో నెంద ఱున్నారో ! వానిజాడలు పొడనూప లేదు. యుద్ధపుభేరి భయంకరముగ మ్రోయుచున్నది. వైరుల కేతుపటములు పొడవుగా నెత్తఁబడి గాలి కల్లలాడుచు జయాపజయంబులు నిరూపింపలేని మానసములవలె ఖిన్నము లగుచున్నవి. ఏనుఁగుల ఘీంకారంబులు, గుఱ్ఱముల హేషారవంబులు, పదాతుల జయజయధ్వానములు, ప్రళయ కాలమేఘగర్జారవంబులను బ్రతిఘటించుచున్నవి. పట్టణ మెల్లయు శోకవ్యాకులపరితప్తమై చెన్నుమాసి యున్నది.

దేవేం—ఓపరమేశ్వరుఁడా ! ఈగండ మెట్లు గడచుదు ? ఈవిపత్సాగర మెట్లు తరింతుదు ? ఇం కెయ్యదాధారము ? నిష్కారణముగా నీబృందారకుల దుఃఖమును జూడవలసి వచ్చుచున్నదిగదా !

వరు—రాజధర్మమును బాటించితివేని మనమందఱ మిప్పుడే యడుగంటి పోవలసి వచ్చును.

యము—పాకశాసనా ! యేల యోచించెదవు ? ఈదుష్టరాక్షసపిశాచంబులను బారఁదోలుటకు నాకేల నున్నమహాభీలంబైనకరవాలము వాలియుండఁగా నింక యుద్ధమునకుఁ దలంక నేల? బాణతూణీరంబులతోఁ గవచధారులైన భటులు వేలకొలఁది కోటబురుజులపై నెక్కి శతఘ్నికాదివివిధాయుధములఁ బ్రయోగింప సంసిద్ధులై యున్నారు. దుర్గోభయప్రాకారభిన్నమధ్యంబున నైమూలపుసూక్ష్మగవాక్షంబులనుండి నిశితశరపరంపరలను పఱపులక్షో పలక్షలసైన్యము సంకులసమర కాంక్షను బ్రతీక్షింపు చున్నారు. నీవు ఆకాశగోళమధ్యంబున మండితహిరణ్మయమండలమువలె వజ్రాయుధకర కమలుండవై ప్రకాశింపుచున్నావు. హయహేషలు జయమును జాటు చున్నవి. ప్రకృతియు నట్లే గీతము పాడుచున్నది.

అగ్ని—నేను ముందు నడచి రాక్షససేనాకాంతారమును దాఁకెదను. సెలవొ సంగుము.

వరు—నేనును వీని నంటి పోయెదను.

దేవేం—సరే ! మీర లరుగుఁడు.

అగ్ని—(వరుణునితో నిష్క్రమించును.)

యము—అదే ! రాక్షసులు వరుణవైశ్వానరుల నతిక్రమించి మనల నాక్రమించు టకు సమీపించుచున్నారు. శచీధవా ! మనసైన్యమును నియమితప్రదేశ ముల దాకొలిపి కోటను గాపాడుము. నేను బోయి పోరుచుండెదను. (అని నిష్క్రమించును.)

దేవేం—ఇంక నేమిపోరాటము ! (స్వగతము)

తే. గీ. ఉప్పుటేరులు పొంగి య ♦ య్యుదధి పొంగి
నింగిపొడవున వచ్చుత ♦ రంగమాలి
కలవిధంబున రాక్షస ♦ కులసమూహ
వాహినులు మాబలద్వీప ♦ ప ్ౖక్తిమురిచే.

ఉ. ఈ యమరావతీనగర ♦ మేలెడుభాగ్యము మాకు నింతతోఁ
బోయెను ! కాలకర్మ మిది ; ♦ పొక్కిన లాభము లేదు ; వైరుల
య్యో ! యిఁక సాధుసజ్జనుల ♦ యూపిరులుంతురె ! సాధ్వులన్ సరో
జాయతరలోలలోచనల ♦ ప్రాణము మానము దక్కనిత్తురే.

ఇప్పుడు ధైర్యమునే యవలంబింపవలయును. (ప్రకాశముగ) ఓ సైనికులారా! ఓ యక్షకిన్నరగంధర్వసిద్ధసాధ్యాద్యమరవరులారా ! మీమీ పౌరుషములను నేఁడు సంపూర్ణముగఁ జూపవలసినయవసరము తటస్థించినది. కొందఱు రథికులు దుర్గద్వారములయందును, గొందఱు మహారథికులు దుర్గాంతములయందును గాయు చుండవలయును.

సైనికులు—(ఏకోక్తంతముగా) దేవా ! జయము జయము! (అనిఅట్లు చేయుదురు.)

దేవేం—కోటలో నున్న సేనను గూడ పురికొల్పవలయును. దానవు లప్పుడే చుట్టిముట్టుచున్నారు. (అని నిష్క్రమించును.)

(రాక్షసులు భయంకరార్భటములతోఁ బ్రవేశింతురు.)

రాక్షస వాహినీపతి—ఓ దానవసైనికులారా ! మీ యార్భటములు మాని యుద్ధమునకుఁ గడంగుఁడు ; అదే ! దేవతలు బాణముల గురియ నున్నారు.

దానవసేన—మేము మాబాణములను గురిపెట్టుచున్నారము. (అట్లు చేయును.)

దేవసేనాని—ఓచమూసమూహములారా ! ఈపొలసుదిండు లధర్మయుద్ధము సేయుచున్నారు. మీరు మీబాణముల సంధించి యయోమయగోళంబుల నుక్కడంచుఁడు.

రా. వా—బృందారకుల బాణములు వింట సంధింపకముందే మీశతఘ్నులను గాల్చి శత్రునిక్షేపము సేయుఁడు. వ్రేయుఁడు.

దా. సే—ఇం కెక్కడిబాణములు! మాశతఘ్నులముందర సాగివచ్చునా? (అని పేల్చును.)

దే. సే—ఓ నిర్జరులారా! ఇప్పుడు మీబాణములు ప్రయోగింపవలసినసమయము గాదు. ఆశతఘ్నులు కాల్చువఱకు ఈభిత్తికలసాటున డాఁగి యుండుఁడు. అవల శరవర్షంబులఁ గురిపి యాశతఘ్నుల నాఁచికొనవచ్చును. అవే గుండ్లు వచ్చుచున్నవి! (అని అందఱు దాగియుందురు.)

రా. వా—ఓహో! ఈసుపర్వులు గుఱి కందక తప్పించుకొనిరి. కావున గుండ్లను నేలబారుగాఁ గాల్పుఁడు. త్వరపడుఁడు. త్వరపడుఁడు.

దా. సే.—నాళములయందు గోళములు పూరింపవలయును గదా!

దే. సే—ఓసుమనసులారా! మీర లింక లేచి మీమీనిశితసాయకమ్ముల గ్రుచ్చి రాకాసుల శీర్షంబులు ద్రెళ్లసేయుఁడు.

రా. వా—అదిగో! బాణములు వచ్చుచున్నవి. వేవేగ మీతుపాకులఁ గాల్చి నిర్జింపుఁడు.

(అప్పుడు సంకులమైన యుద్ధము జరుగును.)

రా. వా—ఓ దైత్యవాహినులారా! యుద్ధ మాఁపుఁడు. యుద్ధ మాఁపుఁడు.

ఉ. సాహసవృత్తి వీడి సుర • సైన్యము సాయకపఙ్క్తివీడి మాం
పాహి యటంచు వెన్నిడుచు • పాఱిరి ప్రాణభయంబుచేత సం
దేహము లేదు దేవతల • దేశము మావశ మయ్యె నింక మీ
యూహలు పండు కష్టపడి • యుద్ధము సేసిన రిత్తవోవునే.

దా. సే.—ఓ భ్రాతృదానవులారా! మనకు జయము సంధించినదఁట! యుద్ధ మాఁపుఁడు, ఆఁపుఁడు. (మానివేయుదురు.)

రా. వా.—అదిగో! పరాజయ మైనసైన్యముతో దేవేంద్రుఁడు కాలాగ్నిరుద్రుని వలె మండుచు వచ్చుచున్నాఁడు. మఱల మాయాయుధములను సవరించు కొనుఁడు.

దా. సే.—ఇప్పుడే యుద్ధము సేసి చేసి యలసి తెక్కలు నొచ్చియున్నమే మింక నోపఁజాల మోపఁజాలము.

దేవేం—సైనికులారా! చూచెద రేమి? శరములను సంధింపుఁడు. రిపుశీర్షంబులఁ ద్రెళ్ల నేయుఁడు.

ఉ. వైరుల వీడఁగా జనద ♦ వారితశౌర్యము మోసు లెత్త దు
ర్వారమునన్ వధించిన శి ♦ రంబులు తక్షతజప్రవాహమం
దోరున మాయశంబులు మ ♦ హోన్నతి గీతము లట్లు పాడఁగాఁ
బోరవలెన్ మగంటిమినిఁ ♦ బోయిన స్వర్గమలంకరింపరే?

దే. సే.—జయము జయము! (అని బాణములను సంధించుచున్నారు.)

రా. వా.—ఓ యసురవీరులారా! వేగిరపడుఁడు వేగిరపడుఁడు.

దా. సే.—లెక్కలేనిబాణములు వర్షము గురియుచున్నవి. ఏమి చేయుటకును దోఁచుట లేదు.

దే. సే.—సైనికులారా! నలుగడల శరములు సారింపుఁడు.

1 దా. సే—హా! హా! మాగర్భములు జీలిక లై పోవుచున్నవి. ప్రాణములు పోవుచున్నవి.

2 దా. సే.—(కణతయందు సాయకము నాటగాఁ బడి) హా! సహింపనోప సహింపనోప! అయ్యో! యిం కెయ్యది శరణ్యము?

ఆ. గీ. అలుబిడ్డలకును ♦ నాధార మిఁక లేదు!
విల్లిగవ్వ యైనఁ ♦ జేర్ప లేదు
వాఁసి జెడఁగ నే ను ♦ దాసీనమతితోడఁ
బోవుచుంటి దుఃఖ ♦ ములకుఁ దూఁగి.

1 దా. సే.—ఇంక నేమిసంగ్రామము? ఈయమర్త్యుల ప్రాణంబులు నిష్ప్రాణువులఁ జేసి మాప్రాణంబులు నాఁచికొనుచున్నవి. మే మింక నిలువఁ జాలము. నిలువఁ జాలము. (అని పాఱిపోవుదురు.)

రా. వా.—ఓ భటులారా ! పాఱి పోవకుఁడు. నేఁడు మీవలన రక్షోవీరుల కంద అకు మాసిపోవని మచ్చ వచుచున్నది.

మ. అనిసేయన్ జనుదెంచి యోప కకటా ! ♦ ప్రాణేంద్రియభ్రాంతితో
జనఁగా వచ్చునె? యేమొగంబులను మీ ♦ చంద్రాస్యలన్ గూడి జీ
వనముల్ సల్పెద రంగనల్ వలె నిసీ ! ♦ వ్యర్థప్రగల్భంబులన్
మును మీ రాడినబాస నిల్పుకొనిరే ♦ నూల్కొన్నచిత్తంబులన్.

సరే ! నిలిచియున్న యోవీరభటులారా ! పాఱిపోవుచున్న పిరికిపందులపై మీనారాచంబులఁ బరపి నిర్జింపుఁడు. (అట్లు చేయుదురు.)

దేవేం—ఓ సురసైనికులారా ! రాక్షసులు పరాజితులై పంచబంగాళమై పాఱిరి. మీరింక విశ్రాంతిఁ బొందుఁడు.

(హిరణ్యకశిపుఁడు సాగ్రహముగాఁ బ్రవేశించి)

హిర—ఔరా ! దేవేంద్రహతకా ! తక్కిపోయితి ననుకొంటివా?

మ. కలఁడా రాక్షసలోకనాయకుఁడు నా ♦ కధ్వంసి నానాధ్వరో
జ్వలకర్మాపనయప్రవర్తి బహుభా ♦ షావైదుషీవారుహ
జ్జలజాతాంతనితాంతుఁ డయ్యసురయో ♦ షామానసోల్లాసి ని
శ్చలతేజుండు హిరణ్యకశ్యపుఁ డిదే ♦ జంభారి వీక్షింపుమా.

దేవేం—ఓహో ! పుణ్యజనుఁడవు—సద్గుణరాశివి—ఏది "కలఁడారా.......... వీక్షింపుమా" (కేరుచుఁ జదువును.) వీక్షింప కేమి ? వేయిసార్లు !

హిర—(హుంకరించి) నీదంభోళి కరాంభోజంబునఁ దాల్చి ఏదీ ! మగంటిమి చూపుము. పేరుమోసినవాఁడవు గదా !

దేవేం—ధర్మాభిరతుండవై పోరుము.

హిర—ఓ ! ఎంతధర్మాత్ముఁడవు?

సీ. ముదుసలిముని గౌత•మునిభార్యను నహల్య,నపహరింపఁగఁ గోడి•యైనయపుడు
నానాఫలావృతా • నందతుందిలమైన, గిరులఱెక్కలు తృంప • నరిగినపుడు,
నూరుయజ్ఞంబులు • నో రెఱుంగని లేఁగ, దూడల వ్రేల్చి వే • టాడునపుడు,
జంభాద్యసురులు సా • క్షాన్సోదరులు నీకు, నట్టివారినిఁ దెగ • టార్చునపుడు,

ఏడఁ బోయెనో యీధర్మ • మేటఁ బడెనో
మేఘములయందుఁ దోఁచెడు • మెఱుపుపగిది
మారిమగుడిందురాఁబోలు • మమ్మెదుర్ప
గోత్రభంజన ! లోచన • గాత్ర ! నీకు.

దేవేం—ఎంతపశుప్రాయునివలెఁ బలుకుచున్నాఁడవు.

చ. ఉరుతరకాశ్యపాన్వయప • యోనిధియందు జనించి యెంతదు
ష్కరమతి వైతి వక్కట ! వి•షాదము ! ఘోరతపంబు సల్పియున్
మరణము దక్కిమ మ్మిటుల • మార్కొన వచ్చితి వెంతవెట్టి చు
ట్టరికమునైన నెంచక హు • టాహుటి పొ మ్మిఁకనైన మేలగున్.

హిర—నీసర్వస్వము మాకొసంగి మాంపాహి యనుము. అట్లనే పోయెదను.

దేవేం—ఏల నొసంగవలయును ?

హిర—దానఁగాని మావైరము తీరదు. నీవు పరమ దుర్మార్గుఁడవు.

దేవేం—ఔరా !

ఉ. కారులు ప్రేల నేల తమ • కంబున నీదుసహోదరుండు ని
ష్కారముగా వసుంధరను • జాఁపగఁ జుట్టఁగఁ బోయె నాకసం
చారుల సంహరించెఁ గుల • సాధ్వుల బల్మినిఁ బట్టె నీవొ బల్
క్రూరుఁడవై మదించి మముఁ • గొట్టఁగవచ్చి తదేమి వైరమో.

హిర—పాపము నీకావైరకారణమే తెలియదు కాఁబోలును.

తే. గీ. ఆలి నెలలేడునిండుచూ ♦ లాలి లీల
లీలఁ గొనివచ్చినాఁడ ; వే ♦ లీల ప్రాలు
మాలి వధియింతునంటి వ ♦ బ్బాలు సుగుణ
జాలు మురిపెంపుముద్దుల ♦ యాలవాలు ?

దేవేం—అదియా నీవై షమ్య కారణము ?

శా. నీతమ్ముండు జగద్విరోధిని ఖలున్ ♦ నీరేజపత్రాక్షుఁ డు
జ్జాతక్రోధముతో వధింపఁగ మమున్ ♦ దండింప నీ వేటి కా
శీతాద్రిన్ దపమాచరించితివి యి ♦ స్సీ ! నీకు మే మంతగా
ఘాతల్ సల్పిన దేమి ? యీగతిమమున్ ♦ గారింప దైత్యోత్తమా!

అట్టి దుర్మార్గుఁడ వైననీకు మఱియొకదురాత్ముఁడు పుట్టితోడైన లోక మెుక్క పెట్టున భగ్గున మండిపోవునని నీభార్య యగులీలావతీగర్భవిచ్ఛిన్న మునకుఁ బాల్పడినది నిక్కమే.

హిర—ఇట్టి శిశుహత్య లెన్ని జేసితివి ?
దేవేం—అట్లు జరుగలేదుగదా !

హిర—ఔరా ! అస్మత్కులవిదగ్ధా ! దేవేంద్రా ! నిన్నలయించునని గర్భమం దున్నపసికూనలను బాధింప సమకట్టితివా ?

దే. సే—(అపవారించి) ఔరా ! ముక్కడిరక్కసుఁడా !

ఉ. వైరులు చేతఁజిక్కినఁ గృ ♦ పాణము నూపక మ్రొక్కఁ జూచినన్
ఘోరము పుట్టకుండునె ? ని ♦ గూఢముగా సమయంబు జిక్కినన్
బోరను గత్తిమోపి పొడఁ ♦ బోదురు ; కావున పాముపిల్లలన్
జేరఁగనీయన ట్లరులఁ ♦ జీల్చుటె రాచకొలంపుధర్మముల్

హిర—ఓహెూ ! ఈలాటిరాచపౌరుషమే కాఁబోలును. ఈమహేంద్రుఁడు మీ చేతనే. గాక మునిగొడ్డులకు లంచము లిచ్చి మఱిపొగిడించుకొనుచున్నాఁడు.

దేవేం—నీ కాప్రసంగ మేల ? నీదుఃఖ మేదో కానిమ్ము.

హిర—నాకు మఱి యేమిదుఃఖమున్నది ?

సీ. జారత్వమున సవా ♦ జాడలుపడ మేను, వేగంటిఁ డనుచుసే ♦ వించునారు,
మావలె గోవుల ♦ మాడ్చి భక్షించిన, శతముఖుం డని నుతి ♦ సలుపువారు,
కొండరాళ్లను జెక్కి ♦ కోయవై బ్రతికిన, గోత్రభిత్తనుచుఁ బే ♦ ర్కొనెడువారు,
బలజంభు లనుముదు♦సలిపీనుఁగులఁ గొట్టి, ఓరుచు లయ్యవి పెట్టి♦పిలుచువారు,

సతము నీ కెందరో ముఖ ♦ స్తుతుల సల్పు
బట్టు లున్నారు మా కట్టి ♦ భంగిఁ బొగడు
గాయకులు లే రటన్నదుః ♦ ఖంబె యగ్గ
లంబుగా నున్నదో య ♦ హల్యావినోద !

దేవేం—ఎంతసే పాడిన నివియే. మా మహత్తరగుణము లేలపాటింపవు ?

చ. జగము సుభిక్షమై యెసఁగ ♦ చండతరోరుమహాతపంబు లా
రఁగ గురిపింతు వర్షము ధ ♦ రాతలమంతటఁ బాడిపంటలున్
నెగడఁ బయోధి ముత్యములు ♦ నెక్కొన మీనకులంబు లీన గ
డ్డిగసురు లన్నియున్ మొలువ ♦ డీలుపడన్ రుజ లీతిబాధలున్.

హిర—జగతికిఁ గలుగు నీమహోపకారము నీవలనఁ గాదు ; సూర్యునివలననగుచున్నది. ఆ తపనుఁడు తనతీవ్రకరకిరణంబులు సంద్రంబుపైఁ బఱపి నీటి నాకర్షించి వృక్షమూలంబులఁ గురియుచుండును. దాన విశ్వము సుభిక్షమై యెసఁగుచున్నది. అంతయేకాని మధ్యను నీ వెవ్వఁడవు ? మాయొద్దఁ గాదు నీ డంబములు !

దేవేం—ఓరీ ! నేను మేఘవాహనుఁడ నన్నమాట యెఱుంగవా ?

హిర—ఎఱుంగ కేమి ? ఊర్వసీవాహనుండవుమాత్రము కావా ?

దేవేం—ఎంతకూళ వగుచుంటివి ?

హిర—ఒరులకల్మి నోర్వనివాఁడు కూళ.

చ. హడలెదు మమ్ము బోటి దను ♦ జావళి రేఁగిన నెత్తివచ్చినన్
జడలు ధరించుతాపసులు ♦ జన్నము సల్పిన ; నీదురాజ్యమా
రడిగయికొందు రంచు నల ♦ రంభనో యూర్వసినో విఘాతమే
ర్పడఁగను బంపెదీ వెదుటి ♦ పచ్చను నోర్వనియట్టి కూళవై.

దేవేం—మేము వినోదార్థము దేవవేశ్యలను ఋషిపుంగవులకడ కంపి యుంటి మనుకొనుము. మీరో,

తే. గీ. బానలకొలంది రక్తంబుఁ ♦ బట్టి ఋషుల
జన్నతలముల కలయంపి ♦ జల్లి వారి
గడ్డముల లాగి హింసింతు ♦ రడ్డమైన
కారుకూతుల మోటర ♦ క్కసులు మీరు.

హిర—నీలాటి సున్నితము మా కెట్లువచ్చును ?

మ. శచికిన్ జోడయి యూర్వసీవలపు రా ♦ జ్యంబై యహల్యావధూ
కచబంధంబులఁ జిక్కువడ్డ కుసుమా ♦ కారుండ వీ వెంతవిం
తచమత్కారపుసౌకుమార్యుఁడవొ యిం ♦ ద్రా !సాంద్రతేజోరుచుల్
పచరింపన్ మముబోటి రాక్షసులకున్ ♦ లభ్యంబె నీవై ఖరుల్.

దేవేం—అన్నా ! ఎంతపామరుఁడవై నిందించుచున్నావు.

ఉ. ఘోరతపంబు జేసి కను ♦ గొంటివి యాదిని భారతీమనో
హారుని సారసోద్భవుని ♦ నాతనిచేత వరంబు లంది ని
ష్కారము నీరుజేసితివి ♦ క్రౌర్యము వీడక ; బూదిఁబోయుప
న్నీ రయిపోయె నీదువ్రత ♦ నిష్ఠలు దుష్టుల కచ్చివచ్చునే.

హిర—పోనిమ్ము.

ఉ. ఆ తప మాచరించుటకు ♦ నబ్జజుచేత వరంబుఁ గొంటకున్
బాతకముల్ హరించు నని ♦ పాల్పడలేదు నిలింపు లెల్ల నా
చేత నశింపుఁ జెందుటకుఁ ♦ జేసితి జన్నము లగ్నిహోత్రముల్
ఈతరి గాచుకొమ్ము పర ♦ మేశ్వరుఁ డెవ్వఁడు నీకు నడ్డగున్.

దేవేం—ఓరీ! భగవానుఁ డైనపరమేశ్వరునిగూడ నిందించుచుంటివిగా నీ విప్పుడే భగ్నమైపోవుదువు. నీగదయే నిన్ను రూపుచూపును.

తే. గీ. ఎవఁడు లోకాపకారియై ♦ యీశునైన
జడియఁ డాతనిగర్భమే ♦ శత్రు వగును.
చనుఁ దుదకకాలమృత్యుహ ♦ స్తములయందు
హద్దు తప్పినక్రూరస ♦ త్వాళిపగిది.

హిర—ఏమేమి ? మాకు శాపంబులు గూడ నిచ్చుచుంటివిగా? ఈచేతనున్నమహా భీలంబైనగదాదండము నీశాపతాపంబులకు మారణమంత్ర మనుకొనుము.

దేవేం—కాలము తప్పిన నదిమాత్ర మాఁగునా ?

హిర—ఏలయాఁగదు ?

స్రగ్ధ. సప్తాంభోరాసు లింకన్ ♦ జ్వలనమరుతముల్ ♦ చాలవీవంగలేదా
సప్తాశ్వేందోరుతారల్ ♦ జలజలని తెగన్ ♦ జాఱిరాలంగ లే దా
సపార్చిన్ దీవ్రమారం ♦ జన దుభయచమూ ♦ సంఘసంగ్రామరంగో
ద్దీప్తాఖండాస్మదీయో ♦ ద్రితలసితగదా ♦ ధిక్యదండంబు గూలన్.

దేవేం—అట్లేమి ?

హిర—కాక మఱి యేమి ? (అని గద గిరగిరఁ ద్రిప్పును.) రమ్ము. సరిగాఁ బోరాడుము. లేదా మాంపాహి యనుము.

దేవేం—అవురా ? అక్షీణ నిఖిలక్ష్మాక్షరక్షోణిధరానేకవిపక్షపక్షనిర్దళన దక్షంబైనవజ్రకౌక్షేయంబు నాదక్షిణబాహుదండంబున రూక్షంబై నీవీక్షణంబులకుఁ బ్రేక్షణంబై పొడగట్టుచుండఁగ లక్షింపక కుక్షింభరుండవై రాక్షసవృత్తిని గక్షను సాధించు దురాపేక్షాదీక్షితుఁడ వై యేల కాలుదువ్వెదవు? సరే! కాచికొనుము. నీతలయిప్పుడే నేల రాలుచున్నది. (అని కులిశము త్రిప్పుచున్నాఁడు.)

(ఆకాశమునుండి)

ఓదేవేంద్రా! యుద్ధము వలదు. యుద్ధము వలదు. నీ కిప్పుడు జయకారణము లేదు. నీసర్వస్వము దానవభర్తకు సమర్పించి వెనుకకు మరలుట కనుమతింపుము.

దేవేం—గగనవాణిని బ్రతిధ్వనించునట్లు పలుకు నోపరమేశ్వరా ! నీయాజ్ఞ శిర సావహించి అట్లే మరలి పోవుచున్నాఁడను. శాంతిని బ్రసాదింపుము! శాంతిని బ్రసాదింపుము ! (అని దేవసేనాపతితో నిష్క్రమించును.)

హిర—ఓరీ ! పారుబోతా ! బలజంభాది విపక్షరాక్షసానేక పర్వతపక్షక్షోదద క్షోరు కులిశపాణీ ! నిలువుము. నిలువుము.

రా. వా.—ఓరాక్షసేశ్వరా ! నీపురుకట్టువంటి కులిశమును చంకఁబెట్టుకొనిపోర లేక తోఁక ముడిచి పారిపోవు పిగిలిపిట్టవలెఁ బరువిడుచుండఁగా మరల నేల పిలిచెదవు ? వెనుకంజ వేసినకోఁడిపుంజు మరలఁ బోరాడునా ?

హిర—అవును. ప్రాణములను దక్కించుకొన్నాఁడు.

రా. వా.—మానమో ?

హిర—మన మెవరిమానములు దక్కించితిమి ?

తే. గీ. భువినిగెలిచితి మిప్పుడీ ♦ దివిని గెలిచి
దిక్కులను గెల్చినాము పెం ♦ పెక్క నుభయ
లోకములమధ్యప్రజలు న ♦ లో యటన్న
వీడినారమె ప్రాణంబు ♦ లూడిపడిన.

రా. వా.—ఇంక కోటలోనికిఁ జొరఁబడి సునాసీరపీఠము నాక్రమించు కొనవలయును.

హిర—సరే !

రా. వా.—సునాసీరు నేమిచేయుదము ?

హిర—విడుచుటయే యుత్తమము.

తే. గీ. కీళ్లు తప్పు పాంచాలిక ♦ క్రేవ దోఁప
సొక్కి నవనాళ్లు పడఁగ న ♦ శ్రులను రాల్చు
వజ్రిపైఁ బడ్డమనకు లా ♦ భంబు లేదు
పిడుగుపడి యేమిగడియించు ♦ పిడుక గూట ?

రా. వా.—పోనిమ్ము. దానవేశ్వరుఁడు మహాదయాశాలి యని ప్రజలు కీర్తింతురు గాక.

హిర—ఈకోటగోడలను బగులచేసి లోనికిఁ బ్రవేశింపవలయును.

రా. వా.—అది యెంతసేపు? ఓసైనికులారా! మీశతఘ్నులను [illegible] దుర్గప్రాకారమును గూల్చి వేయుఁడు.

సైనికు—(అట్లు వేయుదురు. అపుడు సుధర్మాసనము గానవచ్చును.)

రా. వా.—దేవా! లోనికిం జనుట కనుజ్ఞ యున్నదా?

హిర—బృందారకు లంద ఱెక్కడ కేగిరి?

రా. వా.—అడవులకు.

హిర—సరే! నడువుము. లోనికిఁ బోవుదము. (అని రెండడుగులు వేసి [illegible] పతీ! అవి యేమి?

రా. వా.—(ఒకొక్కటి చూపుచు)

ఆ. గీ. ఇదియె వైజయంత ♦ మిది సుధర్మాసన
మిదియె స్వర్గరాజ్య ♦ మిదియె యప్స
రసలబోటు సురలు ♦ మసలెడుకాణాచి
మనకు నింతకాల ♦ మునకుఁ జిక్కె.

హిర—ఓహో! ఎన్నినాళ్లకుఁ జూడఁగంటిమి!

సీ. ఈ వైజయంతంబు ♦ నీ నాకలోకంబు, తన కేమొ [illegible] ♦ [illegible]
ఈ సుధర్మాసనం ♦ బీ నందనోద్యాన, మునికిపట్టని [illegible] ♦ [illegible]
ఈ స్వర్గరాజ్యంబు ♦ లీ మేలిసౌధంబు, లన్నియుఁ [illegible] ♦ [illegible]
ఈ సరోవరములు ♦ నీ మరున్నారులా, ర్జించినా [illegible] ♦ [illegible]

అట్టి దేవేంద్రునకు నిప్పు ♦ డైనఁగాని
తెలిసెనో లేదో యన్నద ♦ మ్ములకుఁబాలు
పంచి యిడకున్న బల్మినిఁ ♦ బడసెద [illegible]
నొచ్చినను గాని జ్ఞానంబు ♦ వచ్చు [illegible].

రా. వా.—ప్రభువర్యా ! మన సైనికులు సాహససముత్సాహులై వెనుదీయక పోరాడిరి. అందుకుఁ బ్రతీకారముగా రాజనీతిప్రకారము దోఁపిడి కనుజ్ఞ నొసంగ వలయును.

హిర—అట్లే దోఁచుకొననిమ్ము. మన దేమి పోయినది ?

రా. వా.—ఓ రాక్షససైనికులారా ! మహారాజు మీకు దోఁపిడికనుజ్ఞ నొసంగి నాఁడు.

తే. గీ. ధనములో యంబరంబులో ♦ ధాన్యతతులొ
మణులొ మహిళాలలామలో ♦ మౌక్తికములొ
వలసినన్ని దోఁచుకొనిపో ♦ వలయు మీరు
పుణ్యము హరించు జారత్వ ♦ బుద్ధిపగిది.

సైనికులు—జయము జయము మహారాజా ! (అని నిష్క్రమింతురు.)

హిర—వాహినీపతీ ! ఇం దేది కర్తవ్యము ?

తే. గీ. అమరలోకంబు వశమయ్యె ♦ నమరనాథుఁ
డంగనల డించి పారెకా ♦ రడవులకును
నిచటి వన్నియు మాయూర ♦ నిడుద మన్న
రావు మా కిచ్చటను బుద్ధి ♦ రాదు నిలువ.

రా, వా.—అగును. "జననీజన్మభూమిశ్చస్వర్గాదపిగరీయసీ" అన్నాఁడు. అనంతరకరణీయంబుల సావకాశముగ యోచింతురుగాని రండు.

(అని అందఱు నిష్క్రమింతురు.)

# దానవవధ.

## తృతీయాంకము.

రంగము—విద్యామందిరము.

(ప్రహ్లాదుఁడు సాలోచనుఁడై ప్రవేశించును.)

ప్రహ్లా—మజ్జనకుఁ డగుహిరణ్యకశ్యపమహారాజు నన్ను విద్యాభ్యాసార్థ మీ భార్గవ పుత్త్రులగుచండామార్కులకు నొప్పగించి యచిరకాలమైనను వీరల నేకశాస్త్రములు పఠింపఁజేసి కృతార్థుని గావించిరి. కాని పరమేశ్వరు నెఱుంగుమార్గమొకింతయుఁ బ్రబోధింపరు.

ఉ. ప్రాణి యశాశ్వితంబుఁ దను ♦ వంబుకణంబుఁ బ్రపంచవాంఛ లే
వేనియు పాపహేతుకము ♦ లిద్ధసుఖంబు లొసంగ వట్టి య
జ్ఞానమహాంబుధిన్ మునిఁగి ♦ చచ్చుటకున్ నరుఁ డుద్భవించ లే
దానిఖిలాంతరాత్ముఁ బర ♦ మాత్మునిఁ గొల్చి తరించుమంటకే.

ఇంక నా కాపరమేశ్వరపరమతత్త్వార్థరహస్యమును నెఱింగింపఁగల గురుఁ డెవ్వఁ డీరాక్షసలోకమున లభింప నేర్చును ? మజ్జనని నారదాశ్రమంబున నున్నప్పుడు, ఆమునీంద్రునిచే విన్నయర్థంబులు నా కప్పుడప్పు డెఱింగింపు చున్నను, ఆమెకు నిదిధ్యాసము లేకుండటచేఁ దదీయప్రబోధంబులు దురవగాహంబులై యున్నవి. ఇంక నావిషయాసక్తమైనబుద్ధి యెట్లు మరల నోపును ? ఎట్లాపరమేశ్వరుని గ్రహింపవలయును ?

ఉ. ఎవ్వనిచే జగంబు జని ♦ యించునొ యెవ్వఁ డలంకరించెనో
యివ్వసుధాతలంబు ; మును ♦ లెవ్వనికై యశనాంబు లీఁగి పెన్
జవ్వనపున్సుఖంబు విపి ♦ నంబుల వెన్నెలఁ జేసినారొ ! ఆ
నెవ్వగ లానిఁ జూపుటకు ♦ నేర్చినవారలు లేరె మ్రొక్కెదన్.

సీ. లతలార ! పెనఁగొను♦గతిమీకు నేర్పిన, చతురుఁ డెవ్వఁడొ చెప్పఁ♦జాలరొక్కొ
పువ్వులార ! సౌరభ్య♦ములు మీకుఁబెట్టిన, శుభగుఁడెవ్వఁడొనాకుఁ♦ జూపరొక్కొ
ద్విజులార!సుస్వర♦విహృతిమీకొసఁగిన,యొడయుఁడెవ్వఁడొకింత♦నుడువరొక్కొ
యళులార ! పూఁదేనె ♦ లాన మీకిచ్చిన, పరమేశుఁ డెవ్వఁడో ♦ పలుకరొక్కొ

పురుషులార మీకుఁ ♦ దరుణులపైఁ బ్రేమ
నేర్పె నెవఁడు దెలుప ♦ నేర రొక్కొ
ఆర్తమతిని నన్ను ♦ నందఱబ్రతిమాలఁ
జేయువాఁ డెవండొ ♦ చెప్పరొక్కొ.

ఎవ్వరును మాటలాడరు. ఈవిషయ మెవ్వ రెఱింగింపరు గాఁబోలును. (అని అవనతవదనుఁ డై మరల పైకిఁ జూచి) ఓప్రహ్లాదా ! అదే చూడుము. (చేతులు మోడ్చి) ఓయంధకారమా ! నీపైనున్న దేమిటి ?

చ. మిలుకు మిలుక్కుమంచు నడి ♦ మింటను దోఁచుచు నైజకాంతితో
వెలిగెడుతారలే యగు న ♦ భీష్టఫలంబులఁ గూర్చువేల్పు లా
విలసితశక్తి నాహృదయ ♦ వీథిని నిల్చుటకై నమస్కృతుల్
సలిపెద మత్పురాకృతవ ♦ శంకటదుష్కృతముల్ హరింపఁగన్.

కాని ఈనక్షత్రపఙ్క్తులు చంద్రసందర్శనమున రూపుమాయును గదా ! ఇవియెట్లు పూజార్హము లగును? కావున నదే పూర్వదిగ్భాగమున (అని చేతులుమోడ్చి)

చ. జలనిధి గర్భమున్ వెడలి ♦ చారుకనత్ కిరణాళు లెల్లెడన్
వెలయఁ జకోరకంబులకు ♦ వెన్నెలలన్ బరితృప్తిఁ జేసి యా
కలువలకున్ వినోదపువి ♦ కాస మొసంగుచు దాననుండు న
య్యళులను విద్రలేపెడుశ ♦ శాంకుఁడె తప్పక దైవ మయ్యెడున్.

కాని యీతనియందును దైవమున కుండవలసినగుణములు లేవు. వృద్ధిక్షీణములు,రాహువు వాని నింకను బాధించుచున్నవి. సరే !అసూర్యుఁడో?

శా. తేజోరాశి ప్రచండదీధితులచే ♦ దీపింప దిఙ్మండలిన్
రాజిల్లన్ భగవానుఁ డం చెవనిక ♦ ర్ఘ్యంబుల్ సమర్పింతురో
రాజీవంబుల కెవ్వఁ డాత్మహితుఁ డై ♦ రాణించునో యాయినున్
బూజింతున్ భగవంతుఁ డైన నతఁడే ♦ ముఖ్యుండు లక్షింపఁగన్.

కాని, యీతఁడును గ్రుంకువాఁడే. ఎట్లు పరమేశ్వరుఁడు గానోపును ? ఇదియొకయుక్త గోళము. వీని నన్నిటినిఁ గల్పించిన యొకజగదీశ్వరుఁ డుండవలయును. కర్త లేనికార్యము లుండవుగదా ! వాఁడు ఆకాశమున నుండునా ? పాతాళంబున నుండునా !(అని కన్నులు మూసికొని) సత్యము, సత్యము !హృదయాంతరాళమునఁ గూడ నాక్రమించి యున్నవాఁడు.అహో!

చ. తననిజమాయచే నెవఁడు ♦ ధాత్రిని వాసగృహంబుఁ జేసి యే
దినమును సూర్యచంద్రులను ♦ దీపములట్టుల నిల్పి పాపపుం
గనులకుఁ గానరాక కల ♦ కాలము నీఁగక పొల్చునాజగ
జ్జనకు ననంతు నచ్యుతున ♦ సంగుని గొల్తు నభీష్టసిద్ధికిన్.

అపరమేశ్వరుఁడు హరినారాయణాదినామములయందును బ్రకటింపఁబడు చున్నాఁడు. ఆహా ! ఏమినాభాగ్యము. (అని కన్నులు నులుముకొని) చాల రాత్రి జరిగియుండును. పాఠములు చదువుట కిప్పు డవకాశము లేదు. ఒకింతసేపు నిద్రించెదఁ గాక. (అట్లు చేయును )

(తెరలో వైతాళికులు)

కవిరాజవిరాజితము.

అళియొకటచ్చట ♦ నబ్జమరందము, లాన యుషస్సమ ♦ యంబునకై
యలరు మఱొక్కటి ♦ యంబుజగర్భము, హాయిగవెల్వడి ♦ యంగనతోఁ
జెలువములాడెకు ♦ చెంగలువల్ ముడి, చెన్ గనుమా యని ♦ చెప్పెననన్
నళినము నవ్వెను ♦ నా వికశించెను, నైజమదే గను ♦ నా యకటన్.

తే. గీ. వెలవెలను బారె దీపముల్ ♦ వేగుచుక్క
వెన్నెలలతో నదృష్టమై ♦ వెడలె, కోళ్లు
కూసె, మదనుండు చాపంబు ♦ గూడ విడిచె
మేలుకో నాథ! నిద్రించు ♦ వేళ గడిచె.

(అంత ప్రహ్లాదుఁడు లేచి) ఓహో!

చ. బలబలఁ దెల్లవారె నదె ♦ పద్మసఖుం డుదయించెఁ గాకముల్
కులుకుచుఁ గావుకావనుచుఁ ♦ గూయఁగ సాఁగె సుంగధపూరమై
మలయసమీరముల్ విసర ♦ మంజులశయ్యల నిద్ర లేచి యా
కొలకుల స్నాన మాడనుమ ♦ కోమలు లేగెడు పొద్దు దూరెడున్.

ఇప్పు డొకింతసేపు పరమేశ్వరుని గూర్చి ప్రార్థించుకొనియెదఁ గాక.
(ప్రహ్లాదుని బడికిఁ గొనిపోవుటకు సహాధ్యాయు లగుబాలకులు వచ్చి నేపథ్యమున నుండి.)

బాలకుఁడు—(తక్కినవారలతో) ఈతఁ డేదో క్రొత్తవిషయములు నేర్చికొనియెను గాఁబోలును. పరమేశ్వరధ్యానము చేయునఁట. అది యేమో చూచెదము. మీరందఱు నావెనుకకు రండు. (అట్లు చేయును.)

రెం. బా.—పరమేశ్వరుఁ డన్న నేయూరిపేరు?

ప్ర. బా.—అది యొకదేవత పేరు.

రెం. బా.—ఇప్పుడు వచ్చి జడిపించదు గదా!

ప్ర. బా.—భయము లేదు.

ప్రహ్లా—(చేతులు జోడించుకొని) ఓమానసమా! పరమేశ్వరునిఁ బ్రార్థించుటకు త్వరపడుము.

ఉ. ఆరమణీయసర్వసుగు ♦ ణాన్వితుఁ డార్తశరణ్యుఁ డాపదో
ద్ధారుఁడు దీనరక్షకుఁ డు ♦ దారుఁడు సర్వము దానెయైనయోం
కారుఁడు పాపభంజనుఁ డ ♦ కల్మషుఁ డప్పరమేశ్వరుండు నన్
జేరెడునట్లు నాహృదయ ♦ సీమను నిల్పి భజింతు నిత్యమున్.

ప్ర. బా.—ఈమంత్రసిద్ధి మనమును నేర్చికొనియెదము రండు. (అని అందఱును ప్రహ్లాదునియొద్దకుఁ బోయి.) రాజకుమారా! నమస్కారము.

ప్రహ్లా—మీర లేటికి వచ్చిరి?

బాల—పాఠశాలకు రావా!

ప్రహ్లా—(లేచి) ఇదే వచ్చుచున్నాఁడను. (అని అందరితోఁ గలిసి వెళ్లును.)

ఇది విష్కంభము.



రంగము—పాఠశాల.

(ప్రహ్లాదుఁడు బడిపిల్లలు ప్రవేశింతురు.)

ప్ర. బా.—ప్రహ్లాదకుమారా!

ఆ. గీ. పిన్నవాఁడ వయ్యుఁ ♦ బెద్దనీతులు నేర్చి
నాపు కాన వంద ♦ నంబు నీకు (అని చేయును.)
మొగిలియాకులందు ♦ బొడవు లుండినఁ గాని
పొట్టియాకుల కగుఁ ♦ బూజితంబు.

ద్వి. బా.—సత్యము. సత్యము. ఓప్రహ్లాదా!

తే. గీ. ఈవు యువరాజువే కాక ♦ యిపుడు పరమ
పూజ్యుఁడవు మాకు, విజ్ఞాన ♦ పుణ్యనిధివి
యగుట; మముఁగూడ నీతోవ ♦ నాఁచికొనుచు
యమలగుణధీర! హేమక ♦ న్యపకుమార!

ప్రహ్లా.—ఓసహచరులారా! నన్నేల మీరిట్లూరకే పొగడఁ జూచెదరు? నాసద్గతి కొఱకు నేను వెదకికొంటిని గాని మీ మే లింతవఱ కూహింప లేదు గదా! అట్టి నేను మీచే నెట్లభిమానింపఁబడితినో యెఱుంగ కున్నాను.

ప్ర. బా.—నేఁటిప్రాతఃకాలమున నీవొనరించినప్రార్థనము మా కెంతో మహదా

నంద మొసంగినది. ఆదారిని బట్టి పోవుటకు మే మందరము నిశ్చయించు కొని యున్నారము.

ప్రహ్లా — అటులైన నవస్య మనుసరింపవచ్చును.

తే. గీ. చీఁకటులు విచ్చు సూర్యుని ♦ రాకవలనఁ
దాపము శమించు మలయశీ ♦ తంబువలన
లలితశుచి వచ్చు గంగాజ ♦ లంబువలనఁ
బాపము నశించుఁ బరమేశు ♦ ప్రార్థనమున.

కావున.

ఉ. ఆయువు లల్పమౌ టెఱిఁగి ♦ యాశలలోన నిబద్ధులై పశు
ప్రాయులరీతి భోగముల ♦ పైయనురాగముఁ బూని పోక నా
రాయణు నార్తరక్షకుని ♦ ప్రాలినభక్తి భజింపుఁ డయ్య ! జే
గీయవధువినోదములు ♦ గీములు వెంబడి రావు ప్రేముడిన్.

(నేపథ్యమునఁ జండామార్కులు ప్రవేశించి) ఓహో ! ఈప్రహ్లాదుఁడుపన్యాసము లిచ్చునంతటి వివేకవంతుఁ డైనాఁడు. విద్య నేర్పినగురువు శిష్యునిఁ జూచి సంతసించుట కంతకన్న నేమి కావలయును ?

తే. గీ. వెలఁది తానై వలచి వచ్చి ♦ ప్రియముతోడఁ
దేటమాటల తేనెల ♦ తీపు లొలయఁ
గులుకుచు నొయారమునఁ బల్కు ♦ పెళుకుకన్న
శిష్యుఁడు వచించుపద్యమే ♦ చెలువుఁ గూర్చు

కావున నింకను వీనియుపన్యాసము లీచాటుననుండి వినియెదఁ గాక.

వహా — మఱియు.

సీ. అస్థిపంజరము దే ♦ హం బిందుప్రాణంబు, లనిలాభమై దిరు ♦ గాడుచుండు
నింద్రియవ్యాపార ♦ మేనాఁటి కానాఁడు, వాంఛాప్రపంచంబు ♦ వరలఁ జేయు
విషయరాగద్వేష ♦ విన్యస్తపాదుఁడై, కలహించుజీవుండు ♦ తెలివిమాలి
పాపపుణ్యంబులఁ ♦ బాటింప కనిశంబు, బంధసంస్కారుఁడై ♦ పరఁగుచుండు

దీన నియమితకాలంబు ♦ దీరెనేని
నాలుబిడ్డల విడిచి గృ ♦ హంబు విడిచి
పోవుచుండును పురుషుండు ♦ పుడమిపైని
ధీరవరులార! వినుఁడు స ♦ తీర్థులార!

చండా—(నేపథ్యమున) ఎంతచిత్ర మెంతచిత్రము. కుఱ్ఱవాఁడైన ప్రహ్లాదున కీ మహత్తరవిజ్ఞాన మెట్లలవడి యుండును?

ప్రహ్లా—ఓబాలకులారా! మఱియును వినుఁడు.

తే. గీ. కలలనైన నసత్యంబు ♦ పలుక రాదు
పరవధూటులఁ జూడఁగ ♦ న్దెఱువ వలదు
పరధనము జాఱిపడినఁ జే ♦ పట్టఁ దగదు
పరమభక్తిని భజియింప ♦ వలయు హరిని.

చండా—(ఆశ్చర్యముతో) అ! ఏమి! "హరిని" భజింపవలయునా? ఇది రాక్షసులాడవలసినమాటయా! ఇది యీతని కెట్లబ్బినది! ఇదియేనా జన్మాంతరసుకృతవిశేషమందురు! జన్మాంతర మన నేమి?

తే. గీ. సుతులకైశ్వర్యమును విద్య ♦ హితవివేక
మాయువులు తల్లిగర్భాన ♦ మోయునప్పు
డెంతతలఁచిన వచ్చు జ ♦ న్మాంతరంబు
గలదనుట తప్పు సంకల్ప ♦ కలనమంత.

బాలకులు—ఓయువరాజుకుమారా! నేఁడు మేము ధన్యుల మైనారము. ఇంక నిరంతరము పరమేశ్వరధ్యానమునే యాచరించెదము.

చండా—ఓహో ! ప్రమాదము వచ్చినదే ! రాక్షసరా జిది విన్న మిన్నకుండునా! ప్రహ్లాదుని ప్రబోధము వీరల నెంతగా మార్చినది.

చ. చదివినవాఁడు గాఁడు తన ♦ సాటినిశాటకుమారపాళితో
సదనము వీడి యాడుకొనఁ ♦ జాలడు పంచశరద్వయస్కుఁ డీ
సదమలతత్వశాస్త్రముల ♦ సారము లై నహరిప్రబోధముల్
మొద లెటునేర్చెనో పలుక ♦ పుణ్యజనుం డిది విన్న మెచ్చునే ?

అయినను నే నీతనిబుద్ధిని మరల్పఁ జూచెదను గాక. (ప్రహ్లాదుని సమీపించి) ప్రహ్లాదకుమారా ! నీతండ్రి రాక్షసలోకారాధ్యుఁడు. వానియనంతరము నీవాభద్రసింహాసనమునకుఁ బట్టభద్రుఁడ వయ్యెదవు ; కావున నీయందు రాక్షసగణోచితకర్మంబు లన్నియుఁ బొడసూపవలయును.

ప్రహ్లా—అది యేమి ?

చండా—ఇంతటినుండి నీహరి గిరిప్రబోధములు విసర్జించి కులమునకు వన్నెఁ బెట్టుము.

ప్రహ్లా—సరే ! హరిభక్తి యేల విడువవలయును ?

చండా—అవశ్యము విడువవలయును. దానఁ బెద్దప్రమాద మున్నది.

మ హరియంచున్ గిరియంచు నీ వెవనికై ♦ యర్చింతువో వాఁడు సూ
కరుఁడై సీపినతండ్రిఁ జంప నలుకన్ ♦ గాంక్షించి నీతండ్రి మం
దరభూధారముపైఁ దపించి యిపుడున్ ♦ దండింప నున్నాఁడు నీ
వెఱుఁగన్నేరవొ వైరులన్ గొలువదై ♦ త్యేభ్యుండు క్రోధింపఁడే.

ప్రహ్లా—గురువర్యా ! అట్లెన్నఁడు దలంపఁబోకుఁడు.

తే. గీ. క్రోధ మనునదె పాపంబు ♦ క్రోధియైన
తపసి యెట్లగుఁ గ్రూరవ ♦ ర్తనంబు గాని
కాన మాతండ్రి తపసియే ♦ గాక నృపతి
యతఁ డెఱుంగఁడె హరిభక్తి ♦ యందు మహిమ

చండా—(స్వగతము) ఈతనివచన మెంతసర్వోత్తమమైనను రాక్షసునికొలువు చేయునే నెట్లామోదింపగలను? (ప్రకాశముగ) ప్రహ్లాదా! నీ వెంత మూర్ఖుఁడవు హరియందు లేనిమహిమ భక్తియం దెట్లువచ్చును?

చ. హరి యనువాఁడు భీరుఁడు మ ♦ హాత్ముఁడె? శేషుఁడొ వైనతేయుఁడో
సిరియొ వికుంఠమో దరిని ♦ జేర్పకయున్న భయార్తచిత్తుఁడై
పరువిడి దుగ్ధవార్ధి వట ♦ పత్రముమాటున డాఁగఁబోఁడె? యా
నరి కొకదైత్యుఁ డైన నిటు ♦ చక్రికి దాస్యము సల్పనేర్చునే?

కావున నీమూర్ఖమును వదిలి పుణ్యజనులు పోవుమార్గము ననుసరింపుము. నింద్య చరిత్రుఁ డైనహరిని బరిత్యజింపుము.

ప్రహ్లా—సర్వము నిండియున్నవానిఁ బరిత్యజించుట కెవ్వరు సమర్థులు?

తే. గీ. సూదిమోపుటకైనను ♦ జోటులేక
నిండి యున్నాఁడు పరమేశ్వ ♦ రుండు జగతిఁ
గలఁడు లేఁడని మూర్ఖుండు ♦ కలఁగు చుండు
సారిది నిసుకరాలినకను ♦ చూపు పగిది.

చండా—(ఆగ్రహముతో) ఏమి మేము మూర్ఖులముగా? సరే!

ప్రహ్లా—మిమ్ముమ నేను దిరస్కరించుట లేదు. పరమేశ్వరునిగుఱించి భేదబుద్ధి గలవారలను గూర్చి వచించితిని.

చండా—అగుఁగాక! నీ వీపూటంతయు నిలువంబడవలయును.

ప్రహ్లా—(అట్లుచేయును.)

బాల—ప్రహ్లాదుఁ డేతప్పుచే నిట్లు శిక్షింపఁబడియెను?

చండా—మేము పాఠశాలకు రాకముందు మీయందఱికి నారాయణ కథా శ్రవణంబు సేసినందుకు.

బాల—మీరు వచ్చినతరువాతఁ జేసినందునకో?

చండా—బహుప్రసంగములు సేయకుఁడు.

బాల—మేమును బ్రహ్లాదునియనువర్తులము గావున నిలువఁబడుచున్నాము.
(అట్లేచేయును.)

చండా—ప్రమాద మాపాదించినది గదా! సరే! ప్రథమతప్పితముగా మే
మోర్చుకొన్నాము; గావున అందఱును గూర్చుండుఁడు (అట్లు చేయును.)
పాఠములు చదువుఁడు చెప్పెదను.

బాల—చిత్తము. తీసితిమి.

చండా—చదువుఁడు.

"ఓంహిరణ్యకశ్యపాయనమః"

బాల—(అట్లే చదువును.)

ప్రహ్లా—"ఓం పరమేశ్వరాయనమః"

చండా—ప్రహ్లాదా! విరోధిపాఠములు మానవుగా? సరే! పద్యము చదువుము
చెప్పెదను.

మ. నిగమంబుల్ నిగమాంతముల్ నరులచే ♦ నిర్మాణమున్ జెంది యీ
జగతిన్ బర్వెను బాపపుణ్యపథముల్ ♦ శాస్త్రంబుశాసించు వే
రుగ రూపంబులు లేవు వానికిని నీ ♦ రున్ నిప్పులున్ లేనియా
భగవంతుండు గలండొ లేఁడొ నృపుఁడే ♦ ప్రత్యక్షదైవం బిలన్.

(బాలకు లందఱు చదువుదురు)

ప్రహ్లా—

క. ఆసకలాంతర్యామికి
భాసురత్రైలోక్యజీవ ♦ పాలనఖనికిన్
వాసవహృదయవిహారికిఁ
జేసెద జేజేలు భక్త ♦ చింతామణికిన్.

(బాలకు లంద ఱిదే పాడుదురు.)

చండా—అదియేమి? ప్రహ్లాదా! అల్లరి చేయుచున్నాఁడవు.

ప్రహ్లా—నాపాఠము నేను జదువుకొనుచున్నాఁడను.

చండా—ఓ బాలకులారా! నిశ్శబ్దముగ నుండుఁడు (అట్లు చేయుదురు.) పుటను ద్రిప్పి మఱియొకపద్యమును జదువుఁడు. ప్రహ్లాదా! ఈసారినీవుసరిగాఁ బాఠము చదువకుంటివా తప్పక శిక్షితుఁడవయ్యెదవు. నీమూలమున నీపిల్లలుగూడఁజెడు చున్నారు.

ప్రహ్లా—అనుకూలమార్గమున సంస్కరించుకొనుఁడు.

చండా—

ఉత్సాహవృత్తము. రాజె మనకు దైవ మనఁగ ♦ రాజభక్తి సలిపి ని
ర్వ్యాజభాగ్యపదవిఁ బొంది ♦ రహి సుఖింపవచ్చు నం
భోజదళవిలోచనుం బ్ర ♦ పుణ్యమతిని వేఁడినన్
యోజఁ జెడు నొకింత ♦ యున్ బ్రయోజనంబు లే దిలన్.

(ప్రహ్లాదుఁడు తప్పు అందఱుచదువుదురు.)

అదే వచ్చువఱకు వల్లింపుడు.

సేవకుఁడు—(ప్రవేశించి) అర్యులారా! హిరణ్యకస్యపమహారా జీలేఖ మీ కొసంగఁ బంపెను. (అని యిచ్చును.)

చండా—(పుచ్చుకొని చదివి) సరే! నీవు పొమ్ము. (అట్లు చేయును.) ఓబాలకులారా! నేఁడు మహారాజుగారు పాఠశాలకు విచ్చేయుచున్నారు మీరలు సరిగాఁబరీక్షలనియ్యవలయును.

బాల—(చంకలు కొట్టుకొని తమలో) నేఁడు మన కనేకభక్ష్యములు బొమ్మలు, దుస్తు లాదిబహుమానములు సమృద్ధిగా దొరకును.

చండా—ప్రహ్లాదకుమారా! మీతండ్రి యగుమహారాజు రానున్నవాఁడు వానికడ నీహరిభక్తిగీతములు పాడకనాచెప్పినపద్యార్థములు భాషింపుము. నామాట వినుము. దండ్యుఁడవు గాకుము.

ప్రహ్లా—దోషదూషితము లైనమీప్రబోధంబులు నే నేరాజుకడనైనను సరే నా నోటవచింప నోపను.

చండా—అట్టివి మే మేమినేర్పితిమి ?

ప్రహ్లా—నేర్పెడివన్నియు నట్టివే.

మ. భగవంతుం డనువాఁడు లేఁడఖిలమున్ ♦ భ్రాంతిస్వరూపంబు లీ
నిగమంబుల్ నిగమాంతభాష్యచయముల్ ♦ నింద్యార్థముల్ కావునన్
జగతీనాథుఁడె దేవుఁ డీప్సితము లీ ♦ జాలున్ సుఁడీ యంచు నీ !
తగునే తప్పులు నేర్ప బాలకులకున్ ♦ దర్కింప విప్రోత్తమా.

(తెరలో)

హే మహారాజాధిరాజా! త్రైలోక్యవిజయకీర్తిమార్తాండమండలా! ప్రచండ తేజోజ్జ్వలానంతబ్రహ్మాండమండలాధినాథా ! ఓహిరణ్యకస్యపమహారాజ రాజచంద్రా ! సాంద్రగుణవిజితమహేంద్రా ! పరాక్.

చండా—ఓహెూ ! మహారాజు విచ్చేయుచున్నాఁడు. అదే వందిమాగధులు జయ జయారావంబులు పూరించికోలాహలము సేయుచు రాజాగమనముఁ దెలుపుచు వచ్చుచున్నారు.

హిరణ్యకస్యపుఁడు—(మంత్రిసామంతరాజులతోఁ బ్రవేశించి) గురుపుత్రులారా ! నమస్కారములు.

చండా—జయము, జయము మహారాజా !

(అందఱు నాసీను లగుదురు.)

హిర—నాయనా ! ప్రహ్లాదకుమారా ! ఇటు రమ్మ.

ప్రహ్లా—(వెళ్లును.)

హిర—(కూర్చుండఁ బెట్టుకొని) బాలకులారా ! మీలో మాప్రహ్లాదునితోఁ జదువు కొనువార లెవ్వరు ?

బాల—(లేతురు.)

చండా—నీవు చదువుము.

బాల—

ఉ. కర్తకు సర్వహర్తకు జ ♦ గంబుల నిట్టటు లూఁపఁజాలు సం
వర్తకు ధూర్తవర్తనవి ♦ నాదవివర్తకు బూర్వదేవసం
స్కర్తకు యజ్ఞధర్మహత ♦ సద్మవినర్తకు నాకలోకవై
హర్తకు మంగళంబు విజ ♦ యం బగు రాక్షసలోకభర్తకున్.

క. మంగళము హేమకస్యప
శృంగారపదాంబుజాత ♦ శేఖరములకున్
మంగళమునాకనాకపు
లంగడ తేర్చెడు మహాబ ♦ లప్రతి భునకున్.

(అందఱు కర తాళములను జేయుచున్నారు.)

హిర—కూమారా ! నీ సహాధ్యాయులకీ రత్నాభరణాంబరములు, పుస్తకములు, ఈచిత్రపటములు, ఫలములును బంచి యిమ్ము.

ప్రహా—అట్లే యిచ్చెదను. (అని పంచి యిచ్చును )

హిర—పుత్రా ! నీయొజ్జలు నీ కేమినేర్పిరో ఆగ్రంథార్థములు నానందముగఁ జదివి యీవీనులకు విం దొనరింపుము.

చండా—(స్వగతమున) అయ్యో ! ఏమి విపత్తు దెచ్చిపెట్టునో గదా !

ప్రహ్లా—

చ. ఒకఁడు నృపాలమౌళి మఱి ♦ యొక్కఁడు నేవకపాళి నుండు ;వా
రికి సుఖదుఃఖసంకలిత ♦ వృత్తము లొక్కటె చేసి చిత్రనా
టకముల నాడుచున్నప్రక ♦ టప్రతిభుం డగుసూత్రధారి కో
రిక లీడు మీకు మాకు బహు ♦ రీతుల రాజులరాజు గావునన్.

హిర—(స్వగతమున) ఈయర్థమురాజాధీరాజైననాకే వెల్లుచున్నది.(ప్రకాశముగా కుమారా! మఱియొక పద్యము సందర్భశుద్ధిగాఁ జదువుము.

చండా—(స్వగతమున) ఓహో ప్రమాదమా ! ఏమియుపద్యములు దెచ్చిపెట్టెదవో గదా !

ప్రహ్లా—

ఉ. ఏమహనీయమూర్తి సృజి • యించె జగంబులు మూఁడొ మూఁడుకో
ట్లో మఱి జీవరాసులు స • మున్నతి నెన్పదినాల్గులక్షలో
యేమొ యెఱుంగ నన్నివసి • యింప నొసంగి విహారహారమం
దేమర కిచ్చునట్టిపర • మేశ్వరుఁ డిచ్చుత నీప్సితార్థముల్

హిర—ఓరోరికులద్రోహి ! ఇవి యేమిరా ! ఈలాటిపద్యములు నీ కెట్లు వచ్చినవి ? నీయొజ్జలు నేర్చిన దిదియేనా ? ఏది మఱియొకటి చదువుము.

ప్రహ్లా—

శా. వ్యాలోలాక్షులపై సువర్ణములపై • నైశ్వర్యవర్గంబుపై
బాళిన్ నిల్పి నిరంతరం బవనిపైఁ • బాపంబులన్ సల్పి మా
యాలోలత్వము నొంది దేహములపై • వ్యామోహమున్ వీడ లే
కీలీలన్ జెడనేల నేల హరి స • ర్వేశున్ బ్రశంసింపకన్ ?

హిర—బాలు నోరుమూయుము. ఔరా ! గురుపుత్రు లెంతద్రోహము చేసిరి ! నా వైరిపాఠములు లెస్సగఁ గరిగి పోసిరి.

ఆ. గీ. నాధనంబు దినుచు • నాపుత్రుఁ జెఱుపుట
కంటె ద్రోహ మింకఁ • గలదె ? ధరణిఁ
పాలుత్రాఁగి రొమ్ము • పై గ్రుద్ది పోయెడు
కడుకృతఘ్ను నట్లు • గాదె తలఁప.

ప్రహ్లా—నాయనా ! పరమేశ్వరుఁ డన్న నేల నసహించుకొనియెదవు? నీ కాతఁడు వేల్పుకాఁడా ?

చ. హరిపరమేశ్వరున్గొలువ • వక్కట ! చిత్రమదెన్ని నాళ్లు మం
దరగిర నొంటికాలిపయి • ధారణ నిల్చిననాఁడు గాత్రవ
ల్లరిపయి వల్మికంబులు ప • లాశలతల్ వడిఁ జుట్టుకోవె నీ
వెఱుఁగని యర్థముల్ గలవె • యేను వచింప హరిప్రబోధముల్.

హిర—ఓరి మూర్ఖుడా! ఆ పరమేశ్వరుఁడు మాకు మహాశత్రువు. వానిమాట తలపోయుట కేవల మసమంజసము.

ప్రహ్లా—(విన్నఁబోవుచు స్వగతమున) పరమేశ్వరునితో నీతని కేమివైరము? ఈతనికి వరప్రదాత యెవ్వరు? ఎవనిఁగూర్చి యీతఁడు తనకాలమును వ్యయము సేసి గిరిదరీటముఁల దిరుగాడి యున్నాఁడు!

హిర—భార్గవులారా!

ఉ. నేరఁడు నీతిశాస్త్రంములు ♦ నేరఁ డొకింతవివేక మట్టినా
కూరిమిపుత్త్రునిన్ జెరుపఁ ♦ గోరిరి నాదువిరోధిశాస్త్రముల్
నేరిపి; మిమ్ముబోటి జన ♦ నింద్యులు గల్గరు ధాత్రిపైని నీ
దారుణ మెందునుం గలదె ♦ దైత్యుఁడు చక్రికి మ్రొక్కు టాదిగన్.

చండా—రాజేంద్రా! ఈలీల నేల మాపై నిందలు మోపెదవు? భార్గవు లెట్టివారలో నీవే యెఱుంగుదువు.

చ. హితులము మీపురోహితుల ♦ మేము భవద్ధితమాచరించునా
శ్రితులము గాని వైరిజన ♦ సేవ్యులమే దనుజావనీంద్ర నీ
సుతు నిటుపాడుసేసి మద ♦ సుప్తముతో దినుచున్నకూటిలో
ధృతమతి మన్నుపోసికొన ♦ నెంచెద మే పరు లెన్ని చెప్పినన్.

మ. చిరకాలమునుండి భార్గవు లవి ♦ చ్ఛిన్నంబుగా మీకిలన్
వరసౌభాగ్యపదంబు గల్గుటకునై ♦ భావించి దీవించి సం
బర మేపారఁగస్వస్తి చెప్పుచు సదా ♦ వర్తించునాలాటిమ
మ్మరయన్ జాలవు, మేమొ నీసుతుఁడొనిం♦దార్హుల్ విలోకింపుమా!

హిర—మీ నిర్దోషిత్వ మింతగాఁ బ్రకటింప నక్కరలేదు. ఎవరు కాదందురు!

మ. పసివాఁడూ ర్జితసత్వ సంపదుఁడు సౌ ♦ భాగ్యాభిధానుండు లా
లసుఁ డీపంచశరద్వయస్కునకు నా ♦ లాపంబులే రావు నా

యసమానప్రతిపక్షుపక్షము నుప ♦ న్యాసంబులన్ సల్ప నే
పసరుల్ వ్రాసిరొ మందులే యిడిరొ మీ ♦ ప్రాగల్భ్యమేపారఁగన్.

ప్రహ్లా—నాయనగారు! ఏపాప మెఱుంగనిగురువుల నేలయెత్తిపొడిచెదరు?

చండా—రాజా! శూలముల కంటె వాఁడియైన మాటలచే మమ్మేలబాధించెదవు? ఏకత్తి నిర్జరేంద్రాది దిక్పతులను బలిపెట్టుటకు నూరబడుచున్నదో దానిని మామస్తకములపైఁ దౌలుతఁ బ్రదర్శింపుము; లేదా నీకిష్టమైనదండనము విధింపుము. నేఁడే లేచిపోయెదము.

తే. గీ. భార్గవులు పూర్వదేవతా ♦ వర్గములకు
గురువు లనువాసినేఁటితో ♦ గ్రుంకిపోయె
నోటుమాట వచ్చెను బిరు ♦ దూడె నింక
బ్రతుకనేటికి జీవచ్ఛ ♦ వంబు లగుచు?

హిర—సరే! ఇంకనైక నీకుఱ్ఱవానిని బాగుచేయుభారము మీయందున్నది.

తే. గీ. తల్లిదండ్రులు కనిపెంచి ♦ తమిని మించి
విద్దెకై యొజ్జలొద్దను ♦ విడచినపుడు,
బాగు లోగులభారంబు ♦ వారిదెకద
యోడభారంబు నడుపువాఁ ♦ డూనినట్లు.

చండా—శక్తివంచన లేకుండఁ బ్రయత్నించెదము.

హిర—(అందఱతో నిష్క్రమించును.)

చండా—హతవిధీ!

ఆ. గీ. రిపులఁ గూడలేదు ♦ నృపసూతిఁ జెరుపంగఁ
గపటబుద్ధి విద్య ♦ గఱపలేదు.
రెం డెఱుంగకున్న ♦ ఱేఁడు మాపైఁబడెఁ
గేలిసేయ నగునె ♦ కాలమహిమ.

ఓ ప్రహ్లాదకుమారా ! నీకుమ్మర మెంత తెచ్చినదో! చూచితెవా ? మే మెంత బ్రతిమాలిననుమామువ్పు గడిపితివిగావు. ఇంకనైన నీతండ్రి యగు హిరణ్యకశిపుని భగవంతునిగానుపాశింపుము. ఏల ననియెదవేమో !

చ. వెఱతురు సూర్యచంద్రులు బ్ర • వీణతతోఁ బొడనూప; వర్షముల్
గురుప సురేంద్రుఁడున్ వెఱచుఁ • గొంకునుగాలి కరంబువీవ ; ఖే
చరు లలవ్యోమవీథిఁ జన • జాలరు రాక్షసరాజు; గాంచి కే
సరి గలఁగన్న దంతివలె • సర్వజగంబులు కంప మొందెడున్.

ప్రహ్లా—అయిననగుఁగాక ! షడ్భావవికారభూయిష్టు లైనశరీరధారులకునీశ్వరత్వము పొసంగుటకేవలము విరుద్ధధర్మము. ఏ మహారాజు నుద్దేశించి ప్రాణేంద్రియ భ్రాంతితో భగవంతుఁడగుపరమేశ్వరునిగా నుపాసించుచున్నారో,అట్టిరాక్షసేశ్వరుఁడొక యిల్లుసృష్టిలోనిపదార్థములు లేక వేరువస్తువులచే నిర్మింపఁ గలఁడా ? వేరువస్తువులు దినిజీవింపఁగలఁడా ?

క. సకలాంతర్యామియు ని
ర్వికలుఁ డతీంద్రియుఁడు సర్వ • విశ్వాకృతుఁడ
య్యకలంకుఁడె పరమేశుఁడు
ప్రకటింపఁగ జీవులట్టి • వారలె ? చెపుమా !

కావున ఈరాజు దితితనూజుఁడు గాని అయోనిసంభవుఁడైన పరాత్పరుఁడుగాడు. వీనునిపాశించుటకన్న వేరుపాప మింకేముండును ?

చండా—ప్రహ్లాదా! ఇంకనీకెన్ని చెప్పినను నీబుద్ధిమరల్పఁజాలము. మే మొటులో మా నెత్తినున్న భారమును దింపుకొనియెదము. ఆవల నీప్రాప్తము.

ప్రహ్లా—మీరు సుఖులై యుండిన నాకంతయే చాలును. నానిమిత్తము మీ రూహింపవలదు.

ఆ. గీ. దేవదేవుఁడైన ♦ దివ్యసుందరమూర్తి
దీనరక్షకుండు ♦ దిక్కు నాకుఁ;
బ్రాణవిత్తములకు ♦ నాశించి నృపులను
గొలిచి బ్రతుకనెపుడు ♦ కుజనవృత్తి

చండా—నాయనా! నీవెందుకీరాక్షసకులంబునఁ బుట్టితివోకాని ఏదియోయొక గొప్పవిపరీతము పుట్టనున్నది ?

మ. త్రిజగంబుల్ పొడిచేసిపుత్తునని తాఁ ♦ దీవ్రప్రతాపంబుతో
విజిగీషుం డయి లెక్కసేయఁడు మహా ♦ విష్ణున్ విధిన్ జిష్ణునిన్
భుజదర్పంబున నట్టినీజనకుతోఁ ♦ బోరాడుచున్నావిదే
నిజమైనం బ్రళయంబొ లేక శుభమో ♦ నిక్కంబుగా రాఁదగున్.

బాలకులారా! మీరందఱిండ్లకుఁ బొండు. ప్రహ్లాదా! నీవును బొమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

# దానవవధ.

## చతుర్థాంకము.

రంగము—సభామంటపము.

(హిరణ్యకశ్యపుఁడు, మధుప్రియుఁడు, నర్మసఖుఁడు ప్రవేశించి యుందురు)

హిర—మధుప్రియా! మనదండయాత్రముగిసినవి గదా! ఇంక నేమైన జయింప వలసినవి గలవా?

మధు—దానవకులమండనా!

చ. గెలిచితి వెల్లదేశములు ♦ కేలను గత్తి ధరించి యుష్మదీ
యలసితరాజ్యమం దరిచ ♦ యంబులుగల్గరు ముజ్జగంబులన్
నిలిపితి వాజయాంకములు ♦ నీదుమహత్తరకీర్తిగీతముల్
తలలను వంచి పాడెద రు ♦ దారత వైరినృపాలకన్యకల్.

మఱియు.

తే. గీ వనదములయందుఁ గేకార ♦ వంబులందుఁ
గోకిలములందు బలుకొండ ♦ గుహలయందు
భృంగములయందు గంధర్వ ♦ వీణెలందు
నిను భజించెడుపాటలే ♦ వినఁగ నయ్యె.

నర్మ—అగునగును.

మ. భవదీయోజ్జ్వలకీర్తి కన్య దెసలన్ ♦ బ్రత్యర్థిరాజన్యవై
భవసామ్రాజ్యరమోర్కబింబములకున్ ♦ స్వర్భానుచందంబునన్
గవిసెన్ దిక్తటకుంభికుంభములపైఁ ♦ గాలూది నాట్యంబు సే
య విడంబించె సురాంగనాశ్రుకలితా ♦ ర్తారావముల్ మ్రోయఁగన్.

కాని యొక్కటిమాత్రము కొఱంతగా నున్నది.

హిర—అది యేమి?

నర్మ—మఱియేమి ? ప్రహ్లాదుఁడు.
హిర—వాఁ డింకను దీర లేదా ?
నర్మ—ఆతఁడు తీరనచో మనలోటు లన్నియుఁ దీఱిన వన్నమాటయే.

హిర—మధుప్రియా ! ప్రహ్లాదకుమారుని రావింపుము. వానివివేకమును బరీక్షించి చూచెదము.

మధు—చిత్తము దేవా ! (అని కంచుకి నవలోకించి సంజ్ఞ వేయును.)
(కంచుకితోఁ బ్రహ్లాదుఁడు ప్రవేశించును )

ప్రహ్లా—చేతులు ముకుళించి

ఉ. ఓపరమేశ్వరా ! నిఖిల ♦ మొక్క తెఱంగున నిండియున్ననీ
రూప మెవం డెఱుంగు ? నపు ♦ రూపపుఁదేజము నీది యోజగ
ద్వ్యాపక ! దీనరక్షక ! ద ♦ యారసపూరితసర్వలోకబం
ధూ ! పరమాత్మ ! నాహృదయ♦తోయదమందు వసింపు మీశ్వరా!

(అని తండ్రి కెదురుగాఁ బోవును.)

హిర—(లేచి) నాయనా ! ప్రహ్లాదకుమారా ! ఇటు రమ్ము. (అని యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని ముద్దాడి.)

తే. గీ. నిన్ను గర్భాన మోయుచు ♦ నిండుచూలి
నున్న నీతల్లిఁ జెఱఁగొని ♦ నిన్నుఁ గన్న
వెనుక నినుఁ జంప నెంచె నా ♦ విబుధవిభుఁడు
బావునకు దప్పి జన్మించి ♦ నావు తండ్రి !

(అని యొకయాసనంబునఁ గూర్చుండఁబెట్టి)

చ. వరములబిడ్డ ! నీవు గుణ ♦ వర్యుఁడవై బహుశాస్త్రమర్మముల్
కరము పఠించి తంచు బలు ♦ కన్ విని యుంటిమి పెక్కుకోవిదుల్
పరఁగ వచింపు మందుఁగల ♦ పద్యములన్ జెవి కింపు నింప నీ
గురువరు లేమి నేర్పిరో ని ♦ గూఢకళాకలితార్థసంపదన్.

ప్రహ్లా— చ. చదివితి నెల్లశాస్త్రములు ♦ చర్వితచర్వణమట్లు వేదముల్
చదివితి శబ్దశాసనవి ♦ చారములందు రహస్యమంతయున్
జదివితి పాపలోకసహ ♦ జప్రతిబంధకమైనతత్వమున్
జదువుల కందరాని దొక ♦ సర్గము నేఁడు పఠింతు నెంతయున్.

హిర —నాయానా ! ఆసర్గలోని కొన్నిపద్యములు చదువుము.

ప్రహ్లా—శా. అక్రోధంబు జితేంద్రియత్వమును శాం ♦ తారూఢభావంబుతో
జక్రిన్ సర్వచరాచరోజ్జ్వలజగత్ ♦ చక్రిన్ సదాసాధుని
ర్వక్రిన్ విక్రమపాదపంకజకళా ♦ వక్రిన్ గుణాభాసదు
ర్నక్రగ్రాహవిదూరు చారుహరి నా ♦ రాధింప కర్జం బగున్.

హిర—ఏమేమి ? చక్రిని నీ వింకను మరువ లేదా ?

ప్రహ్లా—అది యెట్లు సంఘటించును ?

సీ. కలుషజీమూతసం ♦ ఘాతంబులకు మారు, తంబు శ్రీహరినామ ♦ తారకంబు
రాగరోషాసక్త ♦ రోగావళికి నౌష, ధంబు శ్రీహరినామ ♦ తారకంబు
దారిద్ర్యదుఃఖని ♦ దాఘంబులకు వారి, దంబు శ్రీహరినామ ♦ తారకంబు
వ్యాకులకలితవి ♦ పన్మృణాళికి ద్విర, దంబు శ్రీహరినామ ♦ తారకంబు

భక్తజనచాతకములకు ♦ వానకారు
సొరుసొంపారు హరినామ ♦ తారకంబు,
యోగిహృదయోత్పలముల కిం ♦ దూదయంబు
చారుచరితంబు హరినామ ♦ తారకంబు.

హిర—ఓరీ ! కులద్రోహి ! ఎంతని చెప్పినను నిన్నావహించిన విష్ణుపిశాచమును గీర్తించుట మాన కున్నాఁడవు, (చండామార్కులవైపు తిరిగి) గురుపుత్త్రులారా ! మీశిక్ష కీతఁడు లోఁబడ లేదా ?

చండా—లేదు మహారాజా !

హిర—ఏల కాలేదు ?

చండా—త్రిలోకభీకరాకారుఁడవై ననిన్నే లెక్కసేయనప్పుడు మ మ్మీతఁడు సరకుసేయునా ? మమ్ము నోరెత్త నిచ్చునా ? మావల్లనై నంతవఱకు విద్యాప్రవీణుని జేయుటకే సమకట్టితిమి.

సీ. చదివించితిమి వేద ♦ శాస్త్రపురాణంబు, లదలించితిమి నీదు ♦ పదము లాన
వచియించితిమి మహా♦భాష్యపర్యంతంబు, వినిపించితిమి నీదు♦విజయకీర్తి
ఆడించినాము శ ♦ బ్దానుశాసనములఁ బాడించినాము నీ ♦ వైభవంబు
జూపించినాము ఛం♦దోపద్ధతులనెల్ల, మఱపించినాము నీ♦యరులమహిమ

మంచి విద్యలన్నియును నే ♦ ర్పించినాము
కులసముచితక్రియార్థముల్ ♦ పలికినాము
సారమతి జేసినాము మా ♦ శక్తికొలఁది
యసురులేసాక్షి మాయంత ♦ రాత్మ సాక్షి.

(ఇది చెఱియొకపాదము చదువుదురు.)

మధు—సత్యము. సత్యము. గురుపుత్త్రులు నిర్దోషులు. ఈదుర్బుద్ధి వ్యాప్తోపుని యందేపుట్టినది.

చండా—అది ముమ్మాటికిని నిజము మహారాజా ! ఈతనిసంగతి మే మేమనిచెప్పఁ గలము ? దానవవైరులయందు ధృఢవిశ్వాసము గలిగి మ మ్మెవరిని సరుకుసేయ కున్నవాఁడు. ఈతని కున్నమొండిధైర్య మేదియో మేము నిరూపింపఁజాలము.

హిర—వీనిని వారలు రక్షించెదరని యూహ యున్నది గాఁబోలును.

చండా—ఏమో కాని వీనిచర్య యెంతయు వింతగా నున్నది.

హిర—అది యేమి వింత ?

చండా—మ. పగలున్ రేయి నెఱుంగునో యెఱుఁగఁడో ♦ బద్ధాంజలిన్ నెత్తిపై
నిగుడంజేసి వివిక్తసక్తమతితో ♦ నిర్నిద్రభావంబుతో
సగుణుం డీశ్వరుఁ డాదిదేవుఁడు మహా ♦ సన్న్యాసి సత్సంగుఁ డా
భగవంతుండు నతీంద్రియుం డని వడిన్ ♦ బ్రార్థించుసానందుఁడై.

మధు——రాజా ! ఈతనిచర్యలు నేనును ఎఱింగియున్నాను. దనుజవదాన్య గుణములు లేశమయినఁ బొడసూపవు.

మ. విషయాసక్తుఁడు గాడు కామినులపై ♦ విశ్వంబుపై దత్కళా
విషయంబుల్ కలనైన నెంచఁడు హరిన్ ♦ విశ్వాత్మకుం డంచుఁదా
ఋషిలీలన్ జపియించుఁ గాని దనుజ ♦ ద్వేషున్ విసర్జింపఁ డీ
విషవృక్షంబు జనించె నీకడుపునన్ ♦ వీక్షింప దైత్యోత్తమా !

హిర——మీవాక్యములయం దింకను నాకు విశ్వాసము రాలేదు. ఎవనియం దీ ప్రహ్లాదుఁడు మానసమును లయముసేసి యవిచ్ఛిన్నభక్తినిభజింపుచు భాషింపుచున్నాఁడో యట్టి మహావిష్ణువు మనపగవాఁ డని పూర్వోత్తరకథా విధానంబులతో నెవ్వరును నొక్కి చెప్పకుండుటచే నీతఁ డిట్లు భ్రాంతుఁడై చలించుచున్నాఁడని నే నూహించుచున్నాను.

చండా——అట్లెన్నఁడును భావించుటకు వలను పడదు. ఈతఁడు వయస్సుచేతఁ జిన్న వాఁడైనను బెంకితనమందు దేవాంతకులు గూడఁ జాల రేరు.

ఉ. కొండలు పిండిగా నమలి ♦ క్రుంకెడుసూర్యుని లేపనెత్తి వే
దండములన్ దిగంతముల ♦ దారిని మాన్పి యదల్చువీరులు
ద్దండులు చండశాసను లు ♦ దారులు నుండిన నుండవచ్చు బ్ర
హ్మాండమునందు లేఁడు భవ ♦ దాత్మజుబుద్ధి మరల్పుహారుఁడున్.

మార్క——నేనును అట్లే శపథము చేయుచున్నాను.

ఆ. గీ. విధుఁడు గ్రాలుచోట ♦ బుధుని బెట్టఁగవచ్చు
నబ్ధియందు మృగము ♦ లడవి మీలు
గలుగఁ జేయవచ్చుఁ ♦ గాని నీపుత్త్రుని
మతము మాన్చు మేటి ♦ మగఁడు లేఁడు.

నర్మ——అవమాన మవమానము. మేటివీరులని పేరుమోచిన దానవు లొక్కకుఱ్ఱ వాని మతము మరల్ప లేరఁట.

సీ. అలమందలరీతి ♦ నమరసేనను గాన, నాంతరంబులఁ దోలి ♦ నట్టివారు
అష్టదిక్పతులను ♦ హడలగొట్టియు వికా, వికలట్లు పరచిన ♦ వీరవరులు
శచివెంటఁ గన్నీరు ♦ జార్చుచు రాసురేం, ద్రుని ద్రోసి వీడుగై ♦ కొనినవారు
బ్రహ్మాండములు బీట ♦ వారినట్టుల తపం, బాచరించిన మహా ♦పుణ్యజనులు

నిఖిలరాజన్యమకుటమా ♦ ణిక్యదీప్త
పాదులై నట్టిదనుజాధి ♦ పతులుమీరు
బాలు నజ్ఞానమును మాన్పఁ ♦ జాల రన్న
కొఱఁత వేయేండ్లకైనను ♦ దొఱఁగఁ గలదె ?

హిర—నే నొక్కత్రుటిలో మరలించెదను జూడుఁడు.

చండా—అది యసంభవమని తలంచెదను.

హిర—పుత్రా ! ప్రహ్లాదా ! నీవు దలపోసెడునారాయణుఁడు మహాపాపియు దుర్గుణ భూయిష్ఠుఁడును నై యుండ వానిచరితమును గొనియాడుట మనకుఁ గేవల మసంగతము. కావున వానిని నేఁటినుండి మఱచి పొమ్ము.

మధు—నాయనా ! నీతండ్రిమాటలను విని జైవాతృకుఁడవు కమ్ము. ఈ పేరాజ్య మంతయు నీచేతిలోనుంచుటకు సంసిద్ధుఁడై యున్న నీతండ్రికన్న దైవ మెవరుగలఁడు ?

హిర—ఆవిష్ణువు దైత్యారి యనియు, దానవదమనుఁ డనియు బిరుదములు దాల్చి మమ్మెలోకంబునఁ గూడ నిలువనీయక తరుముచుండుట నీ వెఱుంగవు గాఁబోలును

మ. అపరాధం బొకటైన సేయనిహిర ♦ ణ్యాక్షుఁ మహాశూరునిన్
గపటం బేర్పడఁ ద్రుంచినాఁడు ఖలుఁడై ♦ కార్పణ్య మేపార మ
మ్మపవాదంబుల ముంచినాఁ డపుడు మా ♦ యామోహినీవేషమం
దపకారంబులు పెక్కు సేసినహరిఁ ♦ ధ్యానింపఁగాఁ బాడియే ?

ప్రహ్లా—అయ్యా ! ఇది యేమి సంగతి ?

చ. హరి యపకారముల్ సలిపె ♦ నంచు వచింపితి విట్టివింత లీ
ధరణి పొసంగునే యతఁడు ♦ దారుఁ డతీంద్రియుఁ డాదిజాతుఁ డీ
నరసురయక్షరాక్షసగ ♦ ణంబులఁ జేసి యజాండమంత సుం
దరతరలీల నింపిన వి ♦ ధాతకుఁ ద్రాతకు నీకు వైరమే.

హిర—ఆవైర మిప్పటిది గాదు ; చిరకాలము నుండి వచ్చు చున్నది.

ప్రహ్లా—నాయనా ! భగవంతునితోఁ జిరకాలవైర మనుచున్నావు. వాఁడు మన కెన్ని మేళ్లు గలిగించు చున్నాఁడో చూడుము.

ఉ. పన్నులు లేనినాఁడు చను ♦ బాల నొసంగెను పన్ను లిచ్చి దా
నన్నము బెట్టినాఁడు నవ ♦ యౌవనమందు విచిత్రభోగముల్
కన్నులఁ జూపినాఁడు తన ♦ కన్న మహాత్ముఁడు లేఁడటంచుఁ దా
వన్నెలు దిద్దినాఁడు నిను ♦ వంటిబలాఢ్యులఁ జేసి భూమికిన్.

హిర—అది యంతయు సహజపరిణామము.

ప్రహ్లా—సహజపరిణామములు వానియంతర్భూతములు కావా ? వాని నుపాసించిన నెన్నియేనియు సమకూడు చుండుట లేదా ? అందెవ్వరైన పాలుగూడఁ గలరా ? ఇది విచారింపవలసినది గాదా ?

హిర—ఐహికంబు లన్నియు నేను సమకూర్పఁ గలను.

ప్రహ్లా—ఆముష్మికములో ?

హిర— అవి కేవలము మిథ్యాస్వరూపములు.

ప్రహ్లా—నీవలనఁ గానివి మిథ్యాస్వరూపములా ?

హిర—ఏది నావలనఁగాదు ? సమస్తమున కేనే యీశ్వరుఁడను.

ప్రహ్లా—అది యెట్లు సరిపడును ? దానవుల కీశ్వరుఁడవు కావచ్చును.

హిర—అందులోఁగూడ సంశయ మున్నాదా ?

ప్రహ్లా—దానవుల కధిపతి వగుట కేయాక్షేపణములు లేవు ; గాని నీవుమాత్రము పరమేశ్వరుఁడవు గావు.

ఉ. జీవనగోలమం దసులు ♦ జేరనినాఁడును కాళ్లసేతులన్
జేవలు రానినాఁడు గడు ♦ చిన్నవయస్సున లేనియట్టిమా
యావిలచిత్తవృత్తి యిపు ♦ డక్కట కాలము వచ్చినప్డు నే
నే విలయోద్భవస్థితికి ♦ నీశ్వరుఁ డంచువచింపఁ జెల్లునే ?

హిర—నీవు కేవలము పామరుఁడవు. విలయోద్భవస్థితికి కర్తను నేనుగాక మఱి యెవ్వరు? నన్నాశ్రయించినవార లఖిలైశ్వర్యములతోఁ దూఁగుచున్నారు. నా కాగ్రహపాత్రులు నానేత్రప్రసారమున దహ్యులై భస్మీభూతులగు చున్నారు నాశాంతమున నన్నిటికిని స్థితి యాపాదించుచున్నది.

ప్రహ్లా—నిన్ను సృజించినవా రెవ్వరు ?
హిర—ప్రకృతి.

ప్రహ్లా—ఏప్రకృతికి నీవు వికృతియో అపరిణామముల కధిష్ఠానచైతన్యమునకు నైననీవు వడంబడియెదవా ?

హిర—ఒడబాటు మానైజమునందే లేదు.
ప్రహ్లా—నీ నైజమునందు కొన్ని కలవు కొన్ని లేవు. కావున నీ వసంపూర్ణుఁడవు. సంపూరైశ్వర్యమునకుఁ బరమేశ్వరుని భజింపవలసి యుండును.

హిర—నా కేయైశ్వర్యము కొఱంత యున్నది ?
తే. గీ, నగలు వలెనన్న మందర ♦ నగము గలదు
కలిమి వలెనన్న మూడులో ♦ కములు గలవు
స్త్రీలు వలెనన్న దేవతా ♦ స్త్రీలు గలరు
కొఱత యనుమాట గలుగ దే ♦ కోశమందు.

ప్రహ్లా—అది యంతయుఁ బరమేశ్వరుని దయాలబ్ధమయినదేయని భావింప వలయును.

సీ. ఐశ్వర్యములఁ దేలి ♦ యాడఁగావలెనన్నఁ, జక్రినారాధింపఁ ♦ జనఁగవలయు

త్రిజగంబులకు గెల్చి ♦ తీరఁగావలెనన్న, సొంపార నభవు న♦ర్చింపవలయు
అజరామరత్వంబు♦నందఁగావలెనన్న, బరమేశ్వరుని గొల్చి♦పడయవలయు
ఆసముద్రాంతరా♦జ్యము కావలయు నన్న, భగవంతుఁ డగుహరిఁ♦బాడవలయు

నరసురవ్రాతములచేత ♦ నతులఁ బొంద
వలయు నన్నను విష్ణుని ♦ గొలువవలయుఁ
కానిచో రాజ్యములు గాని ♦ కలిమి గాని
రాదు రారాజు లిడుటకుఁ ♦ గాదు తండ్రి.

హిర—ఇది నీపరమేశ్వరుఁడేగాని మే మొసంగలేమా ?
ప్రహ్లా—నీ వొకవేళ నేదేని యొసంగినను అది పరమేశ్వరప్రసాదమే యగును.
హిర—ఇది యెక్కడినీతి ?
ప్రహ్లా—రాజనీతియు నిట్టిదే బంటు పొడిచినజయము రాజుపేరఁ బ్రకటింపఁబడుచున్నది.

హిర—ఔరా ! నేను నీహరిసేవకుఁడనా ? ఏమి యీదురాగతము ! నాసంగతి నీకేమియుఁ దెలియకున్నది.

ఉ. క్రూరకృపాణహస్తముల ♦ కుఁ వెఱగంది దిగంతనాథు లం
భోరుహసంభవాదిముని ♦ ముఖ్యులు వచ్చి మదీయపాదపం
కేరుహముల్ భజించెద ర ♦ కిల్బిషవృత్తిని నేను గాకిలన్
వేరుగ దేవుఁడుం గలఁడె ♦ నేనె జగంబులకెల్ల నీశుఁడన్.

చండా—సత్యము మహారాజా ! సత్యము. నీవే పరాత్పరుఁడవు. మాకు నీవేఁ నియామకుఁడవు. ప్రకృతిస్వరూపుఁడవు.

మంత్రి—నీకు వినా మా కన్నియు మిథ్యాస్వరూపములు. ఓహిరణ్యకశ్యపమహారాజా ! అన్నియు నీవే.
హిర—బాలకా ! ఇపుడైన నీవు నన్నుపాసింపుము.
ప్రహ్లా—నాయనా ! ముఖప్రీత్యర్థ మీకుక్షింభరులు నిన్నుఁ బరమేశ్వరునిగాఁ

బొగడి నంతమాత్రమున నీవు మోసపోయెద వేల ? నీవు శరీరధారుఁడవు. వాఁ డశరీరుఁడు ; వానికి వినా రెండవదియుపాసనీయము గాదు. నీవు చక్రవర్తివి. పరమేశ్వరుని ప్రతినిధివంటివాఁడవు. ఈప్రజను దరింపఁ జేయుభారము నీయందున్నది.

సీ. పగలు రే యనకుండ♦బ్రహ్మాండములు నిండి, క్రీడించుహరిఁ బాడు♦ఱేఁడుఱేఁడు
సకలాంతరంగుఁ డై ♦ సాగెడుసర్వేశుఁ, గొలువఁగా బోధించు♦గురువు గురువు
అనదలదిక్కు నా♦రాయణుం డని సదా, పూజింపు మనిచెప్పు♦బుధుఁడుబుధుఁడు
ఆదిమధ్యాంతము♦లన్నియు దానైన, పరమేశ్వరుని గాంచు♦బ్రతుకు బ్రతుకు

కోరి ధ్యానించువారిమ ♦ నోరథంబు
లిచ్చునచ్యుతుదరిఁ జేర్చు ♦ హితుఁడు హితుఁడు
పరమకరుణాళుఁ డీశుని ♦ భవ్యయశుని
దగనుపాసింపుమనియెడు ♦ తండ్రి తండ్రి.

హిర—మ. కొడుకా! యెంతటిమందబుద్ధి వలవై ♦ కుంఠండు దైత్యారి యె
వ్వఁడు నీ వెవ్వఁడు వానికిన్ మనకు సం ♦ బంధంబు లేనాఁడు రా
పడె నీ వేటికి మోసపోయెదవు నా ♦ వాక్యంబు మన్నించి యీ
పుడమిన్ దానవరాజ్యముం బడసి నన్ ♦ బూజింపుమా భక్తితోన్.

ప్రహ్లా—అందులకు నేను శిరసావహించు చున్నాను.

చ. జనకుఁడ నీవు పూజ్యుఁడవు ♦ సర్వవిధంబుల నీకుఁ దక్క వం
దన మొనరింపఁగాఁ దగిన ♦ దైవము లేఁడు, జగన్నియామకుం
డును పరమేశ్వరుండును గ ♦ డున్ బ్రియ మారసిప్రోచువాని నే
తనయుఁడు తల్లిదండ్రులను ♦ దైవము లట్లు భజింప నేర్చునో.

హిర—ఓరిపామరుఁడా! ఈప్రసంగంబు లెందుకు ? నన్నీశ్వరునిగా భజించి యీసిరులను గ్రహించుటకు నీకిష్టము లేదా ?

ప్రహ్లా—సిరుల కాసించి నిన్నీశ్వరునిగా నేనుపాసించినమాత్రమున నీకేమి లాభము ?

హిర—నీకైన లాభ మున్నదా ?

ప్రహ్లా—నాకాలాభము లగత్యము లేదు.

సీ. పరమేశ్వరుని గొల్చు♦భాగ్యమే కలిగిన, సిరు లస్థిరము లాస♦సేయు నెవఁడు
చక్రిదాస్యప్రభం ♦ జనములే కూడిన, భోగంబులకు మోస ♦ పోవు నెవఁడు
హరిపరధ్యానసం ♦ భరము చేకూరిన, విషయసౌఖ్యంబులు ♦ వెదకు నెవఁడు
విశ్వాత్మకుని జూచు ♦ విభవమే వచ్చిన, కామరోషంబులఁ ♦ గరఁగు నెవఁడు

పరమకల్యాణగుణుఁ డార్త ♦ రక్షకుండు
దొరకెనేనియు వెదకునే ♦ యొరుల నెవఁడు
సరసకుసుమాళిఁ బడసిన ♦ షట్పదంబు
జీర్ణతృణసంచయభ్రాంతిఁ ♦ జేరనట్లు.

హిర—నీవు మాటిమాటికి మాయందుఁ దిరస్కారభావముతో నధిక్షేపించి నీహరి నేబెద్దగఁ జేసిపాడుచున్నావు. పారుబోతైనయొకభీరుని నామ్రోల భయంబు దక్కి స్తోత్రపాఠంబులు చేయునీక్రౌర్యంబునకు సహింపవలసినపని లేదు.

ప్రహ్లా—నాయనా ! అట్లెన్నఁటికిని భావింపకుము. పరమేశ్వరుని ధ్యానింపుమన్న నందుఁ గ్రౌర్య మేమున్నది ?

హిర—వింటిరా ! సభ్యులారా !

చ. జనకుని లెక్కసేయఁడు ని ♦ జంబుగ ముజ్జగముల్ జయించుశౌ
ర్యనిధిని యష్టదిక్పతుల ♦ నాజిని నోర్చి జయించినట్టిధీ
వనధిని నన్నుఁగాక మఱి ♦ వాసవుఁ డెందుఁగలండు వీఁడు నా
తనయుఁడు గాఁడు శాత్రవుఁడు ♦ దానవులం జనియింపఁ బోలునే.

చండా—అగు నది నిశ్చయమే.

చ. తనయులు విద్య నేర్చి తలి ♦ దండ్రులకున్ విహితంబుఁ గూర్చి వం
దనవివిధేప్సితార్చనవి ♦ ధానములన్ బరితృప్తిఁ జేసి మే
దిని మనుచున్న యాయువులు ♦ దీర్ఘసిరుల్ ఘటియించు లేనిచో
వనధి దహించుబాడబము ♦ భంగి కులంబు దహింతు పుత్త్రకుల్

నర్మ—దానవేశ్వరా ! ఈవృత్తాంత మెంతయు శోచనీయ మగునది. నీయాశ్వ రత్వము నీయాత్మజాతునిచేతనే ప్రతిపాదింపఁ బడకున్నప్పుడు, ఇంకఁబ్రజ లెట్లను మతించెదరు ?

తే. గీ. లోకములు గెల్చినావు సు ♦ శ్లోకి వగుచు
పుత్త్రకునిచేతిలో లొంగి ♦ పోతి విపుడు
ఇల్లు గెలువనివాఁడు ర ♦ చ్చేమిగెలుచు
ననుచు నిందింత్రు పగవార ♦ లన్నిదిశల.

హిర—అవు నది నిశ్చయమే. (ఆగ్రహముతో) ఓరీ ! ప్రహ్లాదా ! నిన్ననేకవిధం బుల బుజ్జగించి యెన్ని చెప్పినను నీ పెడవారి వీడ కున్నావు నాయీశ్వ రత్వ మూరకే స్థిరపడ లేదు. త్రిలోకంబులను, త్రిమూర్తులను, త్రికాలంబు లను, త్రినేత్రులను, త్రిపదంబులను జయించుటచే వచ్చినది.

ప్రహ్లా—సరే ! అన్నియును జయించితివి, గుణత్రితయమును జయించితివా ?
హిర—మాకవి యలంకారములు.

ప్రహ్లా—రాజస తామసంబు లేమి యలంకారము ? శుద్ధసాత్త్విక మలంకారము' పరమేశ్వరధ్యాన మలంకారము, సాధుపథ మలంకారము.
హిర—అవి నీపక్షమువారికి.

ప్రహ్లా—ఇందుఁ బక్షములతోఁ బని యేమి ? నీపక్షమువారందఱు రాజసతామ సవంతులై సర్వదా కలహములే జరుగుచుండును.
హిర—సరే ! నీమాటలు రెండుకక్షలుగా విడదీసినవి ; గావున నావిరోధికక్ష యందున్న నీవు దండింపఁబడవలయును.
ప్రహ్లా—నిర్నిమిత్తదండనము రాజున కయుక్తము గాదా ?
హిర—ఈనాప్రజ లందఱింవలె నీవును నన్నీశ్వరునిగాఁబాడక వేరొకమిథ్యా స్వరూపమును గలదని యనుమానించుటయే నిమిత్తము.
ప్రహ్లా—ఆయనుమానము నీ కేల తట్టలేదు ?

హిర—నేను నాకువిరోధిని గాను. విరోధదృష్టులతోఁ జూచినఁగాని యను మానములు పొడకట్టవు.

ప్రహ్లా—అటులైన నిజబుద్ధిని విమర్శించి చూడుము.

హిర—ఈప్రజలంత యవిమర్శకులా ?

ప్రహ్లా—నీవు చక్రవర్తివి. నీవలనఁ బోషింపఁబడువారు నీమాట లాడక మఱి యే మందురు ? అటులన్నచో నీముందల వారు నిలువగలరా ?

హిర—అయిన నీవు మాయందఱికన్న భిన్నుఁడవై వైరము సాధించుటకుఁ జూచు చున్నావు.

ప్రహ్లా—కాదు, కాదు. నాయనా ! నామాటల నొకింత విశ్వసింపుము. నేను నీకు విరోధిని గాను. నిన్నుఁగూర్చి వ్యాజస్తుతి సేయువారుచెప్పినచొప్పునని నీవీశ్వరుఁడవుకావు. నీ వట్లూహించుట కేవలము పాపహేతుకము. పర మేశ్వరుఁడు నామరూపక్రియారహితుఁడు. నీవు నామరూపక్రియాసహితుఁ డవు. వానివలె నాదిమధ్యాంతరహితుఁడవు గాఁదలంచితివేని యీరాక్షస రాజపీఠమునుండి నాశనమయిపోవలసి యుండును. అది యెంతయు నసంగతము. ఆగ్రహింపక చక్కగా విచారించి చూడుము. నీకేగోచరము కాఁగలదు.

మ. గెలువం జాలితి వన్నిలోకములు నీ ♦ కీర్తిద్యుతుల్ దిక్కులన్
వెలుఁగున్ వైరులు లేరు హాయిగ సదా ♦ విశ్వాళిఁ బాలింపుమన్
గులమున్ వంశము తేజమున్ నిలిపి మా ♦ కున్ శ్రేయమున్ గూర్పఁగా
వలదా దానముఖ్య యీశ్వరునితో ♦ వైరంబు నీ కేటికిన్ ?

హిర—(స్వగతము) ఔరా ! వీ డెంతకును నాకు లోఁబడ కున్నాఁడు. ఇంక వీని నేమి సేయవలయును ? (అని ప్రకాశముగా) ఈవైరమువలన నీయీశ్వ రుఁడు న న్నేమియును సేయలేఁడు. నావైరమువలన నీవుచేడ్పడు చున్నాఁ డవు జూడుము.

ప్రహ్లా—నీదండనమునకు నాదేహము గురియగు ననుకొనుము. ఆవల పాప పుణ్యములకుఁ గలుగుఫలములవలనఁ బరమేశ్వరునిగూర్చి యొకింత శంకింపుము.

హిర—అహో ! ఏమి యాశ్చర్యము. నీపరమేశ్వరుఁడే నన్ను నిర్జించువాఁడు ?
ప్రహ్లా—సందియ మేమి ? నీయంతట నీవే నిర్జింపఁబడియెదవు.
హిర—అప్పుడు యమధర్మరాజు వచ్చునా యేమి ?
ప్రహ్లా—నాఁడుమాత్రము వేరుగ నున్నాఁడా ?
హిర—ఆదక్షిణదిక్పాలునకుఁగూడ నేను ఒడంబడవలయుఁగా ?

ప్రహ్లా—కాదు కాదు.

తే. గీ. తనమనోభ్రాంతి స్వప్నమం ♦ దనుసరించి
దుఃఖసుఖములు గలిగించి ♦ దొలఁగినట్లు
తనదుపాపంబె య మునియ ♦ ట్లనుకరించు
నప్పునకు వడ్డి యిలు మ్రింగి ♦ నట్లు గంటె.

హిర—ఓరీ ! కులద్రోహి ! ద్రోహి ! నీవు నాకు పుత్త్రుఁడవు గాక కేవలము శత్రుప్రాయుఁడవై నాయీశ్వరత్వమును మాపఁజూచుచున్నావు. నీ వేయీశ్వరుని నిర్దేశించి భాషించుచున్నావో అతఁడే నే ననుకొనుము. నాకువినా సర్వసత్వములు జడముల కాశ్రయమైనవి. ఈశ్వరప్రకృతివలెనే నాయాజ్ఞప్రకృతియుఁ ద్రిజగంబుల నిండి వెల్లివిరియుచున్నది. నేనును దేజస్వరూపుఁడనే. ఇట్టిమహద్విశిష్టుఁడ నైననన్నుఁ గాదని యధిక్షేపించునిన్నుద నూజాఁడవని గారవించుట దీపమును ముద్దిడుకొనుట వంటిది. పుండు తనువులోఁ బుట్టినను ఖండ నీయమే గావున నీవును ప్రాచీనదానవనీతి ననుసరించి ఖండింపఁ బడవలయును. లేదా, దానవభర్తనైన నన్ను పరమేశ్వరునిగా ధ్యానింపవలయును.

ప్రహ్లా—నే నెన్నఁటికిని నిన్ను బరమేశ్వరునిగా నూహింపనోపను.
హిర—వధింపఁబడుటకు నంగీకరించితివా ?

ప్రహ్లా—అగును.

మంత్రి—సభ్యులయెదుటఁ బ్రహ్లాదునిమరణపత్రిక చదువఁబడినది. ఇందు మీమీ సంతకములును ముద్రింపఁబడవలసి యున్నవి. ఇందు కసమ్మతము సూచించు వా రెవ్వరైన నుండిరేని ప్రతిఘటింపఁ గలరు.

హిర—సభ్యులారా ! నాయీశ్వరత్వమున మీ కేదేని విరోధ మున్నదా !

సభ్యులు—లేదు. స్వామీ ! నీవే ఆదిమధ్యాంతలయుఁడవు. అతేంద్రియుఁడవు. జగజ్జ్యోతివి.

ప్రహ్లా—(స్వగతము) ఈతఁడతేంద్రియుఁడైన నెట్లింద్రియగోచరుం డగుచున్నాఁడు ? అయ్యో ! ఈతెలివిమాలినవారలు సేయునీవ్యాజస్తుతులు నిజమని నమ్ముచు నాజనకుం డెంతవిభ్రాంతుఁ డగుచున్నాఁడు ! ఎట్టి వివేకినైనఁ బాడుసేయునవి వ్యాజస్తుతు లేగదా.

మధు—ప్రహ్లాదా ! నీవు ఖండింపఁబడుటకు నొప్పుకొనియెదవా ? లేక దానవేశ్వరుని యీశ్వరునిగాఁ బూజించెదవా ?

హిర—నీ వింక వానితో నేదియును ప్రసంగింపకుము. వాఁడు తప్పక దండనీయుఁడు.

ప్రహ్లా—

క. దండించిన ఖండించిన
దండధరారులకుఁ గాని ♦ దర్పముతో బ్ర
హ్మాండము నిండినహరి తా
నుండఁగ నొండేమివింత ♦ యుర్వీనాథా.

హిర—సరే ! (అని నిష్క్రమించును.)

మంత్రి—గురుపుత్రులారా! మనమును బోవుదము రండు. (అని నిష్క్రమింతురు.)

తలారులు—(ప్రవేశించి) ఓప్రహ్లాదకుమారా ! నిన్ను వధ్యభూమికిఁ గొంపోయి దానవరాజమంత్రము పాడించుటకు మాకు మహారాజు సెలవైనది. అట్లు నీవు ఒడంబడువఱకు లెక్కలేనివెతలం బెట్టి తుదకు దుర్మరణంబులపాలు సేయుఁడని యనుజ్ఞాపత్ర మొసంగఁబడినది.

ప్రహ్లా—సరే ! మంచిది.

తే. గీ. పుత్త్రకు గళాన నురిత్రాడు ♦ బోసిలాగు
మనుచు వ్రాసినమరణలే ♦ ఖను నొసంగుఁ
డెవ రెవరిసంతకంబులం ♦ డెటుల గలవొ
వానిఁజదివెద కడసారి ♦ పారమట్లు.

(అని చేతులు చాఁచును.)

తలా—(ఇదిగో అని యొసంగుదురు.)

ప్రహ్లా—(చదువుకొని) ఓబాంధవులారా ! నామరణపత్రముపై మీసంతకములు గూడఁ జిత్రింపఁబడి యున్నవా ? నేను మీకొనర్చిన యపకృత మే మున్నది ?

మ. భగవంతుం డఖిలంబులో గలఁ డదే ♦ భావింపుఁడీ యన్న. నే
పగవాఁ డైతిని వధ్యభూమి గొనిపో ♦ వం జూచుచున్నాఁడ నీ
జగతిన్ వింటిరె యిట్టివింతలు ; దురా ♦ చారంబు లీమార్గముల్
తగవంచున్ వచియింప రెవ్వరును మా ♦ తండ్రిన్ విలోకింపుచున్.

తలా—ప్రహ్లాదకుమారా ! ఈ యెలజవ్వనంబున నేల బ్రతుకుపై నీళ్లు బోసికొని యెదవు ? జీవించెడుతెఱం గూహింపవలదా ?

ప్రహ్లా—పరమేశ్వరుని ధ్యానించుటయే, అన్నిటికిఁ దెఱవు.

తలా—అట్లయిన నీవు తప్పక వధింపఁబడియెదవు ; కావున నిప్పుడైన భూపాలుని శరణంబు వేఁడుము.

ప్రహ్లా—ఓ వెఱ్ఱులారా !

ఉ. చావునకున్ భయంపడి వి ♦ చారముతో నను( గావుమంచు నే
భూవరు( గోర నొల్ల జగ ♦ మున్ సృజియించినదేవదేవు(డే
గావ(గనున్నవా(డుత్రిజ ♦ గంబులనున్నను, వార్థిడా(గినన్
జావునతప్పిపో(గలరె ♦ చచ్చుటకున్ జనియింతురెల్లరున్

తలా—అటులైన నీవు వధ్యభూమికి రావలసి యున్నది.

ప్రహ్లా—నడువు(డు. (స్వగతము)

ఉ. అపరమేశ్వరార్థము మ ♦ హాటవులన్ గిరిగహ్వరంబులన్
రేపవ లొక్కరీతి కను ♦ రెప్పలు వాల్పక కుక్షి నింపకన్
దాపసులంతవారలు వె ♦ తంబడ నావ్యధ లెక్కయేమి యే
రూపుననైన నీశ్వరుని ♦ రూఢిపదంబు లభింప మేలగున్.

(ప్రకాశముగా)

తే. గీ. ప్రాణ మాసించి నాస్తికుం ♦ డగుట యెట్లు
పాపమునకైన భీతిల్ల ♦ వలదె( యున్న
దున్నయటుల దెల్పితిని యీ ♦ యుర్విప్రజలు
తండ్రి కవిధేయు( డని నన్ను ♦ దల(పవలదు.

(అందఱు నిష్క్రమింతురు.)



# దానవవధ.

## పంచమాంకము.

రంగము—చెరసాలప్రాంతారణ్యమార్గము.

(కపాలకుండలుఁడు విచారముతోఁ బ్రవేశించును.)

కపా—అన్నన్నా! ఎప్పటి కెవరి కేమి రానున్నదో తెలియరాదు గదా! ఓప్రహ్లాదా! నీ కిన్నిపాట్లు వచ్చునని యెవ్వరైన నెఱుంగుదురా ?

చ. కటకట యేమిచోద్య మిది ♦ కాలమ యెంతటి పాపివైతివా
పటుతరశేముషీవిభవ ♦ బంధురుఁ డైనకుమారు నిట్టు లు
త్కటవిపదబ్ధి ముంచఁదగు ♦ తండ్రులఁ జేసితి వింక నెట్టిసం
కటములు బెట్ట నుంటివో జ ♦ గంబులు నీకరబద్ధ మాటచేన్.

ఓహిరణ్యకశ్యపా ! తపంబున బ్రహ్మణ్యుఁడ వయ్యెదవనుకొంటిమి గాని ఇట్టి పొలసుదిండి కుమారఘాతుకుఁడ వయ్యెద వనుకొనలేదు సుమా !

మ. సుకుమారుండు కుమారసన్నిభుఁడు సు ♦ శ్లోకుండు సౌభాగ్యశా
లి కలాధుర్యుఁ డనంతసద్గుణకళా ♦ లీలావిలాసుండు నే
రకొ దా నేర్చియొ పల్కెనాఁ డహితమున్ ♦ రక్షింపఁడే తండ్రి హా
లకు లవ్యక్తము లాడినన్ జనకులో ♦ లం బట్టి హింసింతురే.

సీ. ఏహస్తముల నన్న ♦ మిడితివో యాహస్త, ములచేతనే చంపఁ ♦ దలఁచినావు
ఏనోట ముద్దుల ♦ నిడితివో యానోట, మరణదండన చెప్పి ♦ యరిగినావు
ఎవనివంశాంభోధి ♦ కిందుఁ డంటివో వాని, విషవృక్షమని తిట్టి ♦ విడిచినావు
ఎవనిమాటలు విని ♦ యింపారెదో వాని, నుడువుట కటువని ♦ మిడిసినావు
దుష్టుఁ డనిపించినావు వి ♦ స్పష్టముగను
కటకటా ! కన్నకడు పింత ♦ కఠిన మైన
నిలుచునే జగ మిన్నాళ్లు ♦ కలిమి చెడక
కంచె చేను మేసిన కాపు ♦ కాయఁగలఁడె.

ఔరా ! నీయీశ్వరత్వమునకు భంగపాటు గలిగించె ననిగదా కుమార ప్రహ్లాదునిపై నలిగితివి. సర్వశక్తివంత మైనయీశ్వరత్వమే నీయందుఁ దోఁచిన భంగపాటుచే వగ పెందులకు రావలయును ? ఇది నీకు నిజముగా వినాశసూచకము.

ఉ. భూరిసువర్ణమందిరవి • భూషితరత్న శిలాతలంబు లిం
పార జగత్త్రయైకవిభ • వంబు గలింగెను పుణ్యకర్మసం
స్కారముచేత నేఁ డవి ని • జంబుగఁ బోవును ఱేఁడు పాప మి
చ్ఛారతి సల్పుచుండెను బ్ర • జల్ మఱి వీనిని విశ్వసింతురే.

అన్నా ! ప్రహ్లాదకుమారా ! నీ వెంతపాపము చేసి పుట్టితివో గదా ? అంతటి రాజునకుఁ గుమారుఁడవై నీచులగుతలారులకఱకుకరవాలముల కుగ్గు కావలసినవాఁడవైతివి. ఈమహాదారుణకర్మమునకు హేతుఁడనైన నాకే దుఃఖము పొర్లిపొర్లి వచ్చుచుండఁగా నవమాసంబులు మోచిన నీతల్లిగర్భ సాగర మెట్లు ఘోషిల్లుచున్నదో ! అయ్యయ్యో ! ఆదైత్యవల్లభున కీదు ర్బుద్ధి యేలకలుగవలయును ? వాని కేమియుఁను జాలి కలుగ లేదా ? ఇట్టి కఠినచిత్తులను రాజ్యలక్ష్మి యెట్లు వరించినది ? (ప్రక్కకుఁజూచి) అదిగో ! నామిత్త్రుఁడురత్నాకరుఁడు ప్రహ్లాదునియొద్దనుండి వచ్చు చున్నాఁడు.

రత్నాకరుఁడు—(ప్రవేశించి) కపాలకుండలుఁడా ! ఇం దుంటి వేమి ?

కపా—కావుననే నీదర్శనలాభమహాభాగ్యము లభించినది. మిత్త్రుఁడా ప్రహ్లాదుని వార్త లేమి ?

రత్నా—ఏ మని వచింపు మనియెదవు ? రాజ్య మెవ్వరిది ?

కపా—అవును.

చ. చండతరాగ్రహానల పి • చండిలమానసు లందులోనఁ బా
షండులచేతిలోకలము • చన్నమహాత్ములు సాధువర్తనుల్
దండనపాలు గాక ప్రమ • దంబు వహింతురె మేకపిల్లలన్
దండిమెకంబు కాయఁగల • దా కలదానితెఱుంగు నూపకన్.

ప్రహ్లాదుఁ డింకను బ్రతికి యున్నాఁడా ?

రత్నా—వాని నెవరు చంప నోపుదురు ?

తే. గీ. నభము తెగును పాఱు ♦ నదియును తెగు వజ్ర
ధారచేతఁ బర్వ ♦ తములు తెగును
రాక్షసేంద్రసుతుఁడు ♦ ప్రహ్లాదుశిర మెట్టి
వానివాఁడికత్తి ♦ కైనఁ దెగదు.

కపా—వానినంతగా హింసింప లేదుగదా ?

రత్నా—ఏల మానెదరు ? రజనీచరనాథునియాజ్ఞకు తిరు గుండునా ?

సీ. గాఢాగ్నిగుండాన ♦ కట్టుకైనవడిఁ గాల్చి, ముంచిరి వార్ధిమ ♦ ర్దించినారు
విషశూలముల గ్రుచ్చి♦ పెకలించి తనువులో, యుప్పుకారము వెట్టి♦యొడిచినారు
గిరులపై కెక్కించి ♦ క్రిందికి నురికించి, ముళ్లలోపల నీడ్చి ♦ పొడిచినారు
గదలచే మొత్తి ప ♦ గ్గములచే బంధించి, కొఱత నేయుచు దెగ ♦ నఱికినారు

ఎండలో నుంచి గొంతుక ♦ యెండుచున్న
మంచినీ రీక జ్వాల త్రా ♦ వించినారు
కొమ్మలకుఁ గాళ్లు కట్టి వే ♦ ళ్లాడిపినారు
కాని హరిభక్తి విడువఁ డా ♦ ఘనగుణుండు.

కపా—రత్నాకరా ! ఈశిక్షల కన్నిఁటికి వానిమృతకళేబరము గురియైయుండెనా ?

రత్నా—కాదు కాదు. వాఁడు సజీవుఁ డయ్యే యివి యన్నియు ననుభవించు చున్నాఁడు.

ఉ. బావఁ దెలుంగురాలుపడ ♦ సాయము గోరఁడు తోడివారలం
బ్రోవగఁ జీరఁ డింతభయ ♦ బుద్ధిఁ దలంపఁడు బేల గాఁడు లో
లో వగఁ జెందఁ డించుకయు ♦ లోచనముల్ ముకుళింపఁ డాత్మలో
స్థావర మైనయీశ్వరుని ♦ దా శరణం బనివేఁడు నమ్రుఁడై.

కపా—హాశ్చర్య మాశ్చర్యము. ఈమహత్తు లాతఁ డెట్లు నేర్చికొనియెను ?

రత్నా—అతఁడు మహాభక్తుఁడు.

చ. ఎవఁడు ప్రపుణ్యమార్గమున ♦ నీశ్వరునిన్ భజియించి ముక్తుఁ డై
ప్రవిమలసీతివర్తనము ♦ బాయఁడొ వానికి పంచభూతముల్
కవచము లగ్ని నందనము ♦ కంజభవాండము సౌధవీధి భూ
ధవు లటువంటియోగిని మ ♦ దంబున ద్రుంపఁగ నేర్తు రేయెడన్.

కపా—ఇది యెంతవిచిత్రముగా నున్నది.

మ. హరి జేరందగ దంచుఁ జెప్ప జనకుం ♦ డజ్ఞాతజాండంబులోఁ
బరఁగం బోవఁడు తండ్రిమాటలు తృణ ♦ ప్రాయంబుగాఁ జేసి యా
సిరులన్ ద్రోసెడుపుత్త్రుఁడున్ గలుగఁ డీ ♦ సృష్టిన్ విలోకింపఁగా
హరిమాయామయ మింకఁ గాఁగలదు దై ♦ త్యాంతంబొ దేవాంతమో.

రత్నా—అదిగో ! ప్రహ్లాదుఁ డీవంకకే తలారులచే కొనితేఁబడుచున్నాఁడు మనమి
చ్చోటు వదలి పోవుదము రమ్ము. (అని యిరువురు నిష్క్రమింతురు.)

(తలారులతోఁ బ్రహ్లాదుఁడు ప్రవేశించును.)

ప్రహ్లా—(చేతులు ముకుళించి)

క. నారాయణ కరుణాకర
ఘోరవిపద్వార్ధి దాఁటఁ ♦ గోరెడుగుణవి
స్తారులకుఁ దరణిదురహం
కారులతమమునకుఁ దరణి ♦ గావె మహాత్మా.

తలారి—యువరాజా !

ప్రహ్లా—నే నట్లు పిలుచుట కర్హుఁడను గాను.

తలా—మఱి యేమనవలయును ? ప్రహ్లాదా ! యనియా. సరే ఇంకనైన నీహరి
భక్తిగీతములు మానుకొనియెదవా ? లేదా ?

ప్రహ్లా—నాహరిభక్తిగీతములతో మీకేమిపని ? మీనియుక్తకార్యము మీరాచ
రింపుఁడు.

తలా—అది యెవరు తప్పింపఁ గలరు ? (వెనుకకుఁ దిరిగి) పాములవాఁడింకను
రాలేదేమి ? (వాఁడు వచ్చుటఁ గాంచి) అదే వచ్చుచున్నాఁడు. అహితుండి
కుఁడా ! వచ్చితివా ?

అహి—(పాములకావడితోఁ బ్రవేశించును.) తలారులారా ! మహారాజుగారిసెల వేమని యైనది ?

తలా—ఈప్రహ్లాదకుమారుఁడు హరిగీతములు మానుపర్యంతము విషోరగంబులఁ గరిపింపుమని వీనిమరణపత్రంబున వ్రాయఁబడియున్నయంశములలో నొకటి యై యున్నది.

అహి—నా కేమిబహుమాన మిచ్చెదరో నీవేమైన జెప్పఁగలవా ?

తలా—"వేయిమాడలు" అని యీపత్రమున వ్రాయఁబడి యున్నది.

అహి—(స్వగతము) ఈధనముతో నాయావజ్జీవము పొట్ట పోసికొనవచ్చును. (ప్రకాశముగ) అయంకి చూడనిండు. (చూచి) ఆ ! సరే ! (అని నాగసర్వ మూఁదుచుఁ బాముల నాడించి అందొకసర్పమును బట్టుకొని) ఇది సామాన్య మైనయురగము గాదు.

సీ. ఆదిశేషునకు వె • న్నంటి బుట్టినప్రోడ, తక్షకునకును సో • దరుఁ డితండు
వినతను నోడించి • ఘనతఁ జెందినమేటి, వాసుకికిని ప్రేమ • బాంధవుండు
కుండలంబుల నాఁడు • గొనిపోయినప్పుడు, నోడిలోన దాఁచిన• యుగ్రమూర్తి
పీయూషమును దిని • పేర్మి దర్భల నాకి, జిహ్వను రెండు జే • సినఘనుండు

ఉరగలోకంబు నరచేత • నూఁపఁగలఁడు
విషముతో లోకములు మాడ్చి • వేయఁగలఁడు
మంత్రతంత్రౌషధంబుల • మరలఁ డితఁడు
భోగివర్యుండు పింగళి • నా గితండు.

(అని నాగస్వర మూఁదుచు) ఓప్రహ్లాదా ! ఇదే నీమీఁదఁ బడవేయు చున్నాను. దీనికాటునకు. నీవు భస్మ మైపోయెదవు.

తలా—ప్రహ్లాదా ! ఇప్పుడైన నీమూర్ఖమును వదలుము.

ప్రహ్లా—మీరు తలారు లయ్యును మతబోధకులవలె ననునయించెదరేల ? మీకార్య మును మీరు సలుపుఁడు.

తలా—నీవు విడువవా ? సరే ! ఓఅహితుండికా ! ఆసర్పముచే వీనిమాహా మ స్తకము కరిపింపుము. అప్పుడే వీనికి బుద్ధివచ్చును.

అహి—(నాగస్వర మూఁదుట మాని) నావేయిమాడ లివ్వవలయును జుమా ? (నాగస్వర మూఁదుచు)

పాట

లేరా నాగన్నా-కోపము మాని ♦ రారా నాగన్నా

0 0 0 0

హరిభజనము మాను ♦ వఱకు రాక్షసలోక
వరుఁడు ప్రహ్లాదుని ♦ గరిపింపు మనె నిన్ను॥ లే॥

(పాము బుస్సున లేచి పడగ యెత్తి యాడును. పాములవాఁడు నాగస్వర మూఁదుచునే యుండును.)

అహి—లే నాముద్దులబిడ్డ ! లే. ఒక్కకాటున నీప్రహ్లాదుని గడతేర్పుము. రా.

ప్రహ్లా—ఓపరమేశ్వరుఁడా ! నీవే యార్తరక్షకుఁడవు. ఇది యంతయు నీమహిమ గాని వేఱు గాదు.

తే. గీ. అణువుమొదలుగ బ్రహ్మప ♦ ర్యంత మెవని
సృష్టిచేఁ బ్రొదీపించు నే ♦ స్రష్టవలన
సాధురక్షణ దుష్టశి ♦ క్షణము గలదొ
అతఁడు శరణంబు నా కగు ♦ నహరహంబు.

అహి—(నాగస్వర మూఁదుచు) ఓపింగళినాగమా ! యీసారి కరువుము. (పాము ప్రహ్లాదుని నెత్తిపాడవున లేచి కరవఁ బోవుచున్నది.)

ప్రహ్లా—(తలను వంచి) ఓసర్పరాజా ! నన్ను నీకోఱలకు బలి యొసంగెదను. నా కేమియుఁ జింత లేదు. కాని,

అహి—(పాములకావడితోఁ బ్రవేశించును.) తలారులారా ! మహారాజుగారిసెల వేమని యైనది ?

తలా—ఈప్రహ్లాదకుమారుఁడు హరిగీతములు మానుపర్యంతము విషోరగంబులఁ గరిపింపుమని వీనిమరణపత్రంబున వ్రాయఁబడియున్నయంశములలో నొకటి యై యున్నది.

అహి—నా కేమిబహుమాన మిచ్చెదరో నీవేమైన జెప్పఁగలవా ?

తలా—"వేయిమాడలు" అని యీపత్రమున వ్రాయఁబడి యున్నది.

అహి—(స్వగతము) ఈధనముతో నాయావజ్జీవము పొట్ట పోసికొనవచ్చును. (ప్రకాశముగ) అయంకి చూడనిండు. (చూచి) ఆ ! సరే ! (అని నాగసర్వ మూఁదుచుఁ బాముల నాడించి అందొకసర్పమును బట్టుకొని) ఇది సామాన్య మైనయురగము గాదు.

సీ. ఆదిశేషునకు వె ♦ న్నంటి బుట్టినప్రోడ, తక్షకునకును సో ♦ దరుఁ డితండు
వినతను నోడించి ♦ ఘనతఁ జెందినమేటి, వాసుకికిని బ్రేమ ♦ బాంధవుండు
కుండలంబుల నాఁడు ♦ గొనిపోయినప్పుడు, నోడిలోన దాఁచిన♦ యుగ్రమూర్తి
పీయూషమును దిని ♦ పేర్మి దర్భల నాకి, జిహ్వను రెండు జే ♦ సినఘనుండు

ఉరగలోకంబు నరచేత ♦ నూఁపఁగలఁడు
విషముతో లోకములు మాడ్చి ♦ వేయఁగలఁడు
మంత్రతంత్రౌషధంబుల ♦ మరలఁ డితఁడు
భోగివర్యుండు పింగళి ♦ నా గితండు.

(అని నాగస్వర మూఁదుచు) ఓప్రహ్లాదా ! ఇదే నీమీఁదఁ బడవేయు చున్నాను. దీనికాటునకు. నీవు భస్మ మైపోయెదవు.

తలా—ప్రహ్లాదా ! ఇప్పుడైన నీమూర్ఖమును వదలుము.

ప్రహ్లా—మీరు తలారు లయ్యును మతబోధకులవలె ననునయించెదరేల ? మీకార్య మును మీరు సలుపుఁడు.

త్రలా—నీవు విడువవా ? సరే ! ఓఅహితుండికా ! ఆసర్పముచే వీనియాపాద మస్తకము కరిపింపుము. అప్పుడే వీనికి బుద్ధివచ్చును.

అహి—(నాగస్వర మూఁదుట మాని) నావేయిమాడ లివ్వవలయును జుమా ? (నాగస్వర మూఁదుచు)

పాట

లేరా నాగన్నా-కోపము మాని ♦ రారా నాగన్నా

0 0 0 0

హరిభజనము మాను ♦ వఱకు రాక్షసలోక
వరుఁడు ప్రహ్లాదుని ♦ గరిపింపు మనె నిన్ను॥ లే॥

(పాము బుస్సున లేచి పడగ యెత్తి యాడును. పాములవాఁడు నాగస్వర మూఁదుచునే యుండును.)

అహి—లే నాముద్దులబిడ్డ ! లే. ఒక్కకాటున నీప్రహ్లాదుని గడతేర్పుము. రా.

ప్రహ్లా—ఓపరమేశ్వరుఁడా ! నీవే యార్తరక్షకుఁడవు. ఇది యంతయు నీమహిమ గాని వేఱు గాదు.

తే. గీ. అణువుమొదలుగ బ్రహ్మప ♦ ర్యంత మెవని
సృష్టిచేఁ బ్రదీపించు నే ♦ స్రష్టవలన
సాధురక్షణ దుష్టశి ♦ క్షణము గలదో
అతఁడు శరణంబు నా కగు ♦ నహరహంబు.

అహి—(నాగస్వర మూఁదుచు) ఓపింగళినాగమా ! యీసారి కరువుము. (సర్పము ప్రహ్లాదుని నెత్తిపొడవున లేచి కరవఁ బోవుచున్నది.)

ప్రహ్లా—(తలను వంచి) ఓసర్పరాజా ! నన్ను నీకోఱలకు బలి యొసంగుము. నా కేమియుఁ జింత లేదు. కాని,

ఉ. శేషునితోడఁ బుట్టినవి ♦ శేషగుణాఢ్యుఁడవేని నీకులో
ద్భూషణ మైనకీర్తి తలఁ ♦ బూనెదవేని పరాత్ముఁ శీశ్వరున్
ద్వేషము మాని నీయనుజు ♦ తీరునఁ గొల్చెడువాఁడవేని యే
దోషము సేయనట్టిభవ ♦ దూరుల నంటకు నీకు మ్రొక్కెదన్.
(అంత సర్పము వెనుకకుఁ దిరిగి పాములవానిని గరచును.)

అహి—హా ! హా ! ప్రాణము పోవుచున్నది. నా కావేయిమాడ లవసరము లేదు. ప్రాణము, ప్రాణము. మఱి ప్రాణముపోయువా రెవ్వరు ? హా ! ప్రాణము.

తే. గీ. అర్థవాంఛఁ జేసి ♦ ప్రాణార్థములు గోలు
పోవుచుంటి యొరుల ♦ బావుఁ గోరి
వచ్చి నేనె బావ ♦ వలసివచ్చెను మాయ
ఘటన మింక వేరె ♦ గలదె జగతి.

(అని ప్రాణము విడుచును.)

తలా—ఓహెూ ! ఈపాము మమ్ముఁగూడఁ గరచి చంపివేయును. ఈప్రహ్లాదుఁ డేదో మంత్రించి విడిచినాఁడు. లేకున్న నీమేటిగారుఁడు మరణించునా ? ఈసంగతి మహారాజు నెదుటఁ బెట్టవలయును. (అని పాములవానిని లాగి కొని నిష్క్రమింతురు. పాము కలుగులోనికి దూరిపోవును.)

ప్రహ్లా—(ఒకవంకకు దృష్టిని బరపి) ఓహెూ ! నన్ను మట్టివేయుటకుఁ గాఁబోలును వేదండంబులు తొండంబులు పైకెత్తుకొని కాళ్ల కున్నసంకెళ్ల మ్రోఁయ గీపెట్టుచు వచ్చుచున్నవి. (ప్రహ్లాదుఁడు చేతులు పైకెత్తుకొని) ఓపరమేశ్వరా ! నీసృష్టి యెన్నెన్ని చిత్రవిచిత్రములు గలది ?

మ. కరినాథుండు ధరాధరంబులను ధి ♦ క్కారించుదేహంబుతో
దురహంకారతమంబు మైకొని వడిఁ ♦ దోతెంచె నీక్రౌర్య మే
కరణిన్ వచ్చెనొ మాంసహారులును శా ♦ కాహారు లంభేద మిం
తరయఁ రాదు రజస్తమోగుణము లీ ♦ హాబద్ధమోహాంధముల్.
(ఏనుఁగ సమీపించుట గాంచి)

ఉ. ఓకరిరాజమా ! యలుగ ♦ కోపికపట్టుము సృష్టికర్త నీ
కీ కరణిన్ బ్రజావధకు ♦ నేర్పడఁ జేసెనొ లావుదేహమున్
శాకలు దిన్న వచ్చునని ♦ చాటఁగ నీధ్వజమెత్తినాఁడొ నీ
వాకలనం బెఱుంగక మ ♦ దాలస వై చరియింపఁ బాడియే.

ఓవేదండవతంసమా ! నీకుఁ బరమేశ్వరుఁ డన్న విశ్వాసము లేదా ! నీ బ్రహ్మాండశరీరమునందును ఎవఁడు విడువకవసియించి యున్నాఁడో వాని నుద్దేశించితివా ? నీకన్న బలహీనులను హింసింపుమని నిన్నీశ్వరవినట్లు సృష్టికర్తయాశయమని నీ వెఱింగితివా ? సరే ! నీయాఁకలికి నాశరీర మశనమైన నీ వవస్యము నన్ను భక్షింపుము. ఇదే నాశరీర మొక మాంస ఖండమువలె నీముందల నిడుచున్నాను. (అని బోరగిలి పరుండును.) ఏనుఁగ వెనుకకు మరలి పోవును. (ప్రహ్లాదుఁడు లేచి) ఓపరమేశ్వరుఁడా ! నన్నింకను బ్రపంచమున జీవింపఁ జేయుటకుఁ దలంచి యున్నావా ? పశుపక్షిమృగములకును నీ వన్న నెనరున్నదిగాని సకలవిభములును నీ వలనఁ బడసినమాతండ్రి కేలలేకపోవలయును ? అతఁ డేల నిరీశ్వరుఁడై పలవింపవలయును ? శరీరధారు లెప్పుడైన పరమేశ్వరుఁ డైనసీవు కాఁ గలరా ? (వెనుకవంకకు దృష్టి నిగుడ్చి) అదిగో మాయమ్మగాఁబోలు వచ్చు చున్నది.

లీలావతి—(దుఃఖముతోఁ బ్రవేశించి) హా ! నాయనా ! ప్రహ్లాదకుమారా ! బ్రతికి యుంటివా బాబూ ! (అని కౌంగలించుకొనును.)

ప్రహ్లా—అమ్మా ! నీపదసరోజములకు నమస్కరించుచున్నాను.

లీల—చిరంజీవి వగుము.

ప్రహ్లా—ఇంతదవ్వు నీ వేలవచ్చితివి ?

లీల—ఏమి ! నేను రావలదా ? నాయాశ లన్నియును భగ్న మైనవా ! నాగర్భ మునకుఁ జిచ్చంటుటయే వాస్తవమా ! నాకన్నకుమారుని నేనుబ్రతికి యుండఁగఁజూడ నే లేనా ? నాకన్నులలోనితేజస్సు ! నేఁటితో మలీమస

మైపోయినదా ? అయ్యో ! ప్రారబ్ధమా ! నే నిది యేనాఁడు జేసినపాపము? నాయనా ! ప్రహ్లాదకుమారా ! నానోము లన్నియు విఫలమై, నాదోషములు నీ కకాలమృత్యురూపమున వేధింపుచున్నవా ? దయాలేశము లేనిదానవ భర్త నీయెడ నొకింత యుఁబుత్రవాత్సల్యము సేయక యెన్నెన్నికష్టము లకు గురిచేసి వేధింపుచున్నాఁడు. అయ్యయో ! ఇట్టిఘోర మెందైనఁ గలదా ? కన్నకడుపులకే జాలి గలుగకున్న మఱి యెవ్వరు శరణ మొసంగుదురు ? ఎవ్వరు రక్షణ మొసంగుదురు ఏమి ! ఆ విధి నీనొసటనే యీకష్టములు వ్రాసెనా ? నిన్నుఁదలంచుకొనిన నాగుండె నీరువిడిపోవు చున్నది. (అని యేడ్చును.)

ప్రహ్లా—అమ్మా ! ఊరడిల్లు మూరడిల్లుము. నీవు దుఃఖింపవలసినంతవిపత్తు ఇప్పు డేమి వచ్చినది ?

లీల—నీతండ్రి కుపితుఁడై నిన్ను బెట్టెడుహింసలు సామాన్యములా ?

ప్రహ్లా—నా కేమియు వేదన గలుగ లేదు. పూజ్యుఁడైనమాతండ్రిపై నీవేమియు నలుగ వలదు.

లీల—ఇంకను నీవు నీపితృభక్తిని మాన కున్నావు. నీయవస్థ గాంచిన నాకింకె క్కడిశాంతము ?

ప్రహ్లా—అమ్మా ! నేఁటితో నీదుఃఖము లన్నియు మఱచి పొమ్ము.

లీల—నీవు నీశిక్షలనుండి విడువడితివా ?

ప్రహ్లా—లేదు. ఇంకను పరమేశ్వరుఁడు నన్ను జీవముతో నుంచి యున్నాఁడు.

లీల—నాయనా!నన్ను గొడ్డురాలను సేయకుము. నామాట యొకటి విశ్వసింపుము.

ప్రహ్లా—అమ్మా ! అది యేమి ?

లీల—నీకు నీతండ్రీయెడల గలభక్తి విశ్వాసము ప్రజాముఖంబున విస్పష్టముగాఁ బ్రకటింపవలయును. ఏమనిన.

చ. జనకుఁడు నీతికోవిదుఁడు ♦ సర్వజగంబుల గెల్చినట్టిశౌ
ర్యనిధి శుభంబు లెప్పుడు త్వ ♦ దర్థము గోరెడువాఁడు గాని నిన్

జెనకెడువాఁడు గాఁడు గుణ ♦ సింధుఁడ వీ వలతండ్రిముద్దు లిం
పెనయఁగఁ దీర్పకున్న నొరు ♦ లెవ్వరు వత్తురు జెప్పు మర్భకా.

ప్రహ్లా—నే నేమి ముద్దులను దీర్పవలయును ?
లీల—నీతండ్రినే పరమేశ్వరుఁ డనవలయును.
ప్రహ్లా—దేహభ్రాంతిని జేసి నే నన్నునుఁ జెల్లవలదా ?
లీల—పోనిమ్ము. వానికోరిక తీరును.

ప్రహ్లా—కాదు తల్లీ ! పరమేశ్వరుని గీర్తించెడుపుత్త్రుని గాంచిన ముద్దు తీరును గాని తన్నే పరమేశ్వరుఁడని గాబాడించినతండ్రి కేమి ముద్దు ? పరమేశ్వరునికి గొడుకులు కోడండ్రు గలసంసార మున్నదా ?

లీల—అతఁడు విశ్వసంసారి గాఁడా ?
ప్రహ్లా—అతఁడు వేరుగనే యున్నాఁడు.
లీల—అతఁడే యితఁ డనరాదా ?
ప్రహ్లా—ఈషణత్రయములచే కట్టుబడినవాని కెంతమాత్రమును జెల్లనేరదు.

లీల—అడవిని దిరుగుకిరాతులలోఁ గలసి దిగంబరులై నజడదారులు మేమే పరమాత్మల మని యనఁగా లేకపోయినది, రాజాధిరాజై నదానవలోకవల్లభుఁ డనుటతప్పా ?

ప్రహ్లా—ముముక్షువులై నసన్యాసులు స్వస్వరూపజ్ఞానంబున దగ్ధమైనదేహముతోఁ బరమేశ్వరునియందు మనంబుఁ జేర్చి నిజానురాగంబున ప్రపంచంబు మఱచి యొకప్పుడు తామే పరబ్రహ్మ మని వచించినను బాధకము లేదు.

లీల—నీతండ్రి యహంభావమును అట్లు సమర్థింప వలదా ?

ప్రహ్లా—ఇది సమర్థించుట గాదు.

తే. గీ. ఈయహంభావ మగ్నియై ♦ యేచుచుండు
నాయహంభావ మమృతమై ♦ యలరుచుండు

నగ్ని జలమునఁ బడెనేని ♦ యారిపోవు
దూదిలోఁ బడ్డ దుగ్ధ మౌఁ ♦ గాదె ? తల్లి !

తలారులు—(ప్రవేశించి) ఓదేవి ! జయము జయము ! ఈకుమారప్రహ్లాదుని దెమ్మనమని మహారాజు సెలవైనది.

లీల—(సంభ్రమముతో) ఓనాయనలారా ! మహారాజునకుఁ గుమారప్రహ్లాదునిపైఁ గరుణ వచ్చినదా !

తలా—లేదు తల్లి ! రాతికిఁ బువ్వులు పుట్టునా ? ఎండపూవులయందు జలము లభించునా ? అట్లే కఠినహృదయము నల్లరాతిని బోలియుండును. ఇది యనుభవముతో చెప్పుచున్నవాక్యములు. కాని యీవధమాత్రము మావంటి వారలకుసైతము జాలిని గలిగించుచున్నది.

లీల—నిరంతరము వధావ్యాపారముచే జీవించుమీకైన నాముద్దులబిడ్డపైఁ గరుణ గలదు గాని కనిపెంచినతండ్రి కొకింతయును దయ రాకున్నది గదా !

తలా—అమ్మా ! నీభర్తను నీ వేలబ్రతిమాల రాదు ?

లీల—నేను పేరునకే పట్టపుదేవిని గాని నామాట యేమి చెల్లును ? అటులైన నీ చిన్ని ప్రహ్లాదుఁడు అనాథుఁడై చూడచుట్టములైన లేనిదీనావస్థ నీలీల చంపఁబడుటకుఁ బాల్పడునా ? నాయనా ! నే నెంతపాపము చేసిపుట్టితినో యీరూపమున నన్నా పరమేశ్వరుఁడు దుఃఖసముద్రమున ముంచివేయుచున్నాఁడు.

తలా—అయ్యో ! తల్లీ ! నీమాటలు విన్న మాకును దుఃఖము వచ్చుచున్నది. మే మేమిచేయము ? రాజాజ్ఞను మీర రాదు. నీతనయుని మా కొసంగుము. తోడ్కొని పోయెదము.

లీల—నాయనలారా ! వలసినంతధన మొసంగెదను. పైగా నామెడ నున్ననగ లన్నియు సమర్పించెదను. నాపుత్త్రుని వదలివేయుఁడు. నాకీపుత్త్రదానము సేయుఁడు. మీకు పదివేలనమస్కారములు.

తలా—ఓతల్లీ ! అసురలోకమహాలక్ష్మి వగునీకు మేము దాసులము. నీయాజ్ఞ యొకటియు మహారాజుగారియాజ్ఞ యొకటియుఁ గాదు. మేము నీమాటలు బొప్పున ప్రహ్లాదుని విడచితిమేని మాప్రాణములు క్షణమున లాగించి వేయును. అందుకైన మేము జడియ లేదు. సిద్ధముగనే యున్నాము. కాని ప్రహ్లాదుని హింసించుటకు మేము గాకున్న మఱికొందఱు క్రొత్త తలారులను నియోగించును గాని రాక్షసరాజూరకొనునా ? అది నీ వెఱుంగవా ?

లీల—అయ్యో ! ప్రాప్తమా ! కడుపారఁ గన్నకుమారుని ఈయకాలమృత్యున కిదిగోయని తల్లి నయ్యును ఒప్పగించుచున్నాను. నావంటి కఠినురాలు నావంటి మందభాగ్య నావంటి పాపిని ఏలోకంబున నుండరుగాదా ! (అని వెక్కి వెక్కి యేడ్చును.)

ప్రహ్లా—అమ్మా ! నీ వేడ్వవలదు. ఊరడిల్లు మూరడిల్లుము. కానున్న దెవ్వరు తప్పించెదరు ?

తే. గీ. వ్యోమమున బారువిహగంబు ♦ లురులచేత
వార్ధిలో డాఁగుచేఁపలు ♦ వలలచేతఁ
బట్టువడుచుండ హాని యె ♦ వ్వరికి లేదు
ఐహికం బెల్ల హింసామ ♦ యంబు జనని.

లీల—ఓతలారులారా ! నన్నైన వధించి యీతనయుని గావలేరా ?

తలా—ఈప్రహ్లాదుని నిప్పుడు వధ్యభూమికిఁ గొనిపోవుటలేదు ; మహారాజు కొలువునకు.

లీల—అది యంతకంటెఁ జెడుగైనది.

తలా—అందుకు మే మేమిసేయఁగలము ? ప్రహ్లాదా ! వచ్చుటకుఁ ద్వరపడవేమి?

ప్రహ్లా—నేను సర్వసిద్ధముగ నున్నాను అమ్మా ! నా కనుజ్ఞ నొసంగుము.

లీల—కడుపారగన్నది, నిన్ను జంపుకొనుటకా నాయనా ?

తే. గీ. అక్కటా ! కన్నకొడుకుల ♦ కరులచేతి
కిదిగొ ! యని యిచ్చు తల్లి యీ ♦ యిలను లేదు
నేర్చియో నేర్వకో హరిఁ ♦ గూర్చి పలుకు
తనయు దండించు తండ్రి యీ ♦ ధరణి లేఁడు.

నాయనా ! ప్రహ్లాదకుమార ! నీతల్లిదండ్రులవంటిమహాదుర్మార్గు లీయేడేడు లోకంబులందును గలుఁగఁ బోరుసుమా.

తలా—అమ్మా ! ఇఁకమీఁదఁగూడఁ బుట్టకుండ వర మొసంగుముతల్లీ !
ప్రహ్లా—అమ్మా ! జనకునియొద్దకుఁ బోవుట కేల యియ్యకొనవు ?

తే. గీ. కాంచి పెంచియు నను జది ♦ వించినట్టి
తండ్రిఋణమైనఁ బ్రాణంబు ♦ ధారవోసి
తీర్చికొందును మాతల్లి ♦ దీర్ఘ చింత
నొరయకుండుము ననుగూర్చి ♦ మఱచి పొమ్ము.

లీల—నన్ను మఱచిపొమ్మనుచున్నావా ? ఈమేనఁ బ్రాణంబు లున్నంతవఱకు నీవు మఱపు వచ్చెదవా ? తండ్రీ !

తలా—ప్రహ్లాదకుమారా ! కాలయాపనమున కిది సమయము గాదు. వేగ నడువ వలయును. మహారాజు కొలువు దీర్చుసమయ మగుచున్నది.

ప్రహ్లా—నాయవశిష్ట మేమి యున్నది. (అని రెండడుగులు వేయును.)
లీల—నాయనా ! నాముద్దుపెంపుముద్దులబిడ్డా ! నన్ను విడనాడి పోవుచున్నావా?
ప్రహ్లా—అమ్మా ! అట్లూరకే వాపోయెద వేల ? నేను మఱియెక్కడికిని బోవుట లేదు. నాన్నగారియొద్దకు.

లీల—అయ్యో ! నీనాన్నగా రిప్పుడు నీయెడల మృత్యుదేవతయైయున్నారుగాదా?
ప్రహ్లా—నే నట్లు తలంప లేదు. నీవును అట్టియుద్దేశమును బాసియుండుము.
లీల—ఈసౌజన్యరత్నాకరుని నే నెట్లు వీడుకొందునురా పరమేశ్వరా ! నేఁడైన నడ్డుపడరాదా ? నీకు దయ లేదా ? అయ్యో ! నే నెంతమోస పోయితిని.

సీ. గురుఁడు శుక్రాచారి ♦ గుణియించి నీకోటి, చిరంజీవి యనుచు భా ♦షించినాఁడు
అడవిలో నారదుఁ ♦ డడరి నీమాలి జై, వాతృకుం డగునని ♦ బలికినాఁడు
అమరులు నీజన ♦ నమునాఁడు ననలు వ, ర్షించి చిరాయుని ♦ జేసినారు
ఇతఁడు నాయుర్దాయ♦యుతుఁ డని సాముద్రి, కులుచూచిపలుమారు♦పలికినారు

కటకటా ! యొక్కఁ డైన న ♦ కాలమృత్యు
వాతఁ బడునని ప్రహ్లాదు ♦ జాతకంబు
జూచి పలుకరు గురునంత ♦ జోస్యు లెల్ల
ఖలముఖప్రీతిఁ జేసిన ♦ నిలువ దవని.

ప్రహ్లా—(తలవంచి యూరకుండును.)
తలా—(స్వగతము) ఈయమదుఃఖము మేము చూడలేకున్నాము.
లీల—(దీనస్వరముతో)

సీ సుగుణసంపదలతో ♦ శోభిల్లు నితఁడు నా, పుత్త్రుఁడు గావరే ♦ పూజ్యులార
శమదయాన్వితసత్య ♦ శాంతస్వభావుఁ డీ, కొమరుని నోమరే ♦ కొలఁకులార
పుట్టిన దాదిగా ♦ పురుషో త్తముని గొల్చు, సుతుని బ్రోవరె చంద్ర ♦సూర్యులార
పగవారితో నైనఁ ♦ బ్రతిఘటింపనిసాధు, తనయు రక్షింపరే ♦ తరువులార

తే. గీ. నీతికోవిదుండు ♦ నిత్యసత్యవ్రతుఁ
డితనిఁ గావరె యుడు ♦ పితలులార
మ్రొక్కు లెన్నియైన ♦ మొనసి చెల్లింతును
దిక్కుగండు మీరు ♦ దేవులార.

ఉ. పాప మెఱుంగ డింకఁ బసి ♦ బాలకుఁ డెవ్వరి నొవ్వనాఁడఁ డే
రూపము నైన బొంకఁడు ప ♦ రోక్షమునైనను కొండె మాడఁ డే
రాపుడి సేయఁ డీనిరప ♦ రాధునిఁ గావరె వేల్పులార తే
జోపథగాములార ! మిముఁ ♦ జొచ్చితి నార్తమతిన్ దపించుచున్.

తలా—ప్రహ్లాదా ! ఒక్కమాటలో తేలిపోవుదాని కింతయాగడ మేల ? ఈయెల జవ్వనం బేటికి వృథావ్యయము సేసి ప్రాణములకుఁ గూడ నీళ్లు వదలెదవు?

ప్రహ్లా—నే నొక్కఁడను లేకున్న జగము కొఱఁతపడి పోవునా?

క. జీవము ధనమును గోరుచు
భూవరులను వేల్పు లనుచు ♦ బూజించెడియా
కేవలమూఢాత్ముఁడు నర
కావాసము నొందు శోక ♦ కంపితుఁ డగుచున్.

లీల—ఓతలారులారా! మీరు నాపుత్త్రుని వీడరా? నాయనా? ఓసర్వేశ్వరుఁడా! నీయాశయ మీకుమారప్రహ్లాదుని నల్పాయుష్కునిఁ జేయుటయే నిక్కమా? అయ్యో! నాదుఃఖ మెట్లు సహింపఁ గలను? నే నెట్లు జీవింపఁగలను? (అంజలి యొడ్చి)

సీ. నిరుపేదలకు నెల్ల ♦ నిత్యాన్నదానంబు, గావింతు ప్రహ్లాదుఁ ♦ గావ రయ్య!
మార్గంబులను సత్ర ♦ మంటపంబులఁ బెట్టి, పూజింతు నాపుత్త్రుఁ ♦ బ్రోవరయ్య!
యతి యనాథల శర ♦ ణాలయంబులు గట్టి, యర్చింతు నాబిడ్డ ♦ నరయరయ్య!
సర్వకలాపార ♦ శాలలు నెలకొల్పఁ, జేతు నాతనయు ర ♦ క్షింపరయ్య!
చేతనైనపుణ్య ♦ పూతకార్యంబులు
సల్పెదీకుమారు ♦ సాకరయ్య!
శాంతదాంతులార! సర్వేశకొఱకు నా
సుతుని మీరు కరుణఁ ♦ జూడరయ్య!

ప్రహ్లా—తల్లీ! నాబ్రతుకున కేల యింతగాఁ దలపోసెదవు? నావంటివా రెందఱీ జగంబున జన్మింపలేదు? ఒక్కసారి స్మశానవాటిక కరిగి చూడుము! ఎంతటివారు భస్మీభూతులై గాలి కెగిరిపోవుచున్నారో! వారి చేలీలయైన భూమిపైఁ జిత్రింపఁబడియున్నదా? లేదు. ఈజీవితములు స్వప్నస్థదీపికల వంటివి. ఆకాశమునఁ దోఁచుగంధర్వవిమానములు కేవలప్రకృతివికారములు గాని శాశ్వితంబులు గావు. కాలము ననుసరించి యుత్పత్తివినాశములు వాటియంతట నవే రా నేర్చును. యనురాగము బంధావస్థ గలదై సుఖదుఃఖరూపాభాసమును గలిగించుచుండును. కావున నన్నియుఁ బరమేశ్వరసమర్పణంబున నిశ్చింత వై యుండుట భద్రము. తల్లీ! నన్నుఁగూర్చి నేఁటినుండి సంపూర్ణముగా మఱచిపొమ్ము. ఇదే నీకుఁ గడపటినమస్కారము.

తలా—ప్రహ్లాదకుమారా ! నీవిట్టులమాటలలోఁ బెట్టి జాలము చేసినచో బలవంతముగాఁ గొనిపోఁబడుదువు.

లీల—అయ్యో !(స్వగతమున) ఏమిదుఃఖము నాకంటఁ బడునోగదా ! (ప్రకాశము) ఓతలారులారా ? మఱికొంతసేపు శాంతింప లేరా ? పోనిండు.

తే. గీ. నేనె నిజపతివ్రతనైతి ♦ నేని నాదు
సూనుఁడే పుణ్యధనుఁడైన ♦ జ్ఞానియైన
నష్టదిక్పాలు లడర నా ♦ రాయణుండు
వచ్చి నాపుత్త్రు నరసి కా ♦ పాడుఁగాక.

ఆకాశవాణి—

తథాస్తు.

(యవనిక దిగిపోవును.)

# దానవవధ.

## షష్ఠాంకము.

రంగము—మహారణ్యము.

(దేవేంద్రుఁడు శచి ప్రవేశించి యుందురు.)

దేవేం—(సాలోచనుఁడై) ఓపరమేశ్వరుఁడా! నీకింకను దయ రాలేదా?

చ. అలుక వహించి దైత్యులభ • యంబున మాయమరావతీపురం
బులపయిఁ గారుచిచ్చులను • బోలి నశింపఁగఁ జేయ, నిండ్లలో
నిలువఁగలేక మే మిటుల • నీ రయిపారుచు నెన్నినాళ్లీ
యలికులవేణులన్ గొని మ • హాటవులన్ దిరుగాడఁగావలెన్.

చ. నిలువగ నీడలేదు నడ • నేర మరణ్యము సూదిరాళ్లలో
పల నెటు బోయినన్ దనుజ • వర్గము క్రూరవధావిధానసం
కలితమనస్కులై యెదుటఁ • గన్పడు గుండెలు దిగ్గురంచు దృ
క్చలనము గల్గుచుండెఁదలఁ • గావికొనన్ శరణంబు లే దిఁకన్.

ఉ. కన్నుల నీరుకార్చుశచి • కాంతను జూడఁగలేను దేవతా
కిన్నరబంధువర్గముల • ఖేదములన్ వినలేను నిర్జరుల్
చెన్నరి పంటకాపులటు • చేలను గుయ్యిడుచుండి రక్కటా
యెన్నటిపాపమో దెలియ • దీశ్వరచద్ధియము దాఁటశక్యమే.

శచి—నాథా! నే నింక నీసూదిరాళ్లపై నొక్కయడుగైన మోపలేను. నాతల తీవ్రాతపంబుచే మాడిపోవుచున్నది. నాగొంతుక తడియారి నోటమాటైనను రానిచ్చుట లేదు.

దేవేం—దేవీ! ఒకింత సహించుకొనుము. ఆసమీపమున నొకయాశ్రమ మున్నట్టు లున్నది. అచ్చటకు బోయి సేదఁ దీర్చుకొందము రమ్ము.

శచి—యోపికయు నాకు లేదు. నేనిం దొక్కడుగైనను మోప జాలను. (అని కూర్చుండును.)

దేవేం—నీ విట్లారడమొందిన నే నేమిసేయ నోపుదును ?

సీ. ఉయ్యెలలను బెట్టి♦యూఁపించుటకు మన, నిజగృహం బిది గా ద♦నింద్యచరిత
భర్మశయ్యలపైని ♦ బవళింపఁజేయఁగ, మనవాస మిది గాదు ♦ వనజగంధి
వనసీమ కుసుమవా ♦ సనలు జల్లెడు చోట, గమనింప మనకోట♦గాదు చెలియ
అడుగు మోపినచోట ♦ మడుగు లొత్తుట కిట, మనవారికలు లేరు♦మందయాన

అలఘువై భవముల ♦ నలరారుటకు నిఁక
మనకు రాజ్య మేది ♦ మంజువాణి
నేఁటినుండి నీవు ♦ నిరుపేద యిల్లాలు
తలఁప కింకఁ బొంటి ♦ కలిమి చెలిమి.

(ఒకవంక నుండి యొకఋషియును మఱియొకవంకనుండి యొకబృందార కుఁడును బ్రవేశించును. వారిని దేవేంద్రుఁడు చూచి)

దేవేం—వీ రెవ్వరో యిక్కడనుండియే కనుంగొనియెదఁ గాక.

ఋషి—అక్కటా ! యీరాక్షసహతకులచే నడవుల దాఁగొన్నమేమును నలిగిపో వలసినదేనా ?

చ. జటలని మట్టియూడలని ♦ జానువిలంబితకేశజాలముల్
కటకటఁ ద్రెంచి మీసములు ♦ గడ్డములన్ బెకలించి లాగి పు
మ్మటమటఁ బెట్టుచుండిరి సు ♦ రారులు యజ్ఞహవిస్సులియ్య మం
చటవుల నున్న మాకు విప ♦ దబ్ధులు తప్ప విదేమి కాలమో.

దేవేం—పాప మీసాధుఋషుల కెంతయాగడము వచ్చినది. కాలము తప్పవచ్చిన ఋషులేమి రాజులేమి అందఱును సమానమే.

బృందా—ఇం కెక్కడ వెదకవలయును ?

మ. ప్రతనం బైనచతుర్దశాదిభువన ♦ బ్రహ్మాండముల్ మెట్టి వ
చ్చితి మం దెచ్చట వజ్రి గానఁబడఁ డే ♦ చిచ్చంటెనో వార్ధిలో
బ్రతుకం జాలక గూలెనో సతులతోఁ ♦ బ్రాణంబు పైరోతతో
వెతకన్ రాఁడు గదా బలారి యకటా ! ♦ వేలీల లల్లాడినన్.

ఋషి—ఈవెత లన్నియు దేవేంద్రునితో మొఱ్ఱ పెట్టుకొనవలయునని యీగిరిగ హ్వరము లన్నియు వెదకి వెదకి వచ్చితిని. వానిజాడ యెక్కడను గాన రాలేదు.

దేవేం—దీనుఁడైన దేవేంద్రుఁ డిక్కడనే యున్నాఁడు.

ఋషి— చ. అడవుల నున్న మానెలవు ♦ లన్నియు నగ్నికి నాహుతించి మా
పడఁతుల నెల్ల దుర్వ్రతల ♦ పా నొనరించి పశువ్రజంబులన్
గడువడి నోళ్లతోఁ గొఱికి ♦ కన్నున రక్తము పీల్చి చంపు మా
బుడుతలనెత్తి వైచు దితి ♦ పుత్త్రులపాత్రులు లోకశత్రులై.

బృందా—ఎంత కెంత వచ్చినది !

మ. అసమానప్రళయానలప్రతిభ స ♦ మ్యగ్దారుణాభీల మై
వెసఁ జెండాడెడువజ్రమున్ రథములున్ ♦ విద్యుత్ప్రభాకారులం
దసువుల్ పోవనిసైనికుల్ గలిగి క ♦ ట్టా ! యోడె దేవేంద్రుఁ డా
యసురవ్రాతముఁ దాఁకలేక హరిమా ♦ యం గాంచఁగా శక్యమే.

దేవేం—బృందారకా ! నీ వన్నది నిజము. ఎన్ని యున్న నేమి దైవబలము యెదుట నన్నియు దుర్బలములు.

ఋషి—అక్క డెవ్వరో నావలెనే యే మేమో గొణుగులాడుకొనుచున్నారు. పోయి యడిగెదఁ గాక. (సమీపించి) ఓ యార్యసత్తమా ! నీ వెవ్వరు ?

బృందా—(స్వగతమున) ఈతఁడెవ్వరో సాధుతపసివలెనున్నాఁడు. (ప్రకాశముగా) ఋషిసత్తమా ! మాది పూర్వము అమరావతి.

ఋషి—ఓహో ! నీవు దేవతలలోని వాఁడవా ? నీకు జయ మగునుగాక, నాయనా దేవేంద్రుని నెందైనఁ గాంచితివా ?

బృందా—ఆసంగతియే మి మ్మడుగ దలఁచుకొనుచున్నాను.

దేవేం—నాగుఱించి వీ రింతతడుముకొననేల ? నేనే యెదురుగాఁ బోయి కలిసి కొనియెదఁ గాక ! (అట్లు చేయును.)

బృందా—ఓహో ! మాప్రభుఁ డిదే ప్రసన్నుఁ డయ్యెను. నేఁ డెంతభాగ్యము. (అని చేతులు మోడ్చి) ఓదేవేంద్రమహారాజా!జోహారు. (అనికాళ్లకెరఁగును.)

ఋషి—దేవేంద్రా ! జయము. జయము.
దేవేం—ఓఋషిసత్తమా ! నీసందేశ మేమి?
ఋషి—పలలాశల బారికోర్వలేక నీ శరణుజొచ్చితిని.
దేవేం—అగును మీవిపత్తు లన్నియును వినియే యున్నాఁడను,
ఋషి—అగునుగదా ! పాకశాసనా !

తే. గీ. ఈతిభాధలఁ దొలఁగించి ♦ యిలను జార
చోరరాత్రించరాధమ ♦ స్తోమములను
దొలఁగ ముల్లోకముల నేలు ♦ దొరలు మీరు
భూరిదేవత లఁట గదా ♦ పుణ్యపురుష.

దేవేం—అగు నేమి ప్రయోజము ?
తే. గీ. దేవతల మాట నిజ మమ ♦ రావతీపు
రంబు నున్నంతవఱకుఁ ద ♦ ద్రాజ్య మసుర
నాథులు బలిమిఁ గైకొన్న ♦ నాఁటినుండి
దీనులము మేము దారిద్య్ర ♦ దేవతలము.
బృందా—నిజముగా మేము దరిద్రుల మయ్యే యున్నారము.

ఋషి—
ఆ. గీ. ఇంద్రుఁ డంతవాఁడె ♦ యీరీతి పలికిన
నింక మాకు శరణ ♦ మెవఁ డొసంగు
దారి లేదు మాకు ♦ దైవోపహతుల మై
బ్రతుకుపైని నీళ్లు ♦ వదలినాము.
(అని కమండలమునుండి నీళ్లు దీయఁ బోవును.)

(నారదుఁడు ప్రవేశించి) ఆ ! ఆఁగు మాఁగుము. ఋషిలోక మప్పుడే వినాశము కానేరదు.
(అందఱును నమస్కరింతును.)

నా—దేవేంద్రా ! నీవేల యధైర్య పడుచుంటివి ?

దేవేం—నారదమునీంద్రా! నాధైర్య మప్పుడే పోయినది. ఉన్నబృందారకుల గతి నరయుఁడు.

నా—అదియేమి ?

బృందా—మునీంద్రా! దానవలోకభర్త యగుహిరణ్యకశిపుఁడు ధూర్తభర్త వలె లెక్క లేనన్ని ఘోరములు సేయుచున్నాఁడు. యేమని విన్నవింపవలయును?

మ. సురలోకంబు జయించినాఁడు జగముల్ ♦ క్షోభింప మ మ్మందఱన్
జెఱఁబట్టన్ సమకట్టినాఁడు వసువుల్ ♦ సిద్ధామరశ్రేణియున్
హరిణీలోచనలన్ హరించి నిజరా ♦ జ్యం బైనజ్యోతిష్మతిన్
సిరులన్ ముంచి తదీయ సేవకు మమున్ ♦ బీడించు దుష్టాత్ముఁడై.

నార—అగు నగును. ఈయుదంత మంతయు మే మిదివఱ కెఱింగియేయున్నారము. దేవేంద్రా! నీకొకహితము చెప్పుచున్నాఁడను. పరమేశ్వరుఁడు నీ కత్యల్ప కాలమున నీపూర్వోన్నత్యముల నొసంగి రాక్షసుని హతమార్పనున్నాఁడు. వానిగర్వమే వానికిశత్రువై రూపర జేయును. నీవు ప్రసన్నుఁడవై యుండుము.

బృందా—మునీంద్రా ! ఇంతటితో దానవవధయైపోవునా ? మాకానంద మొన గూడునా ?

నార—అగును.

ఇది విష్కంభము.

రంగము—సభామంటపము.

(హిరణ్యకశిపుఁడు, మంత్రి, చండామార్కులు ప్రవేశించియుందురు.)

హిర—అమాత్యచూడామణీ !

మ. నాపేరున్ ద్విజు లీశ్వరుంబలె నొగిన్ ♦ సంధ్యార్చనాదిక్రియా
రూపోపాసవలన్ దలంతురె హరిన్ ♦ క్రోధించి తద్దాసులం
గాపట్యంబున ద్రుంతురే యమరులన్ ♦ గారించి తత్కాంతలన్
రాపాడింతురె దాస్యవృత్తిని వడిన్ ♦ మత్పౌరు లుల్లాసులై.

మంత్రి—దేవా ! దానవరాజచంద్రా ! మనరాజశాసనప్రకార మన్నియు బీరువోక వెల్లుచున్నవి. అందు కేమైనసంశయ ముండునా ?

మ. పగలున్ రేయును సంధ్యలున్ గలుగున ♦ బ్జాతోద్భవాండంబులో
నొగులన్ బోవవు సూర్యచంద్రులును ని ♦ న్నుం గూర్చి దర్శింపఁగా
గగనంబందు జరింతు వర్షములు నే ♦ డ్కన్ నీకు వర్షించు నీ
జగమం దీవ పరాత్పరుండవసుర ♦ జ్యానాథచూడామణీ.

మఱియు.

ఆ. గీ. స్వర్గమధ్యలోక ♦ పాతాళములయందు
దిక్కులందు యజ్ఞ ♦ దీక్షలందుఁ
గడఁగి "ఓంహిరణ్య ♦ కశిపాయనమ" యని
మొదలుపెట్టు శుభము ♦ లొదవ ద్విజులు.

ఆ. గీ. ద్విజులుసంధ్యలందు ♦ దివిజులు శశులందుఁ
బూజసేయునపు డ ♦ పూర్వలీలఁ
గడగి "ఓంహిరణ్య ♦ కశిపాయనమ" యని
ముక్కుమూసి నీకు ♦ మ్రొక్కుచుంద్రు.

హిర—అ స్తికవివాదు లేమనుచున్నారు ?

మంత్రి—వారలయాడంబరమును నమసిపోయినది.

చ. హరి గిరి యంచుఁబల్కుచు వృ ♦ థాస్తికశుష్కవివాదమాడునె
ల్లరు భవదీయపాదకమ ♦ లంబులు గొల్చుచుఁ దొల్లివాదముల్
మఱచిరి సర్వశక్తుఁ డన ♦ మానపరాక్రముఁ డీవుఁ గల్గఁగా
నొరులకు నెట్లుగల్గు పర ♦ మోత్తమ మౌపరమేశ్వరత్వమున్.

హిర—బందిగమున నెవరైన విడువడినారా ?

మంత్రి—ప్రహ్లాదునిబోధనంబునం బోయినవారెల్లరు చెఱసాలయందే పడియున్నారు.

తే. గీ. జవ్వనం బసువనికి వ ♦ సంత మనఁగ
నొప్పుసౌందర్యనిధు లైన ♦ యువకయువతు
లశ్రుజలముల వనముని ♦ రంతరంబు
దడుపుచు వసించుఁ జెఱసాల ♦ దైన్యలీల.

హిర—మనదేవలోకపరిపాలన మెట్లున్నది ?

మంత్రి—మనశాసనము లన్నియు నిరంకుశముగా సాఁగుచున్నది.

సీ. స్వాతంత్ర్యముల నెల్ల సమయింపఁగాఁ జేసి, దాస్యవృత్తినివారి ♦ చార్చినాము
ఎండ కన్నెఱుఁగని ♦ నిండుజవ్వనులను, నాలమందలరీతి ♦ దోలినాము
విభవంబులను విఱ్ఱ ♦ వీఁగువారలచేత, భిక్షపాత్రము దెచ్చి ♦ పెట్టినాము
నిరతంబు వైరంబు♦పురికొల్పి ప్రాణార్థ, ముల లాగుసూత్రముల్ ♦మలపినాము
పాఠశాల లన్ని ♦ పడఁద్రోసినారము
శిల్పివిద్య లన్ని ♦ చెఱచినాము
ప్రజల నప్రయోజ ♦ పఱచుటయే గాక
వంచినాము వగల ♦ నించినాము.

క. మే మెటు లీదేశంబున
క్షామముచే బాధపడుచుఁ ♦ గడపితిమో నేఁ
డామాడ్కి దేవగణములు
క్షేమంబులు బాసి యిడుమఁ ♦ జెందుదు రధిపా.

హిర—ఇంతటితో మనవైరము పూర్ణముగాఁ దీఱినది. ఆచార్యపుత్త్రులారా ప్రహ్లాదునిసంగతి మీ కేమైనఁ దెలిసినదా ?

చండ—తెలియ కేమి ?

చ. దనుజుఁడు గాఁడు నీసుతుఁడు ♦ దానవలోకసుధాపయోధియం
దనలములీలఁ బుట్టినవి ♦ షాగ్నిసుమా ! హరిదాసుఁ డంట కీ
ర్తనములఁ బాడునంట యొక ♦ దైవమునేరె కలండటంచుఁ దా
మనమున నమ్మియుంట యవ ♦ మానము నీకును మాకు జాతికిన్.

మార్కుఁడు—దైత్యేశ్వరా ! నీప్రహ్లాదకుమారుఁడు ఒక్కఁడే చెడలేదు. వానిని జూడవెళ్లనవారల నెల్ల తనవైపునకుఁ ద్రిప్పుకొనుచున్నాఁడు. ఆయాకర్షణ

మంత్ర మేమో తెలియరాదు.

ఉ. ఎక్కడఁ గంటి వీసుతుని ♦ హీనుని రాక్షసలోకనాశనం
బిక్కరణిన్ బొనర్చుటకు ♦ నేవిధి నోములు నోచినావొ మా
క్రుక్కడిరక్కసార్భకుల ♦ ముందరఁ బెక్కులు బుద్ధనీతులన్
బక్కునఁ జెప్పి వారి హరి ♦ భక్తులఁ జేయునిదేమి చిత్రమో.

చండు—ఇది నిజముగాఁ జిత్రముగనే యున్నది.

హిర—నాయాశ్వరత్వమును నాతఁ డింకను సమ్మతింప లేదా ? సరే వానికి విధించి నశిక్షలకయిన లొంగి కార్యసాధకుఁడగును.

మంత్రి—లేదు. ఆశిక్షలకు మఱియొకఁడైన చచ్చియే పోవును.

హిర—వాఁ డంతతీవ్రమతియై యున్నవాఁడా ?

మంత్రి--అగును. దీనిపర్యవసాన మేమికానున్నదో తెలియ కున్నది.

తే. గీ. బలయుతుండ వీవు ♦ ప్రహ్లాదుఁ డభయుండు
చంప నుంటి వీవు ♦ చావఁ డతఁడు
హరికి వైరి వీవు ♦ హరిభక్తుఁ డాతఁడు
ఇట్టితండ్రి కొడుకు ♦ లెందుఁ గలరు ?

(శుక్రాచార్యులు ప్రవేశించును. అందఱు లేచి నిలువంబడుదురు.)

హిర—ఆచార్యోత్తమా ! నమస్కారము. ఈయాసనంబున నధిష్ఠింపుఁడు.

శుక్రా—(కూర్చుండును.) దైత్యేశ్వరా ! నీ వేల నేఁడు దీర్ఘచింతాకులునివలె నున్నావు ?

హిర— అగును. రెండవ దే మున్నది ?

చ. దనుజకులానఁ బుట్టి ప్రమ ♦ దంబున లోకభయంకరాకృతిన్
గనలి సురేంద్రచంద్రుల వి ♦ కావికల ట్లొనరించి శౌర్యసా
ధనమునఁ గీర్తిఁ గాంచఁగల ♦ పుత్త్రుఁడు పుట్టక నాదువంశకా
నను విషవృక్షమున్ మొలిచె ♦ నా కిటు చింత గలుంగు టబ్రమే.

శుక్రా — నావంటిమిత్త్రుఁడు నీ కుండియు నీహృదయక్షేత్రమున పాతుకొని ప్రవృద్ధ మగుచున్నఖేదలతాంకురమును పెఱికివేయ కుండుటకంటె వెడగేమున్నది?

హిర—నాయందుఁ దమ కున్న యనురాగమున కే నెంతయు ధన్యుఁడ నగు చున్నాను.

శుక్రా—ప్రహ్లాదునిఁ గూర్చి నీవు వ్యాకులపడవలసినపని లేదు.

హిర—మఱి యెవనినిగూర్చి ?

శుక్రా—వాఁడు నీ కహితుఁడు గాఁడు. ఇప్పుడు నీవు శతవృద్ధుఁడ వైతివి. త్రిలోకంబులు జయించితివి. కీర్తి గాంచితివి. ఇంక నెవ్వ రేలా గుండిన నీ కేమి ? నీ వీతగులంబు లన్నియు జాలించి నీపుత్రునకు రాజ్యము నొప్పగించి నీ వేకాంతుఁడవు కమ్ము.

హిర—గురువర్యా ! తమయాదేశము పరమపూజ్యము. కాని ప్రహ్లాదుఁ డంతయోగ్యుఁడు గాఁడు.

ఉ. రాక్షసపీఠ మెక్కఁగల ♦ రాజు త్రిలోకము లొక్కపెట్టునన్
వీక్షణముల్ నిగుడ్చిన ద ♦ హింపవలెన్ గద చేతఁ బూనినన్
యక్షసురప్రకాండము గృ ♦ హాంగణపంక్తులు వీడి దీను లై
భిక్షము లెత్తఁగావలయు ♦ వీరరణంబున ముక్తకాంతలై.

కావున నాపుత్రుఁ డట్టివీరశౌర్యలక్షణలక్షితుఁడు గాక వృథాప్రాగల్భ్యదుర్వైదుషీదుర్విదగ్ధుఁడై వికృతమానసంబున నావైరివర్గంబును గూడి నన్నధిక్షేపించుచున్నాఁడు.

శుక్రా—బాల్యచాపల్యమున నొకవేళ వాఁడు నీ కహితంబు లాడినను క్రమముగా శిక్షితుఁడై నేర్చికొనఁగలఁడు. నీ వింక శాంతినిఁ బడయుము.

తే. గీ. మొగ్గనాఁడు వాసన లేని ♦ మొల్లపువ్వు
వీడి సౌగంధమున వెల్లి ♦ విరిసినట్లు
నీసుతుఁడు యౌవనారంభ ♦ వాసరముల
శౌర్యలక్షయుతుఁ డయి ♦ సంతరించు.

హిర—అట్లు నే నెంతమాత్రమును నమ్మఁజాలను.

తే. గీ. మొదట లేనిగుణము ♦ లుదయింప వికమీఁద
సింహమునకు గ్రామ ♦ సింహ మొండు
పుట్టినను బిడాల ♦ ములు పట్టఁ జనుఁగాని
గజచయంబు పట్టఁ ♦ గలదె చెపుమ.

శుక్రా—అట్టు లుద్దేశింపవలసినపని లేదు. నీతనయుఁడు సకలపురుషార్థసమన్వితుఁడై జగద్విక్రాంత మైనకీర్తిని బడసి నిన్నును నీకులమును దరింపఁజేసి సముద్ధరింపఁ గలమహానుభావుఁడు.

హిర—వాఁ డిప్పుడు నావైరులలోఁ గలసి యున్నాఁడని మీ రెఱుంగుదురా ?

శుక్రా—అది యెంతమాత్రము నిజము గాదు. నీ వట్టు లూహించుట కేవలము గర్హ్యము.

హిర—మీ రభిమానముగా మాట లాడుచున్నా రా యేమి ?

శుక్రా—మా కేమి కావలయును ? నీసుతుఁడు సుగుణసంపన్నుఁడు గావున నే నింత వఱకుఁ జెప్పవలసి వచ్చినది.

హిర—లేదు. మీరు కేవల మభిమానపూర్వకముగాఁ జెప్పుచున్నారు. నాతోఁ గయ్యమునకుఁ గాలుదువ్వుచున్నదురాత్ముఁ డైనకొడుకు నింటఁ బెట్టుకొని కులమును నీరుసేయుటకంటెఁ దెగటార్చి యశంబున నింపుట మంచిది.

శుక్రా—అయ్యో ! ఇంతమాత్రమునకే తెగటార్చెదవా ?

హిర—ఇంకెంత కావలయును ?

శుక్రా—అతఁడు నీపుత్రకుఁ డని యెఱుంగుదువా ?

హిర—నే నున్మత్తుఁడను గాను.

శుక్రా—కాదు కాదు. వానియందు నీ కొకింతయైన ప్రేమ లేదా ? అని యడిగితిని.

హిర—నాయందు భక్తి లేనివానియెడలఁ బ్రేమ జూపు టెందులకు ?

శుక్రా—నీయం దాతనికిఁ బితృభక్తి సంపూర్ణముగా నున్నదని నేను నొక్కివక్కాణింపఁగలను.

హిర—పితృభక్తి సరే. ఈశ్వరభక్తియో.

శుక్రా—(నిరుత్తరుఁడై తలను వంచి స్వగతమున) ఈదురాత్మునితో నే నేమి చెప్పినను జిక్కె పొసంగును.

హిర—గురువర్యా ! నిరుత్తరులై యేమి యూహించుచున్నారు ?

శుక్రా—నీయీశ్వరత్వమును నాతఁడంగీకరింపనిమాట వాస్తవమైనదే గాని వానిని నీవు బలవంతపెట్టిన నేమి కార్యము ? భక్తి ఆత్మీయమైనది కావలయును గాని బాహ్యాండంబరముఁ జూపుటకైన నేమి ప్రయోజనము ?

క. ధనమును నధికారంబును
మనమునఁ గాంక్షించి బ్రహ్మ ♦ మార్గముతోఁ బ్రా
ర్థన మొనరించిన ఫల మే
మనఘా సంస్కార మాత్మ ♦ యందున వలయున్.

హిర—ప్రపంచమం దట్టివిజ్ఞానదన్యులు కొందఱే యుండెదరు.

క. నిజమని యెఱిఁగినదానిని
బ్రజ లామోదించి వేయఁ ♦ బాల్పడరదియున్
రజనీచరవృత్తిని స
ద్భజనము నెలకొల్పవలె స ♦ తం బసిధారన్.

శుక్రా—అసిధారచే సద్భజనము వ్యాపింపఁజేయుట కడుదుర్లభము. హితమున విషము ద్రావింపవచ్చును గాని అహితమున నమృతమైనను బట్టించ లేరు. ఇట్లెందఱిని వధించి నీమంత్రమును బాడించెదవు ?

హిర—ఈప్రహ్లాదుఁ డొక్కఁడుతప్ప నాయీశ్వరత్వమందఱు నంగీకరించినవారే.

శుక్రా—సరే. వాఁడు ఒప్పఁ డనుకొనుము. వాని నిప్పు డేమిచేయుదువు ?

హిర—ఆజ్ఞాబద్ధుఁడు గానివాని కేమిచేయఁబడునో అదియే.

శుక్ర—వాని నిదివఱకే తెగటార్పఁబంచితివి గదా ! తలారులు నీయాజ్ఞోల్లంఘన మొనరించిరా యేమి ?

హిర.—నాతో మీరు మంతనములాడుచున్నారా ?

శుక్రా—కాటికిఁ గాళ్లు బాఁపుకొని యున్ననాకు నీతో మంతనములాడుట కేమి పని ? నీతనయుఁ డవధ్యుఁడు. వానిని దండించుట నీకు పాపహేతుకము. తుదకు నీవు విఫలమనోరథుఁడ వై చెడుదువు. అదియైశ్వర్యకాలమునకు శ్రేయము గాదు. నామాటలు నమ్ముము. శిష్యవాత్సల్యమున నెంతవఱకుఁ జెప్పుటకు యోగ్యమో చెప్పి మాభారము తీర్చుకొంటిమి. నీవువినకున్నాఁడవు కావున ననుభవించెదవు. మే మిదే పోవుచున్నాము. (అని యాసనమునుండి లేచును.)

హిర—సరే! నేను జెడినప్పుడు గదా! ఇట్టిసంగతులకు నేను లక్ష్యము చేయు వాఁడనుగాను. మీరు నాచెడుగు కోరుచున్నటు లున్నది.

శుక్రా—నామాట లిప్పుడు నీకు వెగటుగాఁ దోఁచుచున్నవి.

హిర—అవును. మీరు నాయెడఁ గృతఘ్నతఁ జూపుచున్నారు.

శుక్రా—నీకు మేము క్షేమము గోరుట లేదా ?

హిర—లేదు, ముమ్మాటికిని లేదు.

శుక్రా—లేదని నీ వెట్లు తెలిసికొంటివి ?

హిర—ప్రహ్లాదునిపక్షమున మాటలాడుట లేదా ?

శుక్రా—నీకొడు కైనప్రహ్లాదుని గరునమాలి బాధింపవలదని హితోపదేశము చేసి తినిగాని నీ కీడునుతలపెట్టితినా ?

హిర—గర్భీకృతమైయున్న దేమో యెవ రెఱుంగుదురు ?

శుక్రా—సరే! నీ కట్టియనుమాన మున్న నింకఁ జెప్పుట కేమున్నది? కాని నీవు,

శా. యుక్తాయుక్తము లెక్కసేయక దురు • ద్యోగంబునన్ జేసి సు
వ్యక్తుం డై నకుమారుఁ జంపుటకు నై • యత్నించుచున్నాఁడ వా
భక్తుం డెప్పుడు చావబోఁడు భవ • త్ప్రాణాంత మౌఁగాని నా
సూక్తుల్ తప్పవు మిన్నుమ్రోతలని లో • నూహింపుదై తేశ్వరా.

(అని రెండడుగులు వేసి)

ఉ. నీపరమేశ్వరత్వమును ♦ నిర్ణయమున్ బొనరింపలేక వి
ద్యాపరిపూర్ణుఁడై నసుతు ♦ ప్రాణము దీయఁగ నున్నవాఁడ వీ
పాపము లాచరింపుచుఁ గృ ♦ పామతి నెంచక నెంత కాలమున్
గాపురుషుండ వై వసుధఁ ♦ గాపుర ముందువొ బావకుండఁగన్.
(అని నిష్క్రమించును.)

హిర—ఈతఁడును మావైరమునే సాధింపుచున్నాఁడు.

చండా—దైత్యేశ్వరా ! శతవృద్ధుఁడై మతిపోయినమాతండ్రిమాటలను బాటింప కుము. నీకార్యముల కెవ్వరైనఁ గళంకము పెట్టఁగలరా ? సర్వలోకారాధ్యుఁడవు. జగంబులకుఁ గర్తవు. నీకు వినా అన్నియు నసత్యములు. అనిత్యములు. మాంపాహి దేవా ! మాంపాహి.

హిర—మీరు గృతజ్ఞతకు నిదానములు గావున నీపారితోషికములఁ గైకొనుఁడు.
(అని విలువైన నగలొసంగును.)

చండా—(గైకొని) జయము జయము మహారాజా !

హిర—మంత్రీశ్వరా ! ప్రహ్లాదుఁ డింకను రాలే దేమి ?

మంత్రి—వచ్చువేళయైనది.

ప్రహ్లా—(తలారులతోఁ బ్రవేశించును.) ఓసర్వేశ్వరా ! నీ కనేకవందనములు.

ఉ. చక్రివి నీవు గాన రవి ♦ చంద్రవసుంధరలందుఁ గాలమున్
జక్రములట్లు ద్రిప్పుచును ♦ చాటుచు నుంటివి నీమహత్వ మి
చ్ఛాక్రియ సర్వశక్తుఁడవు ♦ సామివియయ్యు మదీయప్రాప్త పుం
జక్రము గూడఁ ద్రిప్పెదు వి ♦ చార్యము గావు త్వదీయవైడముల్.

తలా—ప్రహ్లాదకుమారా ! మహారాజు సమ్ముఖమున కెదురుగా నడువుము.

ప్రహ్లా—(అట్లు చేయును.)

చండా—ప్రహ్లాదా ! జగదీశ్వరుండును, ఈశ్వరుండును, అయినయిమ్మహారాజునకు నమస్కరింపుము.

ప్రహ్లా—రాజులకు రాజైనసర్వేశ్వరునకుఁ దప్ప నే నొరులకు నమస్కరింపను.

హిర—అపురా ! నీ వింకను విరోధిపక్షములు మానలేదు గదా ! నీ వెంత దుర్మార్గుఁడవు ? నిన్నింక సాధించుట యెట్లు ?

తే. గీ. మత్తనూజుఁడ వయ్యు నా ♦ మానసంబె
కాల్చుచున్నావు వైరులఁ ♦ గలసి నేఁడు
ఇంటిదీపంబె చూరున ♦ కంటినపుడు
కాల్పదే చిత్ర మిందేమి ♦ గలదు చెపుమ.

మంత్రి—ప్రహ్లాదా ! ఇంకనైన నీబుద్ధిని మార్చుకొనుము.

హిర—నన్నుఁ జూచి నావైరు లందఱు నవ్వుచుందురు గాఁబోలును. అయ్యో !

ఉ. అంచితకీర్తిశాలి సుగు ♦ ణాన్వితవర్తియుఁ జక్రవర్తి రా
త్రించరపీఠ మెక్కఁగల ♦ తేఁడు సురేంద్రనగేంద్రపాళిభే
దించెడు శౌర్యవంతుఁ డని ♦ తెల్పిరి గాని త్వదీయజాతకం
బించుకఁ జెప్ప రీవిధిని ♦ హీనదురాత్ముఁడ వంచు జ్యౌతిషుల్.

ప్రహ్లా—తండ్రీ ! నీయాత్మ కంతఖేదదాయక మై జనియించిన నే నెంతయు దుర దృష్ట వంతుఁడను.

హిర—నన్నారాధించి నీ వేలయదృష్టవంతుఁడవు గాఁ గూడదు ?

ప్రహ్లా—నీ వీశ్వరవైరము మానుకొనియెదవా ?

హిర—(చెవులు మూసికొని) ఓరీ ! ఎట్టియసంగతము లాడుచున్నావు ? నాద్రోల నీయీశ్వరుండును నాకంమును సమానములు. ఈశ్వరాదినామములు గల పదార్థము లేనే లేదు. అది కేవలము కల్పితము. గగనాదుల కాశ్రయ మైనది. ఎవనినీశ్వరసర్వజ్ఞత్వాదినామములచే వాడెడుజగత్ప్రతీతి గలదో అతఁడే నేనని యెఱుంగుము. నాకన్న నితరము లేదు. నేనే పరబ్రహ్మ స్వరూపుఁడను.

ప్రహ్లా—(స్వగతము) స్వస్వరూపజ్ఞాననిమగ్ను లైనయోగుల తెఱంగున మాయా విమోహితు లై నప్రబోధకులు వేదాంతవాక్యపఠనంబున నహమస్మీబ్రహ్మే

త్యాదిశ్రుత్యర్థప్రతిపాదకపరబ్రహ్మమును దామేయని వచించినట్లు కేవల దురహంకారనిమగ్నుఁడై నమజ్జనకుఁ డాశ్రితస్తోత్రపాఠంబులకు మోసపోయి యెంతభ్రాంతుఁ డగుచున్నాఁడు. (ప్రకాశముగ) నాయనా ! నీ వీశ్వరుఁడవు గావు ముమ్మాటికిని గావు. నీకన్న విలక్షణమైనమఱియొకఁ డీశ్వరుఁడు గలఁడు.

హిర—ఔరా ! వృథాప్రాగల్భ్యదుర్విదగ్ధా ! నన్నజస్రము తిరస్కరించుటకుఁ గంకణము కట్టుకొంటివి గా ! సరే ! నీయౌద్ధత్యమెంతవఱకు సాఁగివచ్చునో చూచెదఁ గాక. ఓరీ తలారులారా ! ఈతనిఖండింపక మీరేల కరుణించి విడిచిపెట్టిరి ? మిమ్మీతఁడేమైనఁ గావుమని బ్రతిమాలినాఁడా ?

తలా—లేదు స్వామి ! మాయావచ్ఛక్తిని వినియోగించి పలుతెఱంగుల దండించితిమి గాని యీతఁ డేదానికిని వశంవదుఁడు కాలేదు.

చ. గదలను మొత్తినా మితని ♦ గాల్చితి మగ్నిని వ్రేల్చి యాజ్యమం
దుదధిని ద్రొబ్బినాము గజ ♦ యూథముచేఁ బొడిపించినార మే
యదవద నొంద డెంతటిమ ♦ హాత్ముఁడొ నీతనయుండు వీనిహృ
త్సదనమునందు దాఁగొనిన ♦ సామి యెవండొ యెఱుంగ శక్యమే.

హిర—ఔరా ! దురాత్ములారా ! ఇట్లు చెప్పమని యీతఁ డేమైనలంచము లిచ్చియున్నాఁడా ! లేక కండ్లకావరమున మత్తెక్కి కృతఘ్నులైన న్నదిక్షేపించుచున్నారా ? నాప్రతాపభయ మొకింతయు మీకు జంకును బుట్టింపలేదా ? (అని పండ్లుకొఱుకుచు) ఓద్వారపాలకులారా !ఇటు రండు.

ద్వార—(ప్రవేశించి) దేవా ! యేమి యనుజ్ఞ యగుచున్నది ?

హిర—ఈతలారులను జెఱసాలయం దుంచుఁడు.

ద్వార—చిత్తము దేవా ! (అట్లు చేయుదురు.)

ప్రహ్లా—(అపవారించి) ఓతలారులారా ! మీకుఁ బరమేశ్వరుఁడు మేలుచేయును గాక !

తలా—మా కీపాపకార్యములకంటెఁ జెఱసాలయే మేలు.

(అని నిష్క్రమింతురు.)

హిర—ఔరా ! ప్రహ్లాదా ! నీయజ్ఞానమును విడచి నీహరిభజనము మానవు గదా ! ముమ్మాటికిని మానవు గాదా ?

ప్రహ్లా—నాయనా ! హరిభజనము మాని వేయున దేమున్నది ?

శా. అజ్ఞానప్రతిబంధకక్షయముప ♦ ర్యంతంబు తాదాత్మ్యదు
ష్ప్రాజ్ఞావంతుఁడె గాని వాని కలజీ ♦ వత్వాద్యవస్థాక్రియా
జిజ్ఞాసల్ నశియింప వెంతయు మదిన్ ♦ జింతింవి సంపూర్ణబ్ర
హ్మజ్ఞానం బుదయించుదాఁక హరిస ♦ ర్వాత్మున్ భజింపన్ దగున్.

హిర—ఏమి నీక్రౌర్యము ? నీహరికన్న నే నధికుండను గావున నన్నేలప్రార్థింప రాదు ?

ప్రహ్లా—సర్వాత్మకునియందు నీవలెఁ బ్రాగల్భము లేదు.

హిర—అగును, వాడు నే నుండఁగ నెట్లు గర్వింపఁ గలఁడు ?

ఉ. లోకము లన్ని గెల్చితిని ♦ లోకిని సర్వదిగంతభూములన్
నాకు విరోధి లేఁడొకఁడు ♦ నాకపురీశులు నన్నె గొల్తు ర
స్తోకమతిన్ మహామహిమ ♦ తో నుదయాస్తమయంబు లన్ని నా
యేకరబద్ధమై వెలయు ♦ నింకఁ బరాత్ముఁ డెవండొ చెప్పుమా ?

ప్రహ్లా—అగును గాని.

ఉ. లోకము లన్ని గెల్చితివి ♦ లోకివి సర్వదిగంతభూములన్
జేకొనినాఁడ వయ్యసుర ♦ సిద్ధులు గొల్తురు గాని యింద్రియా
నీకము గెల్చినావె యవి ♦ నిన్ గలుషాత్మునిఁ జేసి నీదును
శ్లోకములన్ హరించినవి ♦ చూడుము రాక్షసలోకనాయకా !

హిర—ఓరీ ! దుర్మార్గుఁడా ! మాకు నీవు వేదాంతములు నేర్పుచుంటివా ?

ప్రహ్లా—లేదు. పరమేశ్వరుని భజింపు మనుచుంటిని

హిర—పరమేశ్వరునిగురించి నాకన్న నెక్కు డెఱింగినవా రెవ్వరు ?
ప్రహ్లా—కావుననే అందఱికన్న నీవు ముందు భజియింపవలసినది.

హిర—అపాత మిదివఱకు వల్లించియే విడిచితిమి.

మ. శిథిలం బైనశరీరపంజరమునన్ ♦ జీవంబులన్ నిల్పి నే
నధికాయాసమునన్ జితేంద్రియుఁడ నై ♦ ధ్యానించితిన్ గాని యా
విధి లేఁ డంతయు భ్రాంతిమూలము మహా♦ విశ్వంబు స్వప్నాభమీ
పథ మెవ్వారికిఁ దోఁచునీశ్వరువృథా ♦ భావింతురజ్ఞానులై .

ప్రహ్లా—కాదు. ఈశ్వరునియందు శూన్యత్వాద్యవస్థ లారోపించినచో నాత్మకు శక్తి గాని సృష్టివైచిత్ర్యము గాని జూపట్టుట కాధార ముండదు. అది మిథ్యావాదము. ఇం దేది నిజమైనను దప్పక యీశ్వరుని ఆస్తికత్వ మంగీకరింపవలసి యుండును.

హిర—సృష్టి కేవలాభాసము. గగనాదుల కాశ్రయ మైనది. దృశ్యప్రపంచనిర్మాణము నిమిత్తమాత్రము. మోహావలోకనంబున స్వసామర్థ్యశూన్యులై శూన్యమైనయీశ్వరు నారాధించుట పుణ్యహేతుక మని పాకులాడువారలబుద్ధి అంధునిచేతిదీపమువంటిది.

ప్రహ్లా—అయ్యో ! ఇదియే నిజమైనచో నీధరాతలమునందు ఈశ్వరప్రతీతి యెట్లు వ్యాపించి యుండును ?

హిర—ఒకయంధుఁడు మఱియొకయంధుని నూతిలోఁ ద్రోసివేసినట్లు ఒకపామరుఁడు మఱియొకపామరునితోఁ జెప్పి యీకట్టుకథ లల్లినారు. ఇది మూలములేని వ్యాఖ్యానము. త్రాడులేని బొంగరము. భ్రాంతి.

తే. గీ. పిల్ల లశనంబు గుడువని ♦ వేళఁ దల్లి
బూచి బూచి యటంచును ♦ పులిమినట్లు
పామరులు ముక్తిమార్గంబు ♦ బడయుకొఱకుఁ
గలఁడు సర్వేశుఁ డని బుధుల్ ♦ పలికినారు.

ప్రహ్లా—సూర్యునియం దంధకార మారోపించినట్టు లీశ్వరునియందు జూనాశి భాసములు గల్పించినంత నే యది నశించునది గాదు.

హిర—ఉండినఁగదా ? నశించుటకును, నిల్చుటకును గురియై యుండును. లేని యొక వంధ్యాపుత్రుని కెన్ని మ్రొక్కిన నేమికార్యము ! నిద్దురఁబోయినవాని మొగముపైఁదుమ్మువైచిన ట్లుండును.

మంత్రి—(చిరునగవుతో) అపరమేశ్వరుఁ డనువాఁ డున్నచో నేను బాలిసత్వము నకుఁ బిలుచుకొని వచ్చియుందును.

ప్రహ్లా—దుర్వాదంబు లేమికార్యము ! పాపపుణ్యములచే మీరు కట్టుఁబడరా ? మీకు మృత్యువే లేదా ? పోనిండు.

శా. కాలారాధ్యుఁ డగోచరుం డమలుఁ డా ♦ కల్యాణసంధాయి దృ
క్పాశిన్ జూడఁగ రానివాఁ డఖిలమున్ ♦ గల్పించునిర్ణేత వే
లీలన్ దోఁచుసమర్థుఁ డీశ్వరుఁడు బా ♦ శిన్ గొల్వగాలేక సీ
వేళాకోళము సేయఁగాఁ దగునె మీ ♦ వీరోక్తు లూఁగాడఁగన్.

మంత్రి—ఓహెూ ! తనపరమేశ్వరుని ఆక్షేపించినందున కభిమానము వచ్చినదిగాఁ బోలును.

హిర—ఏమిరా ! నీపరమేశ్వరుఁ డొక్కసారి నామ్రోల రాఁగలఁడా ?

ప్రహ్లా—చూచుటకు మనము సమర్థులము గాము.

హిర—ఔరా ! మన మనుచుంటివి, మూర్ఖుఁడా ! నేనుగూడ నీయీశ్వరుని గాంచు టకు సమర్థుఁడను గానా ?

ప్రహ్లా—తండ్రీ ! ఆగ్రహింపకుము. భగవంతుని గాంచుట కెవ్వరును సమర్థులు గారు. గోడను మనముజూడఁగలుగుదుముగాని మనలను గోడ చూడఁ గలదా ? అట్లే పరమేశ్వరుఁడు మనలను గాపాడుచు చూచుచున్నాఁడు గాని మనము వాని దర్శింపఁజాలము.

హిర—ఛీ ! నోరుమూయుము దురాత్మా ! నీచుఁడవై వంశనాశకరుఁడవై హరి యనుబాలిశనిషేవకుఁడై యొడంబడిననీవు నన్ను దండ్రియనుగౌరవమైనలేక

అవ్యక్తము లాడుటకు నోరు విప్పితివిగా ?"నీదేవుఁడున్నయెడల యేల కానరాఁడు" అని యెన్నిసారు లడిగినను దానికిఁ బెడర్థము లాడెద వేల? సరియైనసమాధాన మిమ్ము లేదా నాయీశ్వరత్వ మంగీకరింపుము. ఈ యుభయార్థమును గాదంటివేని నీ వింకను బాధింపఁబడెదవు.

ప్రహ్లా—నాయనా ! పరమేశ్వరుని జూచుట కపేక్షింపకుము. ఆయుద్దేశము మాను కొనుము, నన్ను శిక్షింపవలయునని యున్నదా ? తండ్రి వైననీకు నే నొకసొత్తునుగాన నీయిష్టమువచ్చినతెఱుంగునఁ జేసికొనఁగలవు. అందుకు నేను సంతోష పూర్వకముగాఁ దల నొసంగుచున్నాను.

హిర—ఈవెడఁగుమాటలతో నాకుఁబనిలేదు. నాయడిగిదాని కుత్తర మొసంగుము.

ప్రహ్లా—నాయనా ! దేవునిజూచుటకు మాత్రము ప్రయత్నింపకుము. దానఁ జాల ప్రమాద మున్నది.

హిర—ఓరీ ! పశుప్రాయుఁడా ! మఱలఁబ్రమాద మనుచుంటి వేమిరా ?

ప్రహ్లా—అది మహత్తరతేజోమయపదార్థము. కావున దర్శించుటకు మనము చాలము.

తే. గీ. సూర్యుఁ డుదయింపఁ దమి గుహ ♦ జొచ్చినట్లు
గాలి వీవంగఁ గడచుమే ♦ ఘములపగిది
నీశ్వరునిదర్శనంబున ♦ నెల్లవారు
భస్మ మైపోవుదురు భయ ♦ విస్మయముల.

హిర—ఓరీ!నీవీరోక్తు లంతకంతను ముదిరి పోవుచున్నవే, ఇంక మే మందఱము జడిసి పారిపోవలసినదేవా ? దురాత్మా ! ఏఁడిరా నీభగవంతుఁడు. (సాగ్రహముగా)

ఉ. కారులు ప్రేలె దీవు తమ ♦ కంబున నన్నొకభీరుఁ జేసి దు
ర్వారమదీయదివ్యకర ♦ వాలము నైనను లెక్కసేయ కొ
రౌర దురాత్మ నీహరియ ♦ థార్థముగాఁ గలఁడేని జూపుమీ
ధారుణి నెందులోనయిన ♦ దాఁగి వివర్ణత గాంచకుండినన్.

ప్రహ్లా—ఆతఁ డేల వివర్ణుఁ డగును ? పరికించినచో నంతటను బరిపూర్ణుఁడై యున్నాఁడు.

శా. ఆకాశాదిసమస్తభూతములలోఁ ♦ బ్రాణప్రపంచంబులో
లోకాలోక పరీతభూతలమహా ♦ లోకంబులో మాయలోఁ
బాకారిప్రముఖాదిరాక్షసులలోఁ ♦ బాటింపసంపూర్ణుఁడై
యేకాకారత నున్నవాఁడు హరి యూ ♦ హింపంగ దైత్యేశ్వరా !

మఱియు.

క. నీయందును నాయందు న
నూయము లేకొరులయందు ♦ నూదియు మోపం
జేయుట కెడము నొసంగక
యీయఖిలము నిండియుండె ♦ నీశ్వరుఁ గంటే.

హిర—(పెద్దగొంతుకతో) ఓరోరిదురాత్మా ! నీహరి రాక్షసులయందునుగూడఁ గలఁడనుచుంటివిగా ! ఓరిపామరుఁడా ! హరి లేఁడు గాని హరిదాసుఁ డున్నాఁడు రా దురాత్మా ! (అని లేచును.)

ప్రహ్లా—(చేతులు మోడ్చి) నాయనా ! నీవంతగట్టిగా నార్భాటింపవలదు. ఊపిరితిత్తులు పగిలి ప్రమాదము సేయును. నామాటలు విశ్వసింపుము.

హిర—(పెద్దగొంతుకతో) ఔరా ! రాక్షసకులకలంకా ! నీమాటలా విశ్వసింపవలసినవి ? (అని పండ్లు కొఱుకుచు) ఇదివఱ కేమంటివి ? "ఈయఖిలము నిండియుండె నీశ్వరుఁ గంటే" ఎక్కడి యీశ్వరుఁడు ? నేనే యీశ్వరుఁడను. నాకన్న పైవారలెవ్వ రున్నారు ? నన్ను నిర్జింపుధీరోదాత్తుఁడీబ్రహ్మాండకటంబులం దెందేనియుఁ గలఁడా ? ఉన్నచో నాయెదుటకు వచ్చియుండఁడా ఉన్నచోఁ జూపుము దురాత్మా ! చూపుము.

ప్రహ్లా—(అడఁకువతో) నాయనా ! నీవు కేకలువేసి చాలఁగ నలయుచున్నావు. శాంతింపుము. శాంతింపుము.

హిర—ఛీ ! దుర్మతీ ! శాంత మేటికిరా ! నాయీశ్వరత్వము నీ వంగీకరింపవుగాదా?

ప్రహ్లా—(తలను వంచి మిన్నకుండును.)

హిర—ఏమిరా మాటాడవు ? (అని కాలితోఁ దన్నును.)

ప్రహ్లా—నేఁడు నాదేహము పవిత్రమైనది నాయనా ! నీవింక శాంతింపుము. (అని నమస్కరించును.)

హిర—(చేతితోఁ ద్రోసివేసి) ఈనక్కవినయములు మాని నీవాదము నీవు నిలువఁ బెట్టుకొనుము.

ప్రహ్లా—ఇందు వివాద మేమున్నది నాయనా ? నీవు ప్రసన్నుఁడవు కమ్ము. నీ వింతభీకరముగా గర్జించిన నిగొంతుక పగిలిపోయి ప్రాణహాని గలిగించును.

హిర—నాకు ప్రాణహానియా ? నీదేవుని, నీపరమేశ్వరుని ప్రాణముపోవును గాని నాకేమి హానిరా ! బాలికా !

చ. శరములు నాట వీతనువు ♦ శాశ్వతలోహశలాకనిర్మిత
స్ఫురదురుకాంతిసంచయము ♦ సూక్ష్మముగాఁ దలపోసితేమొ యీ
నరసురయక్షరాక్షసగ ♦ ణంబులు గూడిమదీయప్రాణి రా
తిరియును సంధ్యలన్ బగలు ♦ దీయఁగరాదు ప్రగల్భ మేర్పడున్.

ప్రహ్లా—సత్యము. సత్యము. నీవు మహాతపశ్శాలివి. నీకీశ్వరప్రసాదలబ్ధమైన మహత్తరతేజోవిరాజమానము కరతలామలక మైయున్నది. ఇంకనైన నీవు శాంతి వహింపుము తండ్రీ !

హిర—(కత్తిని ద్రిప్పుచు) ఈశ్వరప్రసాద మేమిరా ? చండాలాధమా ! దుర్మతీ! పాపీ ! పారుబోతా !

ఉ. దంభము లేల యాడెదు మ ♦ దంబున ముజ్జగ మొక్కపెట్టునన్
గుంభిని గూల్పజాలు రవి ♦ కోటినిభాంగుని నాదుమ్రోల నో
డింభక ! "ఈశ్వరుం" డని క ♦ డిందివచించెద వాతఁ డున్నని

స్తంభమునందుఁ జూపఁగల • సాహస మున్నవె నీకు దుర్మతీ !

(అని మహాగ్రహముతో పై కెగిరి స్తంభమును దన్ని కత్తితో నఱుకును. నేలఁబడి) ఓరీ ! దురాత్మా ! ఎవఁడవురా ! నారసింహాకృతిని నాగర్భము నీల్చివేయు చున్నాఁడవు. హా ! ప్రాణముపోవుచున్నది. (అని విలవిల కొట్టు కొని యూరకుండును. అందఱును మూగి చూచుచున్నారు.)

ప్రహ్లా—(స్తంభమువంకఁదిరిగి) ఓ జగన్మయుఁడ వైనపరమేశ్వరా ! నీకనేకనమస్కారములు.

మంత్రి—(హిరణ్యకశిపుని జూచి స్వగతము) ఇంక నేమున్నది ? రాక్షసలోక మంధకారమైనది. (ప్రకాశము) ప్రహ్లాదకుమారా ! నీతండ్రి యగుమహారాజు దురాగ్రహంబున జీవనాళంబులు పగిలి యస్తంగతమైనాఁడు గదా! అయ్యో ! మా కింకేమిదిక్కు ? వీనికన్నుల కేమో నరసింహాకృతి గల యొకవిగ్రహముగానవచ్చెడినఁట. అదియే నీవు వచించెడుపరమేశ్వరుఁడేమో ఆయాకృతిని వీనికన్నులకుఁ దోఁచి పరమేష్ఠిచేఁ బడసినవరము లన్నియు నేలపాలు సేసిఈసాయంసంధ్యాసమీపమున రోదసీకుహరమధ్యంబున నగపాలునరత్వమును నగపాలు సింహాకృతి గలయొకవింతరూపమున రూపించి తుదకు హరింపఁజేసెను అతఁడు తప్పక సర్వేశ్వరుఁడేయై యుండవచ్చును. ఇట్లు కాకున్న వీనికి చావు లేదని మున్ను బ్రహ్మదేవుఁడు వరం బిచ్చి యున్నాఁడు

ప్రహ్లా—అదిగో ! అంతటను నిండిప్రకాశించెడు పరమపురుషుని నమ్మి భక్తి నారాధింపుఁడు. చావుపుట్టుకలు లేని మార్గము వానివలన మీరలు బడయఁగలరు.

మంత్రి—ఇంక నీమార్గమునే యనుసరించెదము.

ప్రహ్లా—ఓపరమేశ్వరా ! నీవు స్తంభమునందే గాదు అంతటను గలవు. నీవు నర

సింహాకృతుఁడవే గాదు. సమస్తాకృతులును నీవే. నీవే అన్నిటికిని ఆధారము. నీయందే సమ స్తమును గలదు. దేవా ! నీకనేకనమస్కారము లగుఁగాక ! అవ్య క్తముచే నాతండ్రి నీయెడల భ క్తివిశ్వాసముల్ వీడుకొన్నను వానికి నీవు దర్శన మొసంగితివి గావున వానిప్రాణికిని సుఖవిశ్రాంతి నొసంగుము. (శ్రవణమభినయించి) "సరే" అనుచున్నావా ! ధన్యోస్మి ధన్యోస్మి.

దండకము.

నమో దేవదేవా ! నమో భ క్తసంత్రాణశీలా ! నమో సర్వలోకాంతవాసా ! భవధ్రూప మీక్షింప బ్రహ్మాదులున్ విష్ణురుద్రాదియోగీంద్రులున్ ము క్త సంగంబునన్ పాహి పాహీ హరే యంచుధ్యానింపినన్ ఘోరకాంతారముల్ పట్టినన్ దుర్లభంబై యవాఙ్మానసంబై యతీతాత్మకం బై విడంబించి యొక్కొక్కవేళన్ సమాసించి సౌలభ్యమై నిండి నిండారుమోదంబు గల్పించునీతత్వ మవ్యాజమున్ నిష్క్రియావ్య క్తమున్ నిష్క్రియాస క్త మున్ సచ్చిదానందమున్ శాశ్వతబ్రహ్మ కల్పాళికంటెన్ త్రికాలప్రకారంబు కంటెన్ త్రిమూ ర్తిస్వరూపాళికంటెన్ బరంబై పరాప్రాకృతీమూలమై మోక్ష మై ర క్తపీతాదివర్ణాత్మకంబై సదానందమై సర్వసంపూర్ణమై మాయయైతేజమై తేరి భాసిల్లునీ వీప్రపంచస్వరూపంబునన్ సర్వమున్ జూచుచున్ సర్వమున్ నిండుచుఞ్ సర్వకార్యంబులన్ జేయుచున్ దోఁచి దోబూచి లీలన్ బ్రవర్తించు నీసత్వ మెవ్వార లోలిన్ నిరూపింపఁగా నోప రోదేవదేవా ! త్వదీయ స్వభావోన్నతంబైనతేజంబు సింహత్వమో లేక నారత్వమోయేది గాకుండ సందిగ్ధరూపంబునన్ జూపి యేపారుచున్నట్టిస్వామీ సమస్తోపగామీ సమీ పింపఁగా లేము నీరూఢివిజ్ఞానవేలానిగారంబునన్ మమ్ము నేరీతి రక్షించెదో నీదె భారంబు గా కేమి మా కున్నదో దేవదేవానమ స్తే నమస్తే నమః.

ఓస్వామీ ! ఈనాతండ్రి నిరీశ్వరుండై దురాగ్రహగ్రహోపదేష్టుఁడై ప్రాలు మాలి విగతప్రాణుఁడై పడి యున్నాఁడు. అయ్యో ! వీనిని నీవు బ్రతికింపఁ జాలవా ? నీవు సర్వశ క్తుఁడవు గావా ? మహాత్మా !

అకాశవాణి—ఓప్రహ్లాదా ! హిరణ్యకశిపునియాయువు చెల్లిపోయినది మఱి వీని జీవింపఁజేయుటకు దైవోద్దేశము గాదు. దురాత్ములకు రావలసినయగపాటు లిట్టివే యని ప్రపంచమునఁ బ్రకటింపఁబడవలయును. దుష్టవధ కాకున్న దేశము శాంతింపదు. నీవు ప్రసన్నుఁడవు కమ్ము.

ప్రహ్లా—ఓపరమేశ్వరా నీయాజ్ఞకు నేను శిరసావహించుచున్నాను.

మ. త్రిజగంబుల్ సృజియించి యుంచినలసత్ ♦ ధీరుండవున్ నీవె యా
రజనీవారునిఁ జేయఁజాలినపర ♦ బ్రహ్మంబునున్ నీవె యా
విజయం చీతని కిచ్చి చూచినమహా ♦ విశ్వాసియున్ నీవె నీ
నిజసంకల్పము గాక వేరు గలదే ♦ నిర్వ్యాజతేజోమయా.

ఓయతేంద్రియుఁడ వైనసర్వేశ్వరా ! నాప్రార్థన మొక్కటి యాలింపుము.

తే. గీ. నన్ను నీభక్తుఁ డనుచు నీ ♦ కున్నయెడల
హాని యొరులకు భక్తుచే ♦ రానియెడల
జనకు నిర్జించె ప్రహ్లాదుఁ ♦ డనినమాట
జగతి లేకుండ సేయు మో ♦ శాంతరూప !

భరతవాక్యము.

తే. గీ. ఈతిబాధలు దొలఁగి ధ ♦ రాతలంబు
చెడునిరీశ్వరవాదంబు ♦ విడిచి ప్రజలు
దానవవధ యుడిగి కాల ♦ మాన మమరి
తనరు గావుత మాచంద్ర ♦ తారకముగ.

ఇది శ్రీయాఖైలలీషాగురువర ప్రసాదలబ్ధ కవితావిశేష మొహియ్యదీన్ బాద్షా గురుజ్యేష్ఠపుత్ర చాన్బియాంబాతనూజ కనయాషాగ్రజన్మ ఉమర్ ఆలీషా కవి విరచితమైనదానవవధ యనుప్రహ్లాదహిరణ్యకశిపనాటకము సర్వమును షష్ఠాంకము సంపూర్ణము.

శ్రీ విజ్ఞాన విద్యాపీఠ సభా సభ్యులచే ప్రకటించు

# "బ్రహ్మర్షి" ఉమర్ ఆలీషా

## క వి కృ త ము లు

---

1. శ్రీ మహమ్మదు రసూలువారి చరిత్ర
2. దానవవధ (నాటకం)
3. మహాభారత కౌరవ రంగము (నాటకం)
4. సూఫీవేదాంతదర్శము
5. అనసూయ (నాటకం)
6. కళ 
7. ప్రభాత కథావళి (కథలు)
8. విషాద సౌందర్యము 
9. విచిత్ర బిల్హణీయము
10. బ్రహ్మ విద్యావిలాసము 
11. స్వర్గమాత (కందార్ధములు)
12. తత్త్వసందేశము
13. పరతత్త్వకీర్తనలు
14. చంద్రగుప్త (నాటకం)
15. ఉమర్‌ఖయ్యామ్
16. మణిమాల(నాటకం)
17. శాంత
18. ఖండకావ్యములు
19. బర్హిణీదేవి
20. పద్మావతి (నవల)
21. షాతత్త్వము
22. సాధనపథము

---

శ్రీ వేంకటేశ్వర ప్రెస్, పెంటపాడు-534 166